ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు, ఆరోగ్యాది అనేక విషయాలు తెలుసుకోండి... ఫేస్‌బుక్



Like us to follow

@mohanpublications


ఆధ్యాత్మిక గ్రంథ నిలయం

మోహన్ పబ్లికేషన్స్

కోటగుమ్మం, అజంతా హోటల్ ఎదుట,

రాజమహేంద్రవరం - 533101.


# భాగవతకథ

## షష్ఠ భాగము


గ్రంథకర్త - శ్రీ ప్రభుదత్త బ్రహ్మచారి

అనువాదం - శ్రీ కుందుర్తి వేంకట నరసయ్య



# భాగవత కథ

(శ్రీ మద్భాగవత దర్శనము)

## షష్ఠ భాగము

హిందీ మూలము

శ్రీగంల ప్రభు దత్త బ్రహ్మచారి మహారాజు

ఆంధ్రానువాదకులు, శ్రీరామ శరణ్

శ్రీ కుందుర్తి వేంకట నరసయ్య

శ్రీ వేంకటేశ్వరార్ష భారతీ ధర్మసంస్థ

హైదరాబాదు.

# తొలి పలుకు

బ్రహ్మ సృష్టిలో మానవుఁ డుత్తమోత్తముఁడుగా పరిగణింపఁబడుచున్నాఁడు. అందు కితర జీవజంతువులకు లేని జ్ఞాన మతని కుండుటయే కారణము. భగవంతుఁడు కరుణాళువై ప్రసాదించిన యీజ్ఞానము సాహాయ్యమున మానవుఁడు తురీయ పురుషార్థమైన మోక్షమును బొందుటకు యత్నింప వలయును. అతఁడట్లు చేయనిచో నాహారభయ నిద్రాదులతోఁ గాలము పుచ్చుచుండు నితర జీవులకును అతనికిని ఆకారమున మాత్రమే భేదముండును. మోక్షప్రాప్తికి మన పూర్వులు మూఁడు మార్గములను నిర్దేశించి యుండిరి. అవి జ్ఞాన, కర్మ, భక్తి మార్గములు. ఈ కలియుగమున వీనిలో మొదటి రెండు మార్గములను అవలంబింపఁ జాలువా రరుదుగా నుందురు. ఇంక మూఁడవదైన భక్తి మార్గమును స్త్రీలనక పురుషులనక, బాలురనక వృద్ధులనక, పండితులనక పామరులనక అందఱు ననుసరించి మోక్షసౌధమును జేరవచ్చును.

వేదార్థోపబృంహణార్థమై భగవంతుఁడగు కృష్ణద్వైపాయనుఁడు బ్రహ్మసూత్ర శ్రీ మద్భాగవతములతోపాటు పదునెనిమిది మహాపురాణములను, ఉపపురాణములను కూడ రచించి యుండెను. ఇవి కథోపాఖ్యాన పూర్వకముగా వేదనిక్షిప్తములైన ధర్మ నీతితత్త్వములను జిజ్ఞాసువు లందఱికిని సుబోధ మొన

గవతము నందు ప్రపంచింపఁబడినది. మత్స్యకూర్మాద్యవ తారములన్నియు నవతార ప్రయోజనములను నిర్వహించిన మాట వాస్తవమేయైనను "కృష్ణస్తు భగవాన్ స్వయ" మ్మను సూక్తి ననుసరించి యిందు దశమస్కంధమున శ్రీ కృష్ణుని జన్మాది వృత్తాంతములు విపుల తరముగా వివరింపఁబడినవి. భాగవత తారహారమునకు దశమస్కంధము తరళ ప్రాయము.

శ్రీ మద్భాగవతమున కర్మజ్ఞాన విషయములు కూడ ప్రతిపాదింపఁబడినను భక్తికే అందు ప్రాధాన్యము. మోక్ష ప్రాప్తి కదియే పరమసాధనమని యిది బోధించును. అందలి కథోపాఖ్యానము లన్నియు భక్తిమహత్త్వ ప్రతిపాదనము నందే పర్యవసించును. జగద్గురు శ్రీ శంకరాచార్యులవారు కూడ భక్తిని నిరసింప లేదనుటకు "మోక్షసాధన సామగ్ర్యాం భక్తి రేవ గరీయసీ" అని వివేకచూడామణిలో చెప్పియుండుట నిద ర్శనము. సత్యముకూడనంతే. కలియుగము నందలిజనులు కర్మ జ్ఞాన మార్గముల నవలంబింపఁజాలని వారగుటచే భక్తినే ఆశ్ర యింపవలయును. సంసార సాగరతరణమున భక్తియే నిరపాయమైన నౌక. వ్యాసభగవానుఁడు భాగవతము నిగమ కల్ప తరువు నుండి జాఱిన ఫలమని చెప్పియుండెను. అది కల్పతరువువలె భక్తులకు సర్వాభీష్టముల సిద్ధింపఁ జేయును.

వ్యాసుఁడు సంస్కృతమున రచించిన శ్రీ మద్భాగవత మును మహా భక్తుఁడును, కవిపుంగవుఁడునైన బమ్మెర పోత రాజు గద్య పద్యాత్మకముగా తెలుఁగున కనువదించెను. అతఁడు

రచించిన భాగవతము నందలి కొన్ని భాగము లే కారణము చేతనో శిథిలమగుటచే వాని నతని మిత్రులో శిష్యులోయైన గంగన, సింగన, నారయ యనువారు పూరించిరి. అయినను తెలుఁగున భాగవతము మాట విన్నంతనే పోతరాజే తలంపునకు వచ్చును. ఆంధ్ర దేశమున నతని భాగవతమున కున్నంత ప్రచారము మతే గ్రంథమునకును లేదనుటలో నతిశయోక్తి లేదు. అందుకతని పద్యములందలి ధారాశుద్ధియు నాన్యతో దృశ్యమైన మాధుర్యమును కారణములు. అందలి పద్యము లొండో, రెండో నోటికి రాని అక్షరాస్యుఁడు మొన్న మొన్నటి వఱకు ఆంధ్ర దేశమున నుండెడి వాఁడు కాదు. కాలవైపరీత్య ముచే నిప్పుడందలి పద్యములను కంఠగతము లొనరించుకొను వారి సంఖ్య చదువుకొన్న వారిలోనే చాల తక్కువైనది. పోత రాజు సంస్కృత భాగవతమును యథాతథముగా నాంధ్రీకరించి యుండలేదు. భక్తిభావ భరితమైన భాగముల నాతఁడు పెంపొందించి యుండెను. అది గాక పద్యకావ్యముల నర్థము చేసికొనఁ గలవా రిప్పుడెందఱో యుండరు. అందుచే సంస్కృత భాగవతమునకు రెండు మూడు వచనానువాదములు కూడ వెల సినవి. భాగవతమువంటి ఉత్తమ గ్రంథమెంత అధికముగా ప్రచారము పొందిన లోకమున కంత మేలు కలుగును.

తపోనిష్ఠాగరిష్ఠులు, యోగిపుంగవులు, భక్తశిఖామణు లునైన శ్రీశ్రీశ్రీ ప్రభుదత్త బ్రహ్మచారిగారు జగద్ధితార్థమై శ్రీ భాగవతము నందలి విషయములను కథాదృష్టాంతానుభవ

పూర్వకముగా సరళసుందరమైన హిందీ భాషలో నలువది సంపుటములుగా వచన రూపమున రచించి యుండిరి. అది హిందీ భాషాభిజ్ఞుల అదృష్టము. వానిని భక్తవరేణ్యులు శ్రీ రామశరణ్ కుందుర్తి వేంకటనర్సయ్య గురుపుంగవులు సర్వసుబోధమైన భాషలో తెలిఁగించి యుండిరి. భక్తిప్రధానమైన శ్రీ మద్భాగవతమును భక్తవరేణ్యుఁడైన పోతరాజాంధ్రీకరించుటవలన నాంధ్రలోకమున కెంత మహోపకారము జరిగినదో భక్తచూడామణులైన శ్రీ ప్రభుదత్తబ్రహ్మచారి గారి హిందీ గ్రంథమును భక్తిసముద్రులైన శ్రీ కుందుర్తి గురుపుంగవు లాంధ్రీకరించుట వలన నంతమహోపకారము జరిగినది. ఆ గ్రంథమునకు శ్రీ మద్భాగవతదర్శనమను పేరు సార్థకము. అది రెండుసార్లు ముద్రితమైనది. కాని ప్రతులిప్పుడు లభ్యములగుట లేదు. అది చూచి నిత్యధర్మకార్యపరాయణులును వదాన్యశేఖరులునైన భక్తులొక రా సంపుటములను పునర్ముద్రించుట వలన లోకమునకు మేలు కలుగునని అందుకు సంకల్పించిరి. వారు సిద్ధ సంకల్పులు. వారి సంకల్పబీజము వృక్షమై యిప్పుడీ గ్రంథముల రూపమున ఫలించినది. ఆంధ్రు లాఫలమును ఆస్వాదించి ఆనంద పారవశ్యము పొందుదు రనుటలో సందేహము లేదు.

ఆ భక్తులే శ్రీ వేంకటేశ్వరార్షధర్మ భారతీధర్మసంస్థను స్థాపించి దాని పక్షమున అష్టాదశ మహా పురాణములను తెలుగు లిపిలో తాత్పర్య సహితముగ ముద్రించి ఆంధ్రులకు మహోపకారము చేయుచున్నారు. ఈ భాగవతకథా సంపుటములు కూడ శ్రీ వేంకటేశ్వర ఆర్షభారతీ ధర్మసంస్థ పక్షముననే ముద్రింపఁబడుచున్నవి.

శ్రీ వేంకటేశ నామ్నా
భారత సంస్కృతిప్రవర్ధనార్థాయ
సంస్థాపితేయం ధర్మ
సంస్థార్షా జయతు భగవతః కృపయా.

— దివాకర్ల వేంకటావధాని

నిగమకల్పతరో ర్గళితం ఫలం
శుకముఖాదమృతద్రవ సంయుతం
పిబత భాగవతం రస మాలయం
ముహురహో రసికా భువి భావుకాః

— సంస్కృత భాగవతము

— శ్రీ మదాంధ్ర మహాభాగవతము

# విషయ సూచిక

విషయము | పుట సంఖ్య

| విషయము | పుట సంఖ్య |
| --- | --- |

శ్రీ రామ

# శ్రీ భాగవత కథ

## విదుర మైత్రేయ సంవాదోపోద్ఘాతము

శ్లో॥ ఏవమేతత్ పురాపృష్టో మైత్రేయో భగవాన్ కిల
క్షత్త్రా వనం ప్రవిష్టేన త్యక్త్వా స్వగృహమృద్ధిమత్॥
యద్వా అయం మంత్రకృద్వో భగవానఖిలేశ్వరః
పౌరవేంద్ర గృహం హిత్వా ప్రవివేశాత్మ సాత్కృతమ్.
—శ్రీభాగ. 3 స్కం. 1 అ. 1—2 శ్లో.

క. మనుజేంద్ర విదురుఁడంతకు
మును వనమునకేఁగి యచట మునిజనగేయున్
వినుత తపోధౌరేయున్
ఘను ననుపమ గుణవిధేయుఁ గనె మైత్రేయున్.

క. కనుఁగొని తత్పాదంబులు
తన ఫాలము సోఁక మ్రొక్కి తగ నిట్లనియెన్
మునివర సకల జగత్పా
వన చరితుఁడు కృష్ణుఁ డఖిలవంద్యుం డెలమిన్.

క. మండిత తేజోనిధియై
పాండవ హితమతిని దూతభావంబున వే
దండపురి కేఁగి కురుకుల
మండనుఁడగు ధార్తరాష్ట్ర మందిరమునకున్.

తే. చనఁగనొల్లక మద్గృహంబునకు భక్త
వత్సలుండగు కృష్ణుండు వచ్చుటేమి
కతము నాకది యెఱిఁగింపు కరుణతోడ
ననుచు విదురుండు మైత్రేయు నడిగెననిన.

—శ్రీమదాంధ్రభాగవతము.

సాంసారికుల స్మృతివస్తువునందుఁ బెట్టఁబడిన మోహము సాంసారికబంధనమును దృఢము కావించును. ఆ మోహమునే భగవత్సంబధముచే భగవంతుని వైపునకును, భక్తులవైపునకును బోనిచ్చిన, దానివలన భగవంతునియందు ప్రీతి యధికమగును. తీర్థములలో నేమున్నది ? వానికి భగవతునితోడను, భాగవతుల తోడను సంబంధము కలదు. అచ్చటికి వెళ్ళుటచే భగవత్స్మృతి కలుగును. భగత్పాదపదోద్భవమగు జలములచేఁ బ్రవహించు చున్నదే గంగానది. కౌసల్యానందవర్ధనుఁడగు రఘునందనుఁడు వివిధ మనుష్య లీలల నొనర్చినదియే యీ పురము. ఇది శ్రీరామ జన్మస్థానము. ఇది దశరథ భవనము. ఇదియే కనకభవనము. ఇది సీత వంట యిల్లు. ఇచ్చటకు స్వామి వనవాస సమయమున విచ్చేసెను. కావున నీ చిత్రకూటము సాకేతమువంటిదే. వేని యొక్క పేరు పలుకుటచేతనే భగవత్స్మృతి కలుగునో, భగవ ల్లీలలతో ప్రత్యక్షముగనో అప్రత్యక్షముగనో వేనికి సంబంధము కలుగునో అవియే పావన తీర్థములు. ఇచ్చట నేను బుట్టితిని; ఇది మా అత్తగారు నాకు నివసించుట కిచ్చిన యిల్లు. ఇచ్చట వారికి స్మృతిచిహ్నములు వేయవలెను. ఇచ్చటి వారి నామములు

లిఖింపవలెను. వారికి చక్షువరాతి సమాధి నేర్పఱుపుఁడు అని సాంసారిక స్మృతులు నిర్మించుచుందురు. అజ్ఞానులారా! ఈ సజీవశరీరమునే వదలి వెళ్ళిపోఁగా, నీ నిర్జీవములగు నిటుకలు, రాళ్ళెన్ని రోజులు సజీవమొనర్పఁగలవు? కావున ముముక్షువులును, భగవద్భక్తులును సమస్త వస్తువులలోను భాగవతులయొక్కయు, భక్తులయొక్కయు స్మృతులకే ప్రాధాన్యమొసంగెదరు. సౌభాగ్యవశమునఁ దన యింటి కెవరైన సాధువు విచ్చేసెనా, ఆతని తేజస్సును, ఆతని సుందరచిత్రమును స్మృతిరూపమున వ్రేలాడఁ దీయును. ఆతని పాదుకలు స్థాపించును. చరణచిహ్నములకుఁ బీఠము నొనర్చును. ఇంటిలోఁ బూజ నేర్పాటు కావించును. ఉత్సవములకు వేరువేరుస్థలముల నేర్పఱచును. ఈ మూలముగ మాటిమాటికి స్మరణ కలుగునట్లు చూచును. పూజాగృహముతో నా వస్తువుంచబడినది; జన్మోత్సవము జరుగునరుగు నలుకవలెను. రథయాత్ర జరుగు కొట్టును బాగుచేయింపవలయును మొదలగునవి. భగవంతుఁడు స్వయముగ సశరీరుఁడై మానుషవిగ్రహమును ధరించి వచ్చిన యిల్లుగల యా భక్తుడే ధన్యుఁడు. మహాభాగుఁడును, పరమభాగవతోత్తముఁడును, జగద్వంద్యుఁడు నగు విదురుఁ డట్టి భాగ్యశాలులగు భగవద్భక్తులలో నొకఁడు. ఆతఁడు వందనీయుఁడు, పూజనీయుడు, ప్రాతఃస్మరణీయుఁడు. ఆతని యింటిలోని ధూళికణము పరమపవిత్రము. ఏలయనఁగా పతితపావనుఁడును, బరాత్పరుఁడును, బరమేశ్వరుఁడును, బాండవపతియు నగు ప్రభుపాదపద్మపరాగ మచ్చట బడినది. ఆతని గృహ మీ కారణముచేఁ

గోటి తీర్థములకంటెను శ్రేష్ఠమైనది. దీనినంతను స్మరించియే గద్గదకంఠముతో శుకమహాముని యిట్లనెను,

శుకుఁ డిట్లనెను :- "రాజా ! నీవు నన్నుఁ బ్రశ్నించుచున్నదే మహాత్ముఁడగు విదురుఁడు మైత్రేయ మహాముని నడిగెను."

మధ్యలోనే మహారాజిట్లనెను ;- "ప్రభూ ! మైత్రేయ మహామునిని విదురుఁ డెచ్చట దర్శించెను ? మైత్రేయుఁడు హస్తినాపురమునకు వచ్చెనా ?"

శుకుఁ డిట్లనెను :- "లేదు రాజా ! మైత్రేయుఁడు హస్తినాపురమునకు రాలేదు. విదురుఁడు పరమసమృద్ధిశాలియు, నైశ్వర్యయుక్తమును, సర్వశ్రేష్ఠమును, సర్వసౌభాగ్యయుక్తమునునగు, నతిశయ సుందర భవనమును వదలి దుఃఖమనస్కుఁడై వనమునకుఁ బోయెను. ఆ సమయమున హరిద్వారమునఁ గల కుశావర్త క్షేత్రమున మైత్రేయునితో సంవాదము జరిగెను."

ఇది విని పరీక్షిన్మహారాజు ఆశ్చర్యచకితుడై యిట్లడిగెను:- "ప్రభూ ! మీరు విదురుని భవనమునుగూర్చి యిన్ని యిన్ని ప్రశంసలు చేసినారు. ఎన్నో శ్రేష్ఠోపమానము లొసంగినారు. దీనికి నాకు చాల ఆశ్చర్యము కలుగుచున్నది. విదురుఁడు మా పితామహులకుఁ బినతండ్రియైనను దాసీపుత్రుడని వినియుంటిని. ఆతనికి రాజ్యమునుండి ఏదైన సాధారణగృహము లంభించియుండ వచ్చును. అట్టి సాధారణపు గృహమును మీరింతగాఁ బ్రశంసించు

చున్నారు. అది పరమసమృద్ధిశాలి యని చెప్పుచున్నారు. ప్రపంచములోఁ గల శ్రేష్ఠములగు రత్నములు, మణిమాణిక్యములు కల యీ కౌరవ భవనములను జేరునకైనఁ బేర్కొనలేదేమి ?"

ఇది వినఁగానే శుకుని నేత్రకమలముల హర్షాశ్రువులునిండి మంచుబిందువులవలె మెల్లమెల్లగాఁ గపోలములనుండి జారి వక్షఃస్థలమును దడిపెను. అశ్రువులను దుడిచికొని శుకుఁడిట్లనెను :—

"రాజా ! మహాభాగుఁడగు విదురునింటి కెన్నియుపమానము లొసంగినను అవి తరుగే కాఁగలవు. ఆహా ! ఆతఁడెంతటి భాగ్యశాలి ! ఆతని గృహ మెంతటి పరమ పవిత్రమైనది ! ఆతని గృహములోని ధూళిని స్పృశించినప్పటికిని పాపి పరమపావనుఁడు కాఁగలడు. అట్టి గృహమును విదురుఁడనిచ్ఛాపూర్వకముగఁ ద్యజించెను. దుష్టు లా పరమప్రియావాసమును ద్యజించుటకు వివశునిగాఁ జేసిరి. రాజా ! మీ పితామహులకు సంధిదూతయై హస్తినాపురమునకు విచ్చేసి నందనందనుఁడు విదురుని గృహమును దన పాదధూళిచేఁ బావనము కావించెను. పిలువకయే స్వగృహమునకు వెళ్ళినటులు సంకోచమేమియును లేక దానిలోఁ బ్రవేశించెను. అచ్చటికివెళ్ళి అరఁటిపండ్ల నడిగి తినలేదు, అరఁటి తొక్కలనుదినెను."

అంత పరీక్షిన్మహారా జిట్లడిగెను :— "ప్రభూ ! మహాభారత ప్రసంగములో నేనీ కథను వింటిని. కాని దానిలో నరఁటి

తొక్కలు తినిన విషయము లేదు. ఆ ప్రసంగమును మీరు నాకు వినిపింపవలయును."

ఇది విని శుకుఁడు మహారాజును బ్రశంసించుచు నిట్లనెను:- "రాజా ! నీవు ధన్యుఁడవు. నీ మనస్సు సదా శ్రీకృష్ణచరణార విందములయందే లగ్నమైయున్నది. కావున నీకు శ్రీకృష్ణకథా మాత్రము చిక్కెనా, నీవు విస్తారముగ వినఁగోరెదవు. మహా రాజా ! ఈ ప్రసంగము చాల పెద్దది. కావున విస్తారముగఁ జెప్పక నీకు దీనిని మిక్కిలి సంక్షేపముగఁ జెప్పెదను.

అజ్ఞాతవాససమయమును బూర్తికావించి మీ తాతలు తమ రాజ్యమును బొందుటకై ప్రయత్నించుచుండిరి. శాంతి మయమగు నుపాయములవలనఁ బ్రయోజనము లేకపోఁగా, వారు సైన్యమును బ్రోవుచేయ నారంభించిరి. కాని ధర్మరాజునకు యుద్ధము చేయ వలెనని లేదు. ఆతఁడు జాతిద్రోహమునకును, గులనాశనమునకును మిక్కిలిగ భయపడెను. ఆతని యభిప్రాయమును గ్రహించి భక్తవత్సలుఁడగు మధుసూదనుఁడాతనితో నిట్లనెను :— "రాజా ! నీవింతగాఁ జింతించెదవేల ? నేను నీకు దూతనై హస్తినాపురము నకు వెళ్లెదను. ఉద్ధతులగు కౌరవులను జీవాట్లుపెట్టి వారిని సరి యైన మార్గమునకుఁ దీసికొనివచ్చెదను. మన బలపౌరుషములను గూర్చి చెప్పెదను. వారికి ఉచ్చనీచములనుగూర్చి చెప్పెదను. మీ సందేశమును జెప్పెదను. నాసొంతముగ నేనేమియు వ్యవహా

రింపను. ఇంత చేసినను ఆదుష్టులు వినకుండిరా, వారిని నే నచ్చటనే చంపివేసెదను. నీవు చింతను వీడుము. నేను మీకు సేవకుఁడనై యుండఁగా మీరు దుఃఖితులగుటయుఁ జింతించుటయు మంచిదికాదు."

ధర్మజుఁడు కన్నుల నీరుగార్చుచు నిట్లనెను :— "మధుసూదనా ! నీవొక్కఁడవే మాకు గతి. అశరణశరణా ! మేము మునిజనవంద్యములగు నీ పదారవిందములనే పట్టుకొంటిమి. పక్షి తన గ్రుడ్ల నెట్లు సదా రక్షించుకొనునో అట్లే నీవెల్లప్పుడును మమ్ములను రక్షించుచుందువు. అట్టివాఁడవగు నిన్ను యాదవేంద్రా ! ద్వారకానాథా ! దూతగాఁ బంపుట నా కిష్టములేదు. ఈ పని నీకుఁ దగినది కాదు. ఇది నీ పదవీ ప్రతిష్ఠా, మహిమ, సమ్మానములకు సర్వథా విరుద్ధమైనది. ఎవరినైన బుద్ధిమంతుడగు వ్యక్తిని నీవు దూతగాఁజేసి కౌరవుల దగ్గఱకుఁ బంపుము."

అంత మేఘగంభీరస్వరమున వాసుదేవుఁ డిట్లనెను :— "రాజా ! నీ విట్లు మాట్లాడుచున్నావేల ? ఏదైనఁ బని చేయవలసి యున్నప్పుడు ప్రతిష్ఠను జూచుకొనవచ్చునా ? తన శరీరము లోని మలమూత్రములను దుడిచికొనుట అవమానముగఁ దలచునా ? అట్టి విషయములు ఇతరులకు సంబంధించినవి. మీపని నా పనియే. నేను సంధిచేయఁగలిగితినా, లోకమున గొప్ప కీర్తి నాకు లభింపఁ గలదు. పుణ్యమును లభింపఁగలదు. మీరానందముగ నుండుటయే

ధర్మాత్ముఁడు నగు ధర్మరాజును సామ్రాజ్యపదమున నభిషిక్తుని గావించి నేనానందించెదను. కుంతీనందనుఁడు సింహాసనాసీనుఁడు కానంతవఱకు నాకు ఆనందములేదు."

అశ్రువులను రాల్చుచు ద్రౌపదీదేవి యిట్లనెను:— ప్రభూ! సంధియొనర్చువేళ నీ విఱియఁబడిన వేణిని మఱవ వలదు. భక్త వత్సలా! ద్యూతసభలోఁ జీరనై రక్షించునపుడు నా వేణిని ముడు వుమని బలవంతపెట్టితివి. ఆ సమయమున నేను జేసిన ప్రతిజ్ఞను సర్వాంతర్యామివగు నీవు జ్ఞాపకముంచుకొనవలెను."

కొంచెము క్రోధముతో భగవానుఁడిట్లనెను:- "దేవీ! నేను వెళ్లఁబోవునపుడు నీవా మాటను జ్ఞాపకము చేయకుము. ఆ విష యము లన్నియు శూలములవలె నా డొక్కలో గ్రుచ్చుకొనియే యున్నవి." అని వాసుదేవుఁడు ధర్మరాజునకు నమస్కరించి, యితరులచే నమస్కారములను గొని, తన దివ్యరథము మీఁదకుఁ బోయి కూర్చుండెను. సాత్యకి ఆతని ప్రక్కనే కూర్చుండెను. సారథి రథమును ద్రోలఁగా నది ఢణఢణ శబ్దముతో వెడలెను. విషయభోగసామగ్రిని గాంచినఁ గాముకుల చిత్తము లెట్లు చంచలము లగునో, అట్లే ఆ రథముపైనున్న విశాల గరుడధ్వజము వాయు వుచేఁ జంచలించుచుండెను.

సంధిదూతయై శ్యామసుందరుఁడు వచ్చుచున్నాఁడను సంగతిని వినఁగానే ధృతరాష్ట్రుని చిత్తము చంచలమయ్యెను.

భీష్మ, ద్రోణ, విదురాదుల సమ్మతిచే నాతడాతనికి అభూత పూర్వమగు స్వాగతమొసంగ నిశ్చయించెను. హస్తినాపుర వీధు లన్నియు సుందరసామగ్రులచే నలంకరింపఁబడినవి. అచ్చటచ్చటి తోరణ, పతాకములు ప్రేలాడఁగట్టఁబడినవి. చౌకులలో ధూపా గరువులు మొదలగు సుగంధద్రవ్యములు ధూపములు వేయఁబడినవి. సర్వత్ర సుగంధ పుష్పమాలలు వ్రేలాడఁగట్టఁబడినవి. గొప్ప విశాలద్వారములు నిర్మింపఁబడినవి. నగరములోని ముఖ్యులును, భీష్మ, ద్రోణ, అశ్వత్థామ, భూరిశ్రవో, ధృతరాష్ట్రపుత్రు లందఱును ఆతనికి స్వాగత మొసంగ నగరము వెలుపలకుఁ బోయిరి. భగ వద్దర్శనోత్కంఠచే నగరములోని ఆబాలవృద్ధులు తమతమ గృహములనుండి భగవంతుని దర్శించుటకు రథముకడకుఁ బరు విడిరి. రాజపథమున కటునిటు నుండిన మేడలపైకెక్కిన నగరములోని స్త్రీపురుషుల బరువుచే నవి కూలిపోవునా యను నట్లుండెను. ఈ విధముగ బాగుగా నలంకరింపఁబడిన సమృద్ధ శాలియగు నగరములోనికి కృష్ణుఁడు పెండ్లి కొడుకు అత్తవారింటఁ బ్రవేశించినట్లు ప్రవేశించెను.

అందఱును ముందుకుపోయి భగవంతునకు స్వాగత మొసంగిరి. భగవానుఁడు వృద్ధులకును, బూజ్యులకును బ్రణామము కావించెను. చిన్నవారు ఆతనికి నమస్కరించిరి. ఈ విధముగ నందఱును గలసికొని రథమును రాజమార్గమునఁ బోనిచ్చిరి. రాజమార్గమంతయు దర్శనార్థులగు స్త్రీ పురుషులచే నిండిపోయెను.

కులీనలగు స్త్రీలు మేడలపైనెక్కి భగవంతునిమీదఁ బుష్పవర్షమును గురియించుచుండిరి. వివిధ వర్ణాంబరములను ధరించిన కన్యకలు భగవంతునకు మాలలు వైచి, యవాంకురములను మస్తకమునఁ జల్లి, లాజవృష్టిని గురియించిరి. ఈవిధముగ నందఱచే సత్కృతుఁడై శ్రీకృష్ణుఁడు ధృతరాష్ట్రుని రాజభవనమునకుఁ బోయెను. మూఁడు దేవిడీలను దేవకీనందనుఁడు రథముమీఁద నుండియే దాఁటెను. మూడవ దేవిడీ చివర రాజసభాభవనమందు ఇంద్రుఁడు తన దివ్యరథముపైనుండి దిగినట్లు భగవానుఁడు దిగఁగా, ధృతరాష్ట్రుఁడు నిలుచుండి ఆతనికి స్వాగతసత్కార మొసర్చెను. పురోహితులు మహారాజునకుఁ బదులుగాఁ బురుషోత్తముని రాజోచితముగ రాజసామగ్రులచేఁబూజించిరి. నానావిధములగు వ్యంజనముల నాతని సమ్ముఖమున నుంచిరి. ఆతఁడు శాస్త్రరీతిచే సాధారణ పూజల నన్నిటిని స్వీకరించెను గాని, యీ వ్యంజనములవైపు దృష్టినైన సారింపలేదు. భోజనము వేళయయ్యెను. దుర్యోధనుఁడు భగవానుని భోజనమునకుఁ బిలిచెను; కాని యాతఁడంగీకరింపలేదు. ఆతఁడు లేచి తన రథముపైఁ గూర్చుండి సారథితో రథమును నడుపుమనెను. సాత్యకి 'వెళ్లుట యెచ్చటికి' కనెను.

కంసనిషూదనుఁడు గంభీరముగ 'విదురునింటికిఁ బోనీయు' మనెను. రథ మట్లే పోవుచుండెను. సర్వత్రనిశ్శబ్దముగ నుండెను. కొందఱు రథములమీఁద నెక్కి భగవాను ననుగమించుచుండిరి. అప్పుడాతఁడిట్లనియెను:— "నావెంట నెవరును

రానవసరములేదు. ఈ సమయమున నేను విదురునింటికి వెళ్ళు చున్నాను. మధ్యాహ్నోత్తరమున మీరందఱు నను( గలసికొన వచ్చును." భగవదాజ్ఞచే నందఱును వెనుకకు( దిరిగిపోయిరి. భగవానుని రథము విదురుని వాకిట నిలిచెను. విదురు (డాసమ యమున నింట లే(డు. గృహాంతరమున విదుర పత్ని యొంటరిగ నుండెను. అప్పుడామె పరమపావనమగు భాగీరథీమృత్తికతో వెండ్రుకలను రుద్దుకొనుచుండెను. రాజా! ఆరోజులలో గొప్పయింటి స్త్రీలు కూడ గంగారజముచే( దమ వెంట్రుకలను రుద్దుకొని తలంటు పోసికొనెడివారు. ఇప్పటి వారు కొందఱు తైలమురాచుకొని సోడా, కుంకుడు, సీకాయ, సున్నిపిండి మొదలగువానిలో( గొన్ని సుగంధ ద్రవ్యము లను గలపి ముద్దచేసి తలరుద్దుకొందురు. నురుగు వచ్చుటచే మురికి పోవునుగాని వెంట్రుకలకును, మస్తిష్క మునకును, జర్మమునకును హానిప్రదము. వానివలన వెంట్రుకలకు మిక్కిలి రూక్షత కలుగును. చర్మముమీ(ద రుద్దుటచేత స్వాభావిక సుందర చర్మముయొక్క ప్రాకృతిక స్నిగ్ధత నశించును. రెండు రోజు లట్లు రాయకపోయెనా ముఖము తేజోవిహీనమై విరియు నట్లుండును. ఆ విరుపు ఇంతని చెప్పుటకు వీలులేదు. మరల నూనెను రాచిననే శరీరమునకు స్నిగ్ధత యేర్పడును. కాని గంగా రజము ఆరోగ్యమునకును, మురికి పోవుటకును, చర్మమునకును జాల హితకరముగ నుండును. గంగారజము తనలో(గల స్వాభావికమైన మెత్త(దనముచే వెంట్రుకలను, శరీరమును గోమలమొనర్చును. దానిని రుద్దుకొనిన తర్వాత నింక నూనె అవసరము లేదు. రూక్షత కలుగనే కలుగదు. శరీర మలమును బో(గొట్టుటయేకాక,

హృదయ మలమునుగూడ కడిగివేయును. చర్మ సౌందర్యమును పెంచును. ఋషుల యొక్కయు, మునులయొక్కయు ముఖ మండలము గంగా మృత్తికతో రుద్దుటచే నెంతగా మెఱయుచుండునో వారి జటాకేశము లెంత స్వచ్ఛముగ నుండునో చూడుడు. గంగా రజము దొరకకపోయిన ప్రహ్లాద జన్మస్థానమగు ముల్తాను మృత్తికను రాచుకొనవలెను. ఏలయనఁగా నాభూమి భక్త ప్రవరుడగు ప్రహ్లాదుని పాదపద్మములు సోకుటచేఁ బరమ పావనమైనది. మహాత్ముల పాదరజము సోకనిది మనోమలము పోఁజాలదు. కావున గంగారజ మభావమైనపుడు భక్తపాదరజమును ధరించుటయే శ్రేష్ఠము. మూలస్థాన (ముల్తాను) మృత్తిక తైలమువలె నునుపుగ నుండును. వేడిని, పొక్కులను, పుండ్లను మొదలగువాని నన్నిటిని నాశము కావించును. వానికి తైలాదుల నుపయోగింపక పోయినప్పటికి ఫరవాలేదు.

పూర్వకాలములో తలగడుగునకు మొదట శిరమున గంగా రజమునుగాని, మూలస్థాన మృత్తికనుగాని లేక యే యితర జలాశయ మృత్తికనుగాని ఉపయోగించెడువారు. తలలో మురికిపోఁగానే ఉసిరికపప్పు నానవేసి తీసిన రసముచే రుద్దుకొందురు. ఆయుర్వేదశాస్త్రము ననుసరించి ఆమలకము(ఉసిరిక) ను మించిన రసాయనము లేదు. ఎంతటి పాపియైననుఁగానిండు ఆమలక వృక్షము క్రింద మరణించినను, దినినను వానికి దుర్గతి లేదు. వాడు స్వర్గమునకుఁ బోవును. ఆమలక జలముచేఁ గేశములు శుభ్రపడిన

మీఁదట, మరలఁ గడిగి తుడుచుకొని, అగరు ధూపముచే నార్చఁ బెట్టినచో నవి సుగంధితము లగును. త్వరగా నెఱియవు. ఇఁక ముత్తైదువులో వివిధ విధముల శృంగారము చేసికొనెడివారు.

ఆ సమయమున విదురపత్ని గంగారజమును బూసికొని తలరుద్దుకొనుచుండెను. శరీరము నిర్మలమగుటకై శరీరమంతటి ను గంగారజము బూసికొని యుండెను. స్త్రీలు, ఏకాంతమున, నిర్జనస్థానమునఁ బాటున దిగంబరలై స్నానముచేయుట అలవాటు. ఆసమయముననే శ్యామసుందరుఁడు "విదురపత్నీ ! విదురపత్నీ ! తలుపు తెఱువు" మనెను. లోపలనుండి జవాబు రాలేదు. మరల భగవానుఁడు బిగ్గఱగ నిట్లు పిలిచెను. :— "విదురుఁ డింటిలో లేఁడా? విదురపత్ని యింటిలోఁ గలదా ?"

విదుర పత్ని శరీరమంతయు పులకరించెను. ఆమె గొంతు కను గుర్తించెను. ఆహా ! ఈతఁడు శ్యామసుందరుఁడు. మా నందనందనుఁ డిచ్చటికి వచ్చినాడా ? అతఁ డిచ్చటి కెప్పుడు వచ్చినాఁడు ? శ్యామసుందరుఁ డీ శుష్కభూమియగు హస్తినాపుర మున నమృతవర్షము కురియింపవచ్చునని విని యుంటిని. ఈ యాలోచనలో విదురపత్ని తన శరీరమును దాను మఱచెను. ఆమెకు ప్రకృతిని దాఁటిపోవునంతటి ప్రేమమగ్నత వాసు దేవునియందు కలిగినది. ఆమె తాను స్నానము చేయుచున్న సంగతియు, నగ్నయైయుండి స్నానము చేయుచున్న సంగతియు

మఱచిపోయెను. యంత్రమువలె లేచి వెంటనే తలుపును దెఱచెను.

వాసుదేవుఁ డామె స్థితిని గాంచి కొంచెము జంకెను. అతఁడు తన పీతాంబరము నామెకుఁ గప్పి, తన నడుము కాసెను విప్పి, దానిచే దానిని బిగించి కట్టెను. ఆమెకు స్పృహలేదు. జగద్వ్యాపమే లేదు. ప్రేమోన్మత్తయైనది. ప్రణామము చేయుట కూడ మఱచిపోయెను. ఏమి పలుకవలయునో, ఎక్కడ కూర్చుండఁబెట్టవలయునో ఆమెకుఁ దెలియలేదు. సర్వాంతర్యామి యగు ప్రభువంతయును దెలిసికొని, ఆమె యింటి లోనున్న నొక సాధారణాసనము మీఁద తనకుఁ దానే కూర్చుండెను.

రాజా! పరాయి యిల్లగుచో సంకోచముండును. అది మన గృహమే అనుకొన్నను, దానినుండువారు మన యాత్మీయు లే అనుకొనినను సంకోచ భయము లేవియు నుండవు. ఆ వస్తువు తనదే అయినప్పుడింక నడుగ వలసినదేమున్నది? గోపా లుఁడు కూర్చుండెను. సంభ్రాంతురాలై వనమాలిని విదురపత్ని తదేకదృష్టితోఁ జూచుచుండెను. వాసుదేవుఁడు వ్యగ్రతను బ్రక టించుచు నిట్లనెను:– "విదురపత్నీ! మిక్కిలి ఆఁకలి వేయుచున్నది. తినుటకేమైన నుండినఁ దీసికొనిరమ్మా."

అయ్యో! అమ్మా! మా శ్యామసుందరుఁ డాఁకలిగొని యున్నాఁడే. ఇంతటి రాజధానీనగరమున నీతని తిండివిషయము

నడిగినవాఁడే లేకపోయెను. ఇన్ని పదార్థములుండియు మా శ్యామసుందరుఁ డాఁకలిచే వ్యాకులత చెందియున్నాఁడు. ఇవన్నియు నేల తగులపడి పోవలేదు? ఆమె పరుగిడి లోపలికిఁబోయెను. కన్నుల దృష్టి శ్యామసుందరుని దృష్టిలో దదాకారత చెందెను. ఇంటిలో నుంచిన యనేకములగు ఫలపుష్పములామెకు గోచరింపలేదు. దైవి కముగ నొక అరఁటిగెల చేతికి తగిలెను. దానిని త్వరత్వరగాఁ దీసికొని శ్యామసుందరుని దగ్గఱఁ గూర్చుండి, అరటిపండ్లను ఒలిచి తన యారాధ్య దేవునకు నైవేద్యమిడుచుండెను. వెండ్రుకలనుండి గంగారజోమిశ్రిత జలకణములు నిరంతరము బొట్లుగ పడుచుండెను. ఖురదతోనిండిన పీతాంబర మిటునటు అస్తవ్యస్త భావముతో నడుము నకుఁ గట్టఁ బడి యుండెను. ఆమె అరటిపండ్లనుజీల్చి గుజ్జును గ్రిందఁబారవైచి, ఖురదతోఁగూడిన పైతొక్కలను భగవానునకు సమర్పించుచుండెను. వెన్ననకు మన్నదిను అలవాటు చిన్న ప్పటినుండియును గలదు. ఆవులను, దూడలను గాయఁబోవు నపుడు వెంట పండ్లతొక్కలనుగూడ నెగురవేసికొని పోయెడి వాఁడు. కావున నీ బోజన మాతని కనుకూలముగనే యుండెను. పిల్లలవలెఁ గూర్చుండి ఆ తొక్కలను బొట్టలువేసికొని తిను చుండెను.

ఇంతలోనే కృష్ణభగవానుఁడు తన యింటివైపునకు వెళ్ళి నాఁడను సంగతి విని, పరువిడి విదురుఁ డింటికి వచ్చెను. వాకిట గరుడధ్వజమున్న రథ ముండెను. ఆతఁడు హర్ష,

విస్మయ, లజ్జలతో గబగబ యింటికిఁబోయెను. అక్కడికిపోయి చూచునప్పటికి ఆతనికి భయమువేసెను. వెంటనే పత్ని చేతిని గట్టిగాఁబట్టుకొని యిట్లనెను :— "ఆవలకుపొమ్ము, వెఱ్ఱిమొగమా ! నీకేమైన తల తిరిగిపోయినదా యేమి ? శరీర స్పృహయునులేదు, కర్తవ్యతాజ్ఞానమును లేదు. నడువు మావలకు."

ఇప్పు డామెకు బాహ్యజ్ఞానము కలిగెను. "అయ్యో ! ఇదేమి నేనిట్లు చేసితినేమి" యని యామె యింటిలోనికి దూరి తలుపువైచికొని, మిక్కిలి దుఃఖితయై కన్నుల నీరు విడుచు చుండెను.

ఇచ్చట శ్రీకృష్ణుఁడు చేయిచాపి యుంచెను. విదురుఁడు త్వరత్వరగాఁ జేతులను గాళ్ళను గడిగికొని, ఆచమన మొసంగి, అరఁటిపండ్లను గడిగి, వానిని ఒలిచి భగవానుడు చాపిన చేతిలో నుంచెను. భగవానుఁడు వానిని వెంటనే నోటవైచికొని, మరల చేయిఁ జాచెను. విదురుఁడు మరల నొసంగెను. భగవానుఁడు దానిని దిని, యాగి యిట్లనెను :— "విదురా ! నీ వన్యథా తలంపకున్నచో నొక్కమాట చెప్పెదను."

విదురుఁడు దీనతా స్వరమున నిట్లనెను :— "ప్రభూ ! మీ సేవకుని నిట్లడుగవలయునా ? ఆజ్ఞాపించుడు స్వామీ ! దీన హీనుఁడనగు నాకుటీరము నిట్లు పవిత్రముచేయుదురను సంగతి నాకు తెలియనే తెలియదు."

మధ్యలోనే అడ్డువచ్చి యచ్యుతుఁ డిట్లనెను :— "ఏమి యును ఫరవాలేదు. అన్నియు సరిగానే యున్నవి. కాని నేను వేఱుమాట చెప్పఁబోవుచున్నాను. ఈ అరఁటిపండ్లు చాలమంచివి. ఇఁక మీ ప్రేమసంబంధమును జెప్పవలసిన పనియేలేదు. నిజము చెప్పవలసివచ్చిన నరఁటితొక్కలలోఁగల రుచి యీ యరఁటి పండ్లలో లేదు."

ఇది వినగానే విదురుఁడు కన్నులవెంట నీరు గార్చెను. ఇప్పుడాతనికి తెలిసెను. నా భార్య పొరపాటుపని చేయలేదు. నేనే పొరపడినాను. సమస్త విశ్వమును దృప్తినొందించు వాసు దేవున కీ అరఁటిపండ్లతో నెట్లు సంతుష్టి కలుగును? ఈతని కెవరైనఁ దిండిపెట్టి సంతోషపెట్టఁగలరా? ఈతఁడు సదా భావ బుభుక్షువు. నా భార్యకున్న ప్రేమ నా కెక్కడిది? ఇట్టి నిష్కపట లోకోత్తరభావము నా కెక్కడనుండి రాఁగలదు?' ఆతఁడు భూమిమీఁదఁబడి వొరలి భగవంతునకుఁ బ్రణామము కావించి, గద్గదకంఠముతో నిట్లనెను :— "భక్తవత్సలా! నీ యందు ప్రేమ యేసాధనచేతను గలుగదు. నీకృప యెవరిమీఁద ప్రసరించునో, నీ వెవరిని నీవాడనుకొందువో వాఁడు నీ ప్రేమకు పాత్రుఁడు కాఁగలడు. అధముడనగు నేను నీకాతిథ్యమొసంగ యోగ్యుఁడనుగాను. నీవు పదార్థములకే ప్రసన్నుఁడవగుచో దుర్యోధనుని రాజ భవనమున పదార్థములకేమి కొఱత? నీ వెవరిపైఁ గృపచూపుదువో, ఆతఁడే నీ కనుగ్రహపాత్రుఁడు కాఁగలఁడు."

భగవానుఁడు నవ్వుచు నిట్లనెను :— "విదురా! నీవు మా కాత్మవే. ఇది నా యిల్లనుకొనకుండినచో నే నీవిధముగ నీవు లేని సమయమున నడ్డేమియునులేక లోపలికి వత్తునా ?"

కృష్ణుఁడు పలికిన స్నేహభరిత వచనములను విని విదురుఁడు మిక్కిలి సంతోషించెను. ఆతఁడనేక విధములగు వ్యంజనములతోడ భగవానునకును, ఆతని యనుచరులకును సత్కారము గావించెను. భగవానుఁడు బ్రాహ్మణులకును, అతిథులకును భోజనముపెట్టించి, అందరితోఁగూడ ప్రేమపూర్వకముగఁ బ్రసాదమును గ్రహించెను.

రాజా ! ఏయింటికి పిలుపకయే కృష్ణుఁడు విచ్చేసెనో, ఏ యింట నాతని పాదోదకము చల్లఁబడినదో, జగద్వంద్యములగు నతని పాదపద్మము లెచ్చట తాఁకినవో, ఏభూమి ఆతని మునివంద్యములగు పాదపద్మపరాగముచేఁ బావనమైనదో విదురుఁడా భూమిమీఁద నిత్యము పొరలుచుండెడు వాఁడు. ఆరజఃస్పర్శచే నాతని శరీరము రోమాంచితమయ్యెడిది. ఆ యింటినే దుష్టుల దుర్వ్యవహారము వలనఁ ద్యజించి వనములకుఁబోవలసి వచ్చినది. ఆ యాత్రలోనే మైత్రేయునితో సమావేశము కలిగెను."

ఇది విని పరీక్షిన్మహారాజిట్లనెను :— "ప్రభూ ! విదుర మైత్రేయ సంవాదమును నాకుఁ బూర్తిగ వినిపింపుఁడు. విదుర మైత్రేయు లెచ్చట, ఎట్లు సమావేశమైరి ? వారిద్దరి సంవాదము హస్తినాపురమునుండి వెళ్లునప్పుడా, మరల తిరిగివచ్చునప్పుడా ?

విదురుఁ డాతని నేమని ప్రశ్నించెను ? ఆతఁడీతనికేమి సమాధాన మొసంగెను ? ఈ విషయములన్నియు వినవలెనని నాకు మిక్కిలి లాలస కలుగుచున్నది."

శుకుఁ డిట్లడిగెను :— "రాజా ! వారి సంవాదము విన వలెనని నీ కింతటి యారాట మెందులకు ?"

అంత రాజిట్లనెను :— "స్వామీ! మైత్రేయమహాముని జ్ఞాన నిధి — భక్తిభాండారమని నేనిదివఱలో వినియుంటిని. విదురుని విషయములో చెప్పవలసిన పనియేలేదు. ఆతనిగూర్చియు నాతని భక్తిని గూర్చియు నేను ఉగ్గుపాలతోడనే కర్ణములను పాత్రలతోఁ బానము చేసియుంటిని. కావున నిట్టి పరమభాగవతుల సంవాదము అప్రాశయము కలదిగ నుండదు. అది అవశ్యము మిక్కిలి మహత్త్వ పూర్ణముగ నుండితీరును. అది గొప్ప మహాత్ములకుకూడ అను మోదించునదిగ నుండగలదు."

సూతుఁ డిట్లనెను :— "మునులారా ! పరీక్షిన్మహారాజు నా గురుదేవుని నీ ప్రశ్న అడుగఁగానే, ఆతఁడు మిక్కిలి ప్రసన్నుఁడై అవనీశ్వరుని బ్రశంసించుచు నాతని ప్రశ్నలకుఁ బ్రత్యుత్తరమీయ నుద్యుక్తుఁడై యిట్లనెను :— "మంచిది రాజా ! నేను నీ కీ సంవాదమును వినిపించెదను. నీవు దత్తచిత్తుఁడవై సావధానముగా శ్రద్ధాభక్తులతో శ్రవణము చేయుము."

—*—

# ధృతరాష్ట్రునకు విదురుని శుభసమ్మతి

శ్లో॥ యదోపహూతో భవనం ప్రవిష్టో
మంత్రాయ పృష్టః కిమ పూర్వజేన,
అథాహ తన్మంత్ర దృశాం వరీయాన్
యన్మంత్రిణో వైదురికం వదంతి॥

—శ్రీభాగ. ౩ స్కం. ౧ అ. ౧౦ శ్లో.

క. అని ధర్మబోధమునఁ బలి
కిన మాటలు సెవుల నిడమిఁ గృష్ణుఁడు విదురున్
ఘన నీతిమంతుఁ బిలువన్
బనిచినఁ జనుదెంచెఁ గురు సభాస్థలమునకున్.

—శ్రీమదాంధ్రభాగవతము.

అచ్చటికివచ్చి రాజనీతి నెఱిఁగినవారందఱును "విదురనీతి" యని ప్రసిద్ధముగఁ జెప్పికొను నుత్కృష్టధర్మము నాతఁడప్పుడు చెప్పెను.

—•*•—

జీవి అల్పజ్ఞుడు. సంసారసంబంధ ముండుటచే జీవుఁడు సదా శంకితమనస్కుఁడై యుండును. "ఇట్లైనచో మన పని యెట్లు నెఱవేరును? ఆతఁడు మనలను దొలఁగించినచో మనకేమి దుర్దశ పట్టనున్నదో, వారితో సంబంధవిచ్ఛేదము చేసికొంటినా, జీవనము దుఃఖమయము గాఁగలదు. అక్కడ నా కవమానము

జరిగెనా మరణింపవలసినదే.” అను నిట్టి యాలోచన లన్నియు జీవుల మనస్సులలో – ఆతఁడు తాను స్వతంత్రకర్త యనుకొను నప్పుడును, ప్రపంచమునకుఁ దానే నియామకుఁడ ననుకొను నప్పుడును జెలరేగుచుండును. కేవలము తాను శ్యామసుందరుని యంత్రముగ భావించువాఁడును, భగవద్భక్తుఁడై తాను గర్తను గాననుకొనువాఁడును, జగన్నాట్యరంగమునకు సూత్రధారుఁడు సర్వేశ్వరుఁడగు వాసుదేవుఁడనియు, ఆతనిది శివస్వరూపమనియు, నాతఁడు కళ్యాణధాముఁడనియు, ఆనందమున కాతఁడు ఘనీభవించిన విగ్రహమనియు, నాతని విధానము లన్నియుఁ గళ్యాణ మయములేయనియు, జీవుల విషయములో నాతఁ డేమి యొనర్చినను, సంయోగ వియోగములను గూర్చినను నవియన్నియు జీవుల హితముకొఱకే యనియు, నహితవిషయ మాతఁ డెన్నటికిని జేయఁడనియు, నహిత మాయన దగ్గఱకే రాదనియు, ఆతని దగ్గఱకు రానివన్నియు నాతఁ డితరుల కెట్లీయఁగలఁడనియు భావించుచుండు భక్తునిస్థితిలో నుండిన నెచ్చటనైన నుండనిండు, ఎట్టివేషములోనైన నుండనిండు, ఏదేశములోనైన నుండనిండు సర్వత్ర నిట్టి మగ్నతయే కలిగియుండును. ఏలయనఁగా శ్యామ సుందరుఁడే యాతని నెట్లాడించిన నట్లాడుచుండును. అబోధ బాలకుని దల్లిదండ్రు లెచ్చటఁగూర్చుండఁ బెట్టిన నచ్చటనే కూర్చుండును. ఎచ్చటికిఁ గొనిపోయిన నచ్చటికివెళ్లును. వానికి తన కల్యాణచింత తనకులేదు.ఆతని భారమంతయుఁ దల్లిదండ్రుల మీఁదనే కలదు. ఆతనికిఁ దెలిసినది యేడ్చుట, నవ్వుట,

మగ్నుఁడగుట, క్రీడించుటయే. విదురుఁడు హస్తినాపుర రాజ్య మునకుఁ బ్రధానియైనప్పు డాతనికి గర్వమెట్టియును లేదు. ఆతఁడే భిక్షుకుఁడై వనమునకుఁ బోయినప్పుడు శోకము లేదు. ఇదంతయు విచారించి శుకుఁ డిట్లనెను :— "రాజా ! దుష్టులు విదురుఁడు రాజధానిని వదలి వెళ్లుటకు వివశునిఁ గావింపఁగా నాతఁడు తన కుటుంబ, పరివార గృహాదులపై మోహమునువీడి, నాటనుండి మోహ మమకారములు లేక నగరమును వదలి వెళ్లినట్లు వెళ్లిపోయెను."

ఇది విని పరీక్షిన్మహా రాజిట్లనెను :— "ప్రభూ ! ఇది యెప్పటిమాట ? మా తాతలకు పెదతండ్రి ధృతరాష్ట్రుఁ డితనిని మిక్కిలి ప్రేమించుచుండెను, ఆతని సమ్మతిలేక యే కార్యమును జేయఁడనియు వినియుంటిని. అట్టి బుద్ధిమంతుఁడును, ప్రేమ పాత్రుఁడు నగు వాని నేల గృహమునుండి వెడలనడిచెను? అతఁడు దేశమునుండి వెడలఁగొట్టఁబడునంతటి ఘోరాపరాధము నేమి యొనర్చెను?"

అంత శుకుఁ డిట్లనెను :— "కురుకులతిలకా ! రాజా ! అదృష్టము బలవంతమైనది. ఎవరి కేసమయమున నన్ని హానియ ములు ప్రాప్తములున్నవో ఆ సమయమున నచ్చటకు వెళ్లవలెనను బుద్ధి పుట్టుచుండును. ధృతరాష్ట్రుఁడు విదురుని తానుగా వెళ్ళ మనలేదు. దీనికంతకుఁ గారణము తన పుత్రుఁడును దుష్టుఁడు నగు దుర్యోధనుడు. ఆతఁడే నీ పితామహులకుఁ జాల అన్యా యము కావించెను. ధృతరాష్ట్రుఁడు పుత్రులకు వశీభూతుఁడై యన్యాయ కార్యములను గూడ సమర్థించెను. విదురుని అవ

మానము చేయుచుండ నాతని పుత్రుల నష్టపెట్టలేదు. ఈ గ్రుడ్డి వాని సమ్మతివలననే అంతయు జరుగుచున్నది. ఇక్కడ నుండుట మంచిదిగాదని విదురుడు వెడలిపోయెను.

రాజా! మీ తాత లైదుగురును బితృహీనులైరి. పాండు రాజు పరలోకగతుడైన తర్వాత ఋషులు, మునులు పాండు తనయులను ధృతరాష్ట్రున కొప్పగించిరి. అప్పటినుండి దుర్యో ధనుని మనమున ద్వేషాంకుర ముత్పన్నమయ్యెను. పాపి యెప్పుడును భయపడుచునేయుండును. న్యాయతః దుర్యోధనునకు రాజ్యాధికారము లేదు. ఆ విషయ మటుంచుడు. గ్రుడ్డి వాడగు కారణమున నాతని తండ్రి ధృతరాష్ట్రుడును నియమాను సారముగ రాజు కాలేదు. రాజ్యమున కధికారి పాండురాజు. ఆతడు స్వేచ్ఛతో రాజకార్యము లన్నిటిని అన్నయగు గ్రుడ్డి ధృతరాష్ట్రున కొప్పగించి వనమునకుఁ బోయెను. ఆతడు ధృత రాష్ట్రుని రాజుగాఁజేసి పోలేదు. న్యాసము వలెను, తాకట్టుపెట్టి నట్లును నాతడు కొంతకాలము మాత్రమే రాజ్యము నొప్పగించెను.

మహారాజు స్వర్గస్థుడగునప్పటికి తన శ్రేష్ఠ జ్యేష్ఠ పుత్రుఁ డగు ధర్మరాజే రాజ్యమున కేకైక-అధికారి; కాని తండ్రి గ్రుడ్డి యగుటచే రాజ్యాధికారమును దుర్యోధనుఁ డాక్రమించెను. కావునఁ బాండవులను తాను రాజగుటకు గంటకులనుగఁ జూచెడువాడు. ఈ పాండవుల నెట్లైన మట్టుపెట్టి, రాజ్యమునకు నిష్కంటక రాజ్యాధికారినగుదునా యని యాతడెల్లప్పుడు నాలోచించుచుండెను.

ఏ విధముగ నీ హృదయ శూలముల నైదింటిని బెఱికివేసి సుఖ నిద్ర పోవుదునా యని యాతఁడు రాత్రింబవళ్ళు పాండవ వినాశ మును గూర్చియే చింతించుచుండెను. పాండవులు చచ్చి నిర్వా సితులు కావలెనని ధృతరాష్ట్రునకు లేకున్నను పుత్రస్నేహకారణ మున నాతఁడేమియు ననఁజాలక పోయెను. దుర్యోధనుఁ డేడ్చి పాండవ వినాశమునకు సమ్మతి నడుగఁగా నాతని కిష్టములేకున్నను పుత్రునిఁ బ్రసన్నుల నొనర్చుటకై యట్టి యనుమతి నిచ్చుచుండెడి వాఁడు. రాజా ! పుత్రస్నేహ మట్టిది. మోహమునఁబడి గొప్ప గొప్ప విద్వాంసులుకూడ బుద్ధిభ్రష్టు లగుచుందురు. విదురుఁడు ధర్మాత్ముఁడు. దుర్యోధనుఁడు పాండవుల కన్యాయమొనర్చు చున్నాఁడని ఆతనికిఁ దెలియును. కావుననే యాతఁడు పాండవ పక్షమును వహించుచుండువాఁడు. సమస్త విధములఁ బాండవులను సంకటములనుండి రక్షించుచుండును. వారికై సంఘాలిచ్చుచుండును. ఆ కారణమున దన యన్నను గూడ నిర్భీకుడై బెదరించు చుండెను.

విదురుఁడు ధృతరాష్ట్రుని ప్రధానమంత్రి. ధృతరాష్ట్రుఁ డాతని నడుగక యేపనియును జేయఁడు. విదురుడు ముఖస్తుతి లేకయే సత్యవిషయమును నిర్భయుఁడై అందఱముందు చెప్పెడు వాఁడు. విదురుఁడు పాండవపక్షపాతియనియు, నాతని శరీరము తనపక్షమే కాని మనస్సు పాండవుల పక్షముననే ఉండుననియు దుర్యోధనుఁ డెఱుగును. కావున దుర్యోధనుఁ డాతనిని దన మంత్రిగాఁ బెట్టుకొనలేదు. ఆతఁడు తన కనుకూలురగు దుశ్శాసన,

ఇంద్రప్రస్థరాజ్యమున ధర్మరాజు రాజసూయ యాగ మొనర్పఁగా, నాతని యనుపమసంపత్తిని, అతులవైభవమునుగాంచి దుర్యోధనుఁ డీర్ష్యనుజెంది కుండిపడిపోవుచుండెను. ఆతని రాజ్య భ్రష్టుని గావించుటకు జూదమునేర్పఱచినను ధృతరాష్ట్రుఁడు వారింపలేదు. జూదముయొక్క అనర్థ మిట్టిదని తెలిసియు నాజ్ఞ నొసంగెను. ఇంతేకాదు, అధర్మమున శకుని మొదలగు ధూర్తులైన జూదరులు సాధుస్వభావము కలవాఁడును, సత్యపరాయణుఁడును, అజాతశత్రువు నగు ధర్మరాజును మోసముచేయుచున్నారని తెలిసి నను ధృతరాష్ట్రుఁడు కాదనలేదు, కాని మాటిమాటికి 'ఎవరు గెలిచి నారు, ఎవరు గెలిచినా'రని అడుగుచుండెడివాఁడు. తన పుత్రులు గెలిచినపుడాతని ముఖము కలకలలాడెడిది.

దుష్టులు మోసముచేసి వారి సర్వస్వమును జయించిరి. వారిని రాజభ్రష్టులఁ గావించి పదుమూఁడు సంవత్సరములు వన మునకుఁ బంపిరి. తన ప్రతిజ్ఞను బూర్తి కావించుకొని ధర్మా త్ముఁడగు యుధిష్ఠిరుఁడు వనవాసముచేసి వచ్చి, తన పైతృక రాజ్యము నడుగఁగా నాతని కప్పుడైనను రాజ్యమొసంగలేదు. పుత్రుఁడు చేసినవాని నన్నిటి నంగీకరించుచుండెను. ధర్మరాజునకు న్యాయానుకూలమగు రాజ్యమును ప్రతిజ్ఞానుసారముగ నీయలేదు.

ధర్మభీరువును సర్వశక్తిసంపన్నుఁడునగు యుధిష్ఠిరునకు యుద్ధముచేయ నిష్టములేకుండెను. అందువలన నాతఁడన్నిటిని క్షమించుచుండెను. ఆతఁడు గొప్పగొప్ప కౌరవాపరాధములను

గూడ క్షమించెను. కాకపోయినచోఁ బతివ్రతయగు దన భార్యను శత్రుసభలో మానభంగముచేయఁ దలపడఁగాఁ, దనచేతఁ బల ముండియు నాశముచేయఁ దలఁపలేదు. తన యశ్రువులు వక్షః స్థలమును దడుపుచుండ ద్రౌపది కృష్ణునిఁ బ్రార్థింపఁగా, నట్లు చేయ రాదని ధృతరాష్ట్రుఁడు పుత్రులను వారింపలేదు. వీనినన్నిటిని మఱచి ధర్మరాజు సంధిచేసికొనఁ దలఁచెను. ఆతఁడైన రాజ్యము నంతను గోరలేదు. అయిదూళ్ళిచ్చినఁ జాలుననెను. కులనాశము కాకుండవలెనని యాతఁడు సర్వప్రయత్నములొనర్చెను. కావుననే ద్వారకాధీశుఁడగు శ్రీకృష్ణుని సంధి చేయుమని దూతగా హస్తినా పురమునకుఁ బంపెను. కృష్ణుఁడు వెళ్ళి శాంతిప్రయత్నము లన్నిటిని గావించెను. ప్రేమచేతను, నీతిచేతను, భయమును జూపియు, గద్దించియు నాత్మీయునివలె దుర్యోధనునకు తన యమృ తోపమానములగు వచనములచేఁ జెప్పిజూచెను. కాని యతఁడు భగ వానుని మాట వినలేదుసరికదా ఆతనిని బంధింపఁ బ్రయత్నించెను.

శాంతి కుదురదను నమ్మకము తోఁచిన తర్వాత వివశుఁడై భగవానుని సమ్మతిచే యుద్ధమునకు సిద్ధపడెను. యుద్ధము జరుగఁగలదని తెలిసికొని ధృతరాష్ట్రుఁడు భయపడి, బుద్ధిమంతు లలో శ్రేష్ఠుఁడును ఒక్కని సమ్మతినీయఁ గలవాడునగు విదురుని బిలిచి యిట్లనెను :— "సోదరా! విదురా! అన్న దమ్ములకు యుద్ధము జరుగుట నా కిష్టములేదు. శాంతిగానుండవలెనని నా కోరిక. అది లభించునట్లు కనఁబడుటలేదు. దీనికి నా చిత్తము చాల ఆందోళన

చెందుచున్నది. నా భయము పోవునట్లు నీవేదైన నుపాయమును చెప్పుము."

తన యన్న మాటలను విని ధర్మాత్ముడగు విదురుడు నిర్భీకుడై అందఱి సమక్షమున నిట్లనెను :— "రాజా ! ఈ దోష మంతయు నీదే. ఇవియన్నియు నీవు నాటిన బీజములే. నీవు దుర్యోధనుని దుష్టతను సమర్థింపకుండినచో నేడీ దినములు చూడవలసిన పనియుండెడిది కాదు. పాండవుల కన్యాయము జరిగిన బాధ్యత యంతయు నీయందే కలదు. నీవే వారిని వివిధో పాయములచే జంపింప బ్రయత్నించితివి."

అంత ధృతరాష్ట్రు డిట్లనెను :— "సోదరా ! విదురా ! నీవు కూడ నిట్టిమాటలు పలుకుచున్నావేమి ? నేను పాండవుల జంపు మని యెప్పుడంటిని ? నేను వారిని నా బిడ్డలవలె జూచుకొను చున్నాను. ఈ యుత్పాతమంతయు దుష్టపుత్రుడగు దుర్యో ధనుడు చేసిన పని."

ఇది విని విదురు డిట్లనెను :— "లేదు, మహారాజా! అట్లు కాదు. దుర్యోధను డెవడు ? నీ వున్నంతవరకు దుర్యోధనున కధికారములేదు. వర్ణాశ్రమధర్మము ననుసరించి తండ్రి బ్రతికి యుండ బుత్రునకు, భర్త బ్రదికియుండ భార్యకును అధికార ముండదు. నీవు వీరి నదలింపలేదు. వారు చేసినవాని కన్నిటికి నంగీకరించితివి. అందుకనియే వారెంతగా నెత్తి కెక్కిరి."

అంత ధృతరాష్ట్రుఁ డిట్లనెను :— "సోదరా! నేనేమి చేయ వలయునో నీవే చెప్పుము. ఈ పోరాట మెట్లు తీరును ? నీవు నీతిశాస్త్రవిదుఁడవు."

అంత విదురుఁ డిట్లనెను :— "అవును మహారాజా ! నేను చెప్పెదను, నా మాటను వినుము. తగవు తీరిపోఁగలదు. అజాత శత్రువగు యుధిష్ఠిరునకు ఆతని భాగము నొసంగుము."

అంత ధృతరాష్ట్రుఁ డిట్లనెను :— "ఇచ్చెదను. కాని మేము వారల కనేక ఘోరాపరాధముల నొనర్చితిమి. రాజ్యమును బొందఁగానే యా యపరాధములను మనస్సులోఁ బెట్టుకొని నా కొడుకుల మడియింపఁగలరు."

ఇది విని తన మాటను సమర్థించుకొనుచు విదురుఁ డిట్ల నెను :— "లేదు రాజా ! ధర్మరాజు గొప్ప ధర్మాత్ముఁడు. ఆతఁ డింతవఱకు మీ యపరాధముల నన్నిటిని క్షమించుచుండెను. ఇఁక మీఁదటను నీ పుత్రులను దన సోదరులుగ నెంచుకొని క్షమింపఁ గలఁడు. లోభవశమున నీవు వారి భాగము వారి కీయకున్నచో, ధర్మరాజు సాధువు గాని భీమసేనుఁ డంగీకరింపఁడు. సింహము కరిమస్తకమును బ్రద్దలుచేసిన ట్లాతఁడు నీ కుమారుల తలలు బ్రద్దలుకొట్టఁగలఁడు."

ఇది విని ధృతరాష్ట్రుఁ డిట్లనెను :- "విదురా! నీవు భీమ సేనుని బ్రశంసించి నన్ను భయపెట్టఁజూచుచున్నావా?"

అంత విదురుఁడు శుష్కహాస మొనర్చి యిట్లనెను :— "మహారాజా! నేను భయపెట్టనేల? నీకు భీమసేనుని భయముండనే

యున్నది. ఆతని భయముచే నీవు రాత్రులందు నిద్ర కూడ పట్టుటలేదు. పాండవులలో నొక్కొక్కరు నిరుపమమైన బలవంతుడు. అర్జునుడు స్వర్గమునుండి సమస్త - అస్త్రశస్త్రములను నేర్చుకొని వచ్చెను. నకుల సహదేవులుకూడ పరాక్రమములో దక్కువవారు కారు. వీరందరును భీమునుత్సాహపరచుచుందురు. ద్రౌపదీ మానభంగవృత్తాంతమును జెప్పి అందరును క్రోధము కల్గించు చుండును. వారందరును నీ పుత్రులను చంపగలరు."

అంత ధృతరాష్ట్రుడిట్లనెను :— "విదురా! యుద్ధములో విజయము నిశ్చయము కాదు. ఒక్కొక్కప్పుడు బలవంతుడు కూడ ఓడిపోవుచుండును. బలహీనుడు కూడ జయించు చుండును. నా పుత్రులు శూరవీరులు, అస్త్రశస్త్రవేత్తలు. వారికడ ౧౧ అక్షౌహిణుల సేన కలదు. అట్టియెడ పాండవులు నాపుత్రుల నోడింపగలరని నీ వెట్లు చెప్పగలవు?"

ఇది విని విదురుడిట్లనెను :— "ప్రభూ! పాండవు లంద రును బలవంతులు. బలవంతులైనను సందేహము కలదు; కాని సాక్షాచ్ఛ్రీకృష్ణుడు పాండవపక్షమున గలడు. ఇప్పుడు సందేహము నకవకాశమే లేదు. భగవానుడు యాదవు లందరకు నారాధ్యదేవుడు. ఆతడీ భూమినిగల సమస్త బలవంతులగు రాజుల నోడించి ద్వారకలో కోట నిర్మించుకొని, సమస్త బంధువులతో నున్నాడు. ఆతడు దేవ బ్రాహ్మణులకు రక్షకుడు. వారీతనిని పూజింతురు. ఆతడు వారిని పూజించును. ఈ విధముగ నాతడు పాండవపక్షమును

వహించినప్పుడు వారి విజయము నిశ్చయమే. కావున నీవు వారి యోగ్యతను గ్రహించి పాండవులకు భాగ మొసంగుము." ఈ విధముగ విదురుడు ధర్మయుక్తములును, నీతియుక్తములు నగు వాక్యములను బలికెను. అవి యిప్పటికిని 'విదురనీతి' యని ప్రసిద్ధికెక్కినవి.

సూతు డిట్లనెను :— "మునులారా! విదురుడు ధృతరాష్ట్రున కెంతయో చెప్పెను; కాని ఆత డొక్కవాక్యమైన వినలేదు. అందువలన వీరి కిరమున కాలము తాండవించుచున్నదని ఆతడు నిశ్చయించుకొనెను."

— * —

# దుష్టపుత్రులను విడువుమని సలహా

శ్లో॥ సఏష దోషః పురుషద్విడాస్తే
గృహాన్ ప్రవిష్టో యమపత్యమత్యా।
పుష్ణాసి కృష్ణా ద్విముఖో గత శ్రీ
స్త్యజాశ్వశైవం కుల కౌశలాయ॥

— శ్రీభాగ. ౩ స్కం. ౧ అ. ౧౩ శ్లో.

"వ. విదురుండు చనుదెంచి యచటి జనంబులచేత నుపస్థితంబయిన కార్యంబు దెలిసినవాఁడయి ధృతరాష్ట్రునుద్దేశించి యిట్లనియె.

ఉ. కావునఁ బాండునందనులఁ గాఱియవెట్టక రాజ్యభాగముల్
వారికినిచ్చి రాజ్యమును వంశముఁ బుత్రుల బంధువర్గముం
గావుము గాక లోభియగు కష్టసుయోధను మాట వింటివే
భూవర నీయుపేక్షనగుఁగో కులనాశము బంధునాశముల్.

తే. ఒకనికై యిట్లు కులమెల్ల నుక్కడంప
నెత్తికొనఁజూచె దిది నీతియే నృపాల
వినుము నా మాట నీ సుయోధనుని విడిచి
కులము రాజ్యంబుఁ దేజంబు నిలుపవయ్య."

— శ్రీమదాంధ్రభాగవతము.

– • –

శరీరములో నెచ్చటనైన విష రణమొకటి లేచి, దానికెన్ని మందులు వైచినప్పటికిని నయముగాక, అది విషయుక్తమై క్రుళ్ళి దానిమూలమున నితరావయవములకుగూడ హాని కలుగునట్లుండు

నెడల, బుద్ధిమంతుఁడగు చికిత్సకుఁడు ఆ యంగమును ఖండించు మని సలహా నొసంగును. సమస్తావయవములు రక్షణకొఱకు కాతఁ డొకయంగముమీఁద మోహపడఁడు. ఆతఁడు ధర్మమని భావించి, రోగి హితముకొఱకే చెప్పును. ఇట్లు చెప్పగా వినియు, నా శరీరాంగమును నేను ఖండించుకొందునా యని తిరస్కరించుచో వాని పరిణామమేమి కాఁగలదు? విషము శరీరమంతకు వ్యాపించి, ఒక్క అంగమునకు బదులుగ, సమస్తావయవములు విషయుక్తములు కాఁగలవు. అందుకనియే విదురుఁడు బాగుగా నాలోచించి, మాటి మాటికి, ధృతరాష్ట్రునితో గట్టిగా 'రాజా! సమస్త కలహములకుఁ గారణ మీ దుర్యోధనుఁడే'నని చెప్పుచుండెను.

అంత ధృతరాష్ట్రుఁడు నెమ్మదిగ నిట్లనెను :— "సోదరా! విదురా! నా కంతయుఁ దెలియును. ఈ దుర్యోధనుని బుద్ధి విపరీతమైనది. వీఁడు మొదటినుండియు పాండవులను ద్వేషించు చున్నాడు. వారి యున్నతిని జూడఁజాలఁడు. సర్వదా వారిని హీనులుగఁ జూచుటకు బ్రయత్నించుచుండును." మధ్యలో విదురుఁ డడ్డుపడి యిట్లనెను :— "అవును. ఇట్లు చేయుట నీ సమ్మతి మీఁదనే."

అధీరుడై ధృతరాష్ట్రుఁ డిట్లనెను :— "తమ్ముఁడా! నే నిట్టి సమ్మతి నెప్పుడొసంగితిని ? నాకు పాండుపుత్రులు నా పుత్రులవంటి వారే. అంతేకాదు, వారే సమయమున నా బిడ్డల కంటె నెక్కువగాఁ జాలనీయులు. ఏలననఁగా, వారు తండ్రిలేని బిడ్డలు.

విదురుఁ డిట్లనెను :— "రాజా! భగవంతుఁడు నీకు సుబుద్ధి నొసంగుఁగాక ! నందనందనుఁడగు శ్యామసుందరుఁడు నీకు సదా యిట్టి సదభిప్రాయమునే కలిగించుఁగాక! కాని మహా

రాజా: నీవు నాకు పూజ్యుఁడవు, శ్రేష్ఠుఁడవు, జ్యేష్ఠుఁడవు, రాజవు. కాని కర్తవ్యవశమునఁ బలుకవలసివచ్చుచున్నది. నీవు పాండవులను నీ కొడుకులవలెఁ జూచుకొనుచున్నచో నీ విధముగ వల్కలములను ధరింపఁజేసి వనములకుఁ బంపవు. ఈ విధముగ వారి సర్వస్వము నపహరింపవు. ప్రతిజ్ఞను బూర్తి కావించి తిరిగివచ్చిన ధర్మాత్ములగుఁ బంచపాండవులకు రాజ్యము నొసంగుటతో వెనుకాడవు."

ధృతరాష్ట్రుఁ డిట్లనెను :— "తమ్ముఁడా! నీవు తెలిసి యుండియు నిట్టి పలుకుల నేల పలికెదవు? పాండవులకు రాజ్య మీయవలదని నే నెప్పుడంటిని? అన్నదమ్ములందఱుఁ గలిసి యుండుఁడనియుఁ, బోరాటములఁ బోఁగొట్టుకొనవలసినదనియు, వాదవివాదములను మాని మీరు హస్తినాపురమందును, వా రింద్రప్రస్థమందును రాజ్యము చేసికొనవలసినదని నే ననేక సార్లు దుర్యోధనునకుఁ జెప్పితిని; కాని వారు నా మాట వినునే వినరు....."

ఇంతలో విదురుఁ డందుకొని యిట్లనెను :— "అవును, వారు నీ మాటలు వినరు, కాని నీవు వారి మాటల నన్నిటిని వినుచుందువు. వారేదిచెప్పిన దానికి సరే అనుచుందువు. వారి పాపములన్నిటిని సమర్థించుచుందువు."

ధృతరాష్ట్రుఁడు వివశతా స్వరముతో నిట్లనెను:— "విదురా! నేనేమి చేయుదును? నా మనస్సునకు నేను జెప్పుకొనుచునే యున్నాను; కాని అది నా దుర్బలతయే. పుత్రమోహమున నేను వారు దుఃఖించుటను జూడఁజాలను. ఎంతటి అయోగ్యుఁడగు దుష్టపుత్రుఁడైననగుఁగాక పుత్రుడు పుత్రుడే. తండ్రికి ఆత్మ. తన శరీరమునుండి పుట్టినవాఁడు. వారి మాట నెట్లు వినకుందును?!"

అంత విదురుఁ డిట్లనెను :— మహారాజా! శరీరము నుండి పుట్టుటచేతనే పుత్రుఁడని పిలువఁబడునా యేమి? గడ్డము, మీసము, తలవెండ్రుకలుకూడ శరీరమునుండియే పుట్టుచున్నవి. వానిని గొరుగుటెందులకు? గోళ్ళు వ్రేళ్ళకే పుట్టును. వాటి నేల రక్షించు కొనవు? విష్ఠా, మలమూత్రములు శరీరములోపలనే యేర్పడు చున్నవి. వానిని జూచిన నేవగింపేల? అవి శరీరమునుండి బయటకు రాఁగానే త్యజింపనేల? వాటిని దాఁకిన సచేలస్నానము చేయనేల? రోగములును శరీరము నుండియే పుట్టుచున్నవి. చేదు మందులను దిని జ్వరమును నాశన మేల చేయవలయును?"

అంత ధృతరాష్ట్రుఁ డిట్లనెను :— "విదురా! నీవు చాల బుద్ధిమంతుఁడవు. అందుకనియే నిన్ను గొప్పగొప్ప విద్వాంసులు కూడ సమ్మానించుచున్నారు. నీవు సరిగాఁ జెప్పుచుందువు. కాని నిర్జీవములగు మల మూత్ర కేశ నఖములతో నీవు జీవితపుత్రుని నేల బోల్చుచున్నావు? మలము మలమే, పుత్రుఁడు పుత్రుఁడే. వాఁడు మన వీర్యముచేఁ బుట్టు చున్నాఁడు."

విదురుఁ డిట్లనెను :— రాజా! సజీవుఁ డగుటచేతనే రక్ష చేయుఁడగునా? సింహ వ్యాఘ్రాది హింసక మృగములు సజీవములే, బలవంతములే. అయినను భిల్లుల కవి అపకార మొనర్చుటచే వాటిని జంపుచున్నారు. తన యింటిలోని మదపు టేనుఁగు వశము కాకున్న దానిని జంపుటలేదా? ఇఁక శరీరమునుండి పుట్టుట విషయము కలదు. శరీరముమీఁద గాయము పడుచో, దానిలోఁ బురుగులు పడును. ఎక్కువ తీపి తినుటచేతను, అలచందలు మొదలగునవి తినుటచేతను వాటివలన నేర్పడిన మలములో జంతువులు పుట్టుచున్నవి. వాటి నెవరును తనుజులని పోషించుటలేదే?

తమ చెమట నుండి నల్లులు పుట్టుచున్నవే. వాటి నెవరు తనయు
లని మన్నించి పెంచుటలేదే? ఇఁక వీర్యమువలనఁ బుట్టు విషయ
మున్నది. వీర్యములోను కీటకములు కలవు. పశుచుండును
కూడ. మహారాజా! మూత్ర మెక్కడ పుట్టుచున్నదో, అక్కడ
నుండియే పుత్రుఁ డుదయించుచున్నాడు. వాఁడను కూలుఁడై
కుల వంశ ప్రతిష్ఠను బెంచువాఁడగునెడల బుత్రుఁడగును. లేకున్న
మూత్రమువలెఁ ద్యజింపఁదగును."

ధృతరాష్ట్రుఁ డిట్లనెను :— "సోదరా! విదురా! నీవు సరి
గానే చెప్పితివి. తన కనుకూలముకానివాఁడు కుపుత్రుఁడని. అయి
నప్పటికిని పుత్రుఁ డెట్టి కుపుత్రుఁడైనను ధర్మాత్ముఁడగు తండ్రి
తన పుత్రు నెన్నఁడును త్యజింపఁడు."

అంత రోషముతో విదురుఁ డిట్లనెను :— "లేదు రాజా!
మీరట్లనరాఁడు. ధర్మమర్మము తెలియనివారిట్లు పలుకెదరు. తన
కులము కళంకితముకాఁగా, వానిని విడుచుటచే సమస్త గ్రామము
నకు మేలు కలుగుచో బుద్ధిమంతుఁడగువాఁడు తన కులమును వదల
వలెను. తన ఆత్మీయునిచేఁ గులనాశనమగు నెడల నావ్యక్తి
నొక్కనిని వదలవలయును. రాజులు అన్యాయులగు తమ పుత్రు
లను వదలిపెట్టినట్టు లనేకములగు నుదాహరణములు కలవు. సగర
చక్రవర్తికి అసమంజసుఁడను నొక పుత్రుఁడు కలఁడు. ఆతఁడు
నగరవాసులగు శిశువులను సరయూనదిలో విసరిపాఱవేయుచుండెడి
వాఁడు. అందులకని రాజాతనిని త్యజించెను. ఆతఁడు యోగి.
మునిఁగి చచ్చిన పిల్లలను బ్రదికించుచుండెడివాఁడు. అయినప్పటి
కిని ప్రజల మేలుకొఱకు ఆతనిని త్యజించెను.

సూర్యవంశములో ఇక్ష్వాకు అనెడు రాజు కలఁడు. ఆతఁడు వికుక్షియను కుమారుని శ్రాద్ధమునకు మేధ్యపశువును గొనిరమ్మని అడవికిఁ బంపెను. ఆఁకలియగుటచే నాతఁడా శ్రాద్ధీయ పదార్థమును శ్రాద్ధమునకు ఉపయోగింపక పూర్వమే తిని యెంగిలి కావించెను. ఆతఁ డిట్టి నియమహీనుఁడగు బుత్రుఁడుండరాదని వానిని ద్యజించెను. దేవేంద్రపుత్రుఁడగు జయంతుఁడు జగజ్జనని యగు సీత యెడల నశిష్టవ్యవహారమును జరుపుటచే నాతనికి తండ్రియే శరణమీయలేదు. ఇట్లొక్కటి, రెండుఁ గాదు. అనీతిగ వర్తించు పుత్రులను దండ్రులు శత్రువులవలెఁ ద్యజించిన ట్లనేకోదాహరణములు కలవు.

రాజా! నీవు బుద్ధిమంతుఁడవు. జ్ఞానదృష్టితోఁ జూడుము. ఈ లోకమున నెవఁడెవరికి పుత్రుఁడు? అందఱును బూర్వజన్మ సంబంధమున పుత్ర, మిత్ర, భ్రాతృ సంబంధమునఁ బగఁదీర్చు కొనుటకు వచ్చుచుందురు. ఒక్కొక్కప్పుడు ఘోరాపరాధమునే రాక్షసుఁడే పుత్రరూపమును ధరించి వచ్చును. నీవీ దుర్యోధనుని నీ పుత్రునిఁగ భావింపకుము. ఈతఁడు అవగుణములకు మూర్తి మంతుడు. కలియే నీ యింటఁ బుత్రుఁడై పుట్టినాఁడు. అసలు పురుషుని ద్వేషించుటయే మహాపాపము. ఇఁక నీతఁడో పురుషోత్తమునే ద్వేషించుచున్నాఁడు. నీ సమ్ముఖముననేకదా శ్రీకృష్ణుని పట్టి బంధించవలెనను దన యభిప్రాయమును వెలిబుచ్చి యున్నాఁడు. ఈ క్రూరకర్ముఁడా పురుషోత్తము నెట్లు బంధింపఁగలఁడు? కుందేలు సింహము నెట్లు స్పృశించనేచాలదో, అట్లే ఈతఁడు వాసుదేవభగవానుని తాఁకనైన తాఁకజాలఁడు. భగవద్విముఖుఁడైనవాని ముఖమును జూచుట మహాపాతకము. భగ

వంతుడు కొంచెము తెలిసుకొనియే క్షమించినాడు. లేక పోయిన
నాతడు తలచుకొనిన యెడల ధర్మరాజ రాజసూయ యాగమున,
సమస్తరాజన్యుల సమక్షమున శిశుపాలుని జంపినట్లు చంపి
యుండెడువాడే. కురువంశకీర్తివర్ధనా! రాజా! నీకు నీ కీర్తియే
ప్రియమగు నెడలను, నీ మేలును నీవు గోరియుండిన యెడలను,
నీ యింటిలోఁ జేరియుండిన పుత్రరూపుఁడగు శత్రువును, మూర్తి
మంతుఁడగు గలినిఁ బరిత్యజింపుము. ఈ దుష్టుఁడు భగవంతుని
శక్తి నెఱుఁగఁడు. ఎవఁడు పదునొకండేండ్లవాఁడై జరాసంధుని
వంటి త్రైలోక్యవిజయుఁడగువానిని యుద్ధములో నొప్పించిన
కంసుని, వాని యింటికే వెళ్ళి, నిండు సభలో అస్త్రశస్త్రము
లేవియు లేకయే, కేవలము గ్రుద్దులతోడనే చంపిన యా కృష్ణుని
ముందు ఈ క్షుద్రుఁడు - పాపముచేఁ బిసుఁగువఱెనైనవాఁడగు నీ
పుత్రుఁ డేమి లెక్క? వీనిని నీ యొడిలో దాఁచుకొనిన పాము
వంటివాఁడు. సంబంధిరూపమున శత్రువైనవాఁడు. నీవు నా మాటను
వినక బుత్రుని వలెఁ గాచుకొంటివా, నీకు దానివలన శుభముండ
జాలదు.

శ్రీకృష్ణుడు వీనిని జంపినచో నా తొంబదితొమ్మిది కొడు
కులు మిగులుదురుగదా యని నీవనవచ్చును. అట్లుకాదు. ఒక్క
అపరాధమునకై నీ కులము సమూలముగ నాశము కాఁగలదు.
వారిలో నొక్కఁడైన పిండప్రదానము చేయువాఁడు మిగులఁడు.
నీకు నా మాటమీఁద విలువగల్గుచో నీ వంశక్షేమమునకై యీ
యధర్ము నొక్కనిని త్యజించుము. వీనిని యింటినుండి వెడల
నడపితివా సమస్త కులమందుననేకాదు, సమస్త రాష్ట్రమునను
శాంతి వ్యాపింపఁగలదు.

వీనిని ద్వేషించిన నేమైననుపద్రవము చేయుననుకొను నెడల, దీనికి సర్వశ్రేష్ఠమగు నుపాయము వీనిని బట్టుకొని శ్రీకృష్ణ భగవానునకు నప్పగించుటయే. ఆతఁ డీతనిని సరిచేయఁగలఁడు. ఆతని సమ్ముఖమున నీతఁడేమైనఁ గుఁయ్, కఁయ్ అనెనా, వీని సోదరులగు అఘసుర, బకాసుర, వత్సాసుర, ధేనుకాసుర, చాణూర, ముష్టిక, కంసాదులను యమసదనమునకుఁ బంపినట్లు పంపఁగలఁడు."

ఈవిధముగ విదురుఁ డెప్పుడు మొగమాటములేకుండగఁ ధన కుల రక్షణముకొఱకు ధృతరాష్ట్రునికిఁ జెప్పెనో, అప్పుడాత డీ హితవాక్యములకు జవాబు చెప్పలేకపోయెను. దుర్యోధనుఁడు సమీపమునఁ గూర్చుండి, యిది అంతయు వినుచుండెను. ఈ మాటలను వినఁగానే ఆతఁడు క్రోధోద్రిక్తుఁడయ్యెను. రోష కారణమున నాతని రోమరోమములనుండియుఁ గ్రోధరూపమగు నంగారములు బయలువెడలెను; కన్నులెఱ్ఱనయ్యెను; పెదవు లదరెను; ఆతఁడు విదురునిపై నత్యంత కుపితుఁడై తిట్టసాగెను.

సూతుఁ డిట్లనెను :— "మునులారా! హితవచనము లందఱకును జెడ్డవిగనే యుండును. కాని పాపులకు వారి దోషములు తెలియవు. వారు పరదోషములు ఆవగింజలంత యుండినఁ గొండ లంతలుగఁ జూతురు. వారి పాపములు కొండలంతగ నుండినను బరమాణువంతైనను గనపఱుపరు. దుష్టుఁడగు దుర్యోధనుఁడు విదురు నెట్టి కటువాక్యములను బలికెనో నేను ముందు చెప్పెదను. మీరు సమాహితచిత్తులరై దీనిని శ్రవణము చేయుఁడు."

—♦✱♦—

# దుర్యోధనుఁడు విదురుని దిరస్కరించుటు

శ్లో॥ క ఏనమత్రోప జుహావ జిహ్మం
దాస్యాః సుతం య ద్బలినైవ పుష్టః।
తస్మిన్ ప్రతీపః పరకృత్య ఆస్తే
నిర్వాస్యతామాశు పురాచ్ఛ్వసానః॥

—శ్రీభాగ. ౩ స్కం. ౧ అ. ౧౫ శ్లో.

క. దాసీపుత్రుని మీరలు
దాసీనుంజేయ కిటకుఁ దగునె పిలువఁగా
నాశీనుండై ప్రేలెడు
గాసిలి చెడిపోవ వెడలఁగా నడువుఁ డిఁకన్.

—శ్రీమదాంధ్రభాగవతము.



లోకములో సాధారణముగఁ జాలమంది ముఖమును జూచి మాట్లాడుచుందురు. దానిలో మనసు హితముండుఁగాక లేక అహితముండుఁగాక వారు మనల నప్రసన్నులఁ జేయఁ గోరరు. వారు తియ్యని మాటలు మాటాడి వారిత్రోవను వారు పోవుచుందురు. ఎవరైన వారిని "ఏమయ్యా! నీ విట్టి ముఖస్తుతి పలుకులు పలికితివే; దానివలన వానికి హాని కలుగఁగలదేమో" యని అడుగుచో నాతఁడు తాను నిర్దోషినని చెప్పుచు నిట్లనును :— "నాయనా! దానివలన నాకుఁ బ్రయోజనమేమి కలదు? నిజము పలికిన నిష్ఠురము కాఁగలదు. దీనిచే నేను సత్యవాఙ్మని కావలసిన పనిలేదు. నేను ఊఁకొట్టి ఊరకుంటిని. నే నుద్ధవుని దగ్గఱకొని మాధవున

జేయవలసిన పనిలేదు. "ఎప్పటి కెయ్యది ప్రస్తుత మప్పటి కా మాటలాడి యన్యుల మనముల్, నొప్పింపక తా నొవ్వక తప్పించుకొనుచు నానందమున నుండుటయే నా కిష్టము." ఇట్టి భావములు మనయెడల హార్దిక బంధుత్వము లేక నుదాసీనముగ నుండు వారల కుండును. కొందఱు మనకు శత్రువులు కూడ నుందురు. వారు అకారణముగ మన విషయముతో రంధ్రాన్వేషణము గావించు చుందురు. మనల నెల్లప్పుడు క్రిందకుఁ బడఁద్రోయుటకు యత్నించుచుందురు. కొందఱు మనకు సుహృత్తులై, సంబంధులై, బంధువులై యుందురు. వీ రెల్లప్పుడు మన హితమునే కోరుచుందురు. ఈ విధముగ సుహృదులు, దుర్హృదులు, ఉదాసీనులని మూడు రకముల మనుష్యు లుందురు. సుహృదులలోఁ గొందఱు ప్రేమచే మనకు హితమును జెప్పుచుందురు. మనము వారి మాటలను వింటిమా సరియే, వినకుంటిమా వారూరకుండి, దుఃఖించి "నీ కెట్లు మంచిదని తోఁచిన నట్లు చేయు"మని చెప్పుదురు. ఇంతను గొందఱు అత్యంత హితైషు లుందురు. వారు చివఱవఱ కన్ని ప్రయత్నములను గావించి కఠినాతికఠినవాక్యములను బలికియు, మనకు నచ్చఁజెప్పఁ బ్రయత్నింతురు. వారి వాక్యములన్నియు మధురములుగ నుండవలయు ననుకొనరు. వారి లక్ష్యము మన హితము నందే యుండును. మన హితముకొఱకు మిక్కిలి అప్రియములగు వాక్యములను కూడ పలుకు చుందురు. ఇట్టి హితైషులు లోకములో దొఱకుట దుర్లభము. పూర్వజన్మ పుణ్యమునఁ గొందఱు భాగ్యశాలురకు మాత్రమే లభించుచుందురు. విదురుఁడు కౌరవులకిట్టి హితైషియే. ఆతఁడు సత్యమును బలుకుటకు వెనుదీయఁడు. అన్యాయ మొనరించుటయు, పక్షపాతవాక్యములను బలుకుటయు నాతఁడు నేర్చుకొననే నేర్చుకొనలేదు. ఏలననఁగా నాతఁడు న్యాయకర్తయగు

సాక్షాత్ యమధర్మరాజే. దుర్యోధనాది కౌరవుల కాలుడు మిక్కిలి
సుకృతముచే ప్రాప్తించినాడు. కాని యీ దుష్టులు ఆతని
నాదరింపలేరు. ఆతని మాటలను లెక్కచేయలేరు. రాజ్యగర్వ
మునను, బలగర్వమునను, ఆతని దిరస్కరించిరి.

విదురుఁ డందఱి సమక్షమున స్పష్టముగ ధృతరాష్ట్రునితో
"రాజా! నీ వెంతవఱకు ఈ దుష్టదుర్యోధనుని బుత్రునిగ
భావించి యింటిలో నుంచుకొందువో అంతవఱకు నీకు కల్యాణము
లేదు. నీవు నీ కులముయొక్కయుఁ, బురముయొక్కయుఁ,
బరివారముయొక్కయు, రాజ్యముయొక్కయు, సమస్త ప్రపంచము
యొక్కయు మేలు కోరునెడల, మూర్తిమంతుఁడగు క్రోధమును,
కలియొక్క అవతారము నగు నీ దుర్యోధనుని బట్టుకొని శ్రీకృష్ణు
నకు ఒప్పగించుము లేదా దేశమునుండి వెడలఁగొట్టుము. ఇంతకు
తప్పితే నీకు కల్యాణము లేదు. వీనిని నీ దగ్గరనుండి దూరముగఁ
బంపకున్న నీకును క్షేమముకా" దని పలుకగా నీ మాటలను విని
దుర్యోధనుఁడు కోపకంపితుఁడై, అత్యధిక రోషస్వరమునఁ బండ్లు
పటపట కొరికి, బొమముడివైచి యిట్లనెను:— "నీచుఁడు, దుష్టుఁడు,
అప్రియవాదియు నగు నీ దాసీపుత్రుని యిక్కడి కెవరు పిలిచిరి ?
రాజసభలో నిట్టి అప్రియవాదియు, లజ్జా వినయ విహీనుఁడు,
దుశ్చరిత్రుఁడు నగు నీ శూద్రుని కేమి పని ? రాజసభలో సదా
మధురవాక్కియే సన్మానమును బొందును. ఏలననఁగా రాజులు
మధురవచన ప్రియులుగ నుందురు. ఈ విషముఖుఁడు మాటలాడి
నప్పు డంతయు విషమును గ్రక్కుచుండును. విషసర్పమునోట
విషపుతిత్తి యున్నట్లే యితని నోట విషమేకలదు. ఎన్నడును ప్రేమతో,
సత్కారముతో, శిష్టాచారముతో, వినయపూర్వకముగ మాటలాడనే

మాటలాడఁడు. ఈతఁ డేయాధారమును జూచుకొని యింత అతిశయముగ మాటలాడు చున్నాఁడు? మేము రాజులము, శాసకులము, స్వతంత్రులము. మా యిష్టము వచ్చినట్లు చేయుదుము. ఈ నీచునకు మాదగ్గఱ మాటలాడుటకేమి అధికారము కలదు?

ఈతఁడు నౌకరు; మా పెంపుడు పక్కి. మా కూడుతిని బ్రతికినాఁడు. మా పళ్లెములలో దెంగిలికూడును దిని బలిసి మా మీఁద తన యధికారమును జూపుచున్నాఁడు. మాముందు తన తెలివినంతను జూపుచున్నాడు. ఏ యాకులో దిని నాఁడో ఆ యాకునే చించుచున్నాడు. ఏ కుండతో వండుకున్నాడో దానినే బ్రద్దలు కొట్టుచున్నాఁడు. తినిన యింటి వాసములు లెక్కించుచున్నాఁడు. స్వామిద్రోహము చేయుచున్నాఁడు. నీచమునకును హద్దుండును. ఈతఁ డాహద్దునుగూడ దాఁటినాఁడు. నితాంత కృతఘ్నుఁడైనాఁడు. ఇక్కడ నుండి వేతనమును గ్రహించి మా శత్రువుల హితమును గోరుచుండును. మా కూడును దిని మాకు వ్యతిరేకముగఁ బనిచేయుచుండును. మా శత్రువులతోఁ గలిసి మమ్ములను నిర్వీర్యులుగను, నపుంసకులుఁగను, పరాక్రమ రహితులుఁగను భావించి సదా నిరుత్సాహులఁ గావించుచుండును. ఈతఁ డిచ్చటఁ గూర్చుండ నర్హుఁడు కాడు. వధ్యుఁడు. కాని యీ నీచుఁడు మాతాత దాసీకి పుట్టినాఁడు. ఈ సంబంధమున నేను మా తాతమీఁదగల మర్యాదచే వీనికి ప్రాణదండమొసంగుటలేదు; కాని యిప్పుడీ కటుభాషియగు వీని ముఖమునైనఁ జూడఁగోరుట లేదు. నాకు వీని ముఖముఁ జూచిన మంట. వీని నిప్పుడే బంధించి, జీవితముతోడనే నగరమునుండి వెడలనడిపి, "నీచా!

మరల నీ పురమునకుఁ దిరిగివచ్చితివా, నిన్ను బ్రదికియుండఁగానే పక్కులచేఁ దీఁకించెద" మని చెప్పుడు."

దుర్యోధనుఁడు తన పినతండ్రినిట్లు క్రోధపూర్వకముగఁ బల్కుటను గాంచి సభయంతయు స్తంభితమయ్యెను. ఎవరి నోటి నుండియు మాట వెలువడలేదు. అక్కడున్నవా రందఱును శిలా ప్రతిమలవలె స్తంభితులైరి. విదురుఁడేమి చెప్పినను గౌరవుల హితముకొఱకు తన యధికార కర్తవ్యముగ భావించి ధృతరాష్ట్రుని యండఁజూచుకొని పలుకుచుండెడువాఁడు. 'రాజ్యాధిపతి ధృత రాష్ట్రుఁడు. నేనాతని తమ్ముఁడను. ప్రధానమంత్రిని. రాజ్య హితముకొఱకు నేనేమి చెప్పినను మాయన్న దాని నంగీకరించు' నని యింతవఱకనుకొనుచుండెడువాఁడు. ఇంతవఱకట్లే జరుగు చుండెడిది; కాని నేఁడు ధృతరాష్ట్రుని సమక్షముననే దుర్యోధనుఁ డాతని నానా కటువచనములను బలికెను. అవి తిట్టరాని తిట్లగుటచే నాతనికి మానసిక దుఃఖము కలిగెను. ఆతఁడు ధృతరాష్ట్రుని ముఖమును జూచుచుండెను. 'నా తమ్ముని నీవిట్లందు వేల'నని దుర్యోధనుని కసురుననియుఁ, జీవాట్లు పెట్టఁగలఁడనియు, నాతనిని వారింపఁగలఁడనియు విదురుఁ డాశించెను గాని, ధృతరాష్ట్రుఁ డివి వినియు నూరకుండెను. ధృతరాష్ట్రుఁడు మౌనముండుటను గాంచి, 'కౌరవకులమునకు నాశము సమీపించెననియుఁ, బాపము పండిన దనియు గ్రహించెను. ఆ పాపఫలమును గాంచి మూర్ఖులై ప్రాణాం తమునకుఁ బాల్పడుచున్నారు. ఈ బీభత్సదృశ్యమును నేను నా కన్నులతో నేలఁ జూడవలెను ? నా పరివారము సంహారమగుటను గాంచి నేనేల దుఃఖింపవలయును ?' అని యాలోచించి, యాతఁడు మిక్కిల నమ్రతతో నిట్లనెను :— అన్నా ! దుర్యోధనా ! నీవు

నన్ను దేశమునుండి వెడలఁగొట్టుటకు దూతలను బంపింప నవసరము లేదు. నీవు నీ రాజ్యకార్యములను జూచుకొనుము. నీ పట్టణమును నీ వుంచుకొనుము. నేనే స్వయముగ వెళ్లెదను. నీవు బ్రదికి యుండఁగా నేను నగరమునకు రాను." ఇట్లని యాతఁడు చప్పున లేచి నిలుచుండెను, ఇప్పుడైనను ధృతరాష్ట్రుఁ డాతని నడ్డగింపలేదు. 'తమ్ముఁడా! నీ వెచ్చటికి వెళ్లెదవు? గుడ్డినగు నన్నుఁ జూచి యీ యుద్ధతపు మాటలను మఱచిపొమ్మ'ని పలుకలేదు. అట్లు పలికియుండినయెడల విదురుఁ డాగిపోయియుండెడువాఁడే. కాని ధృతరాష్ట్రుఁ డేమియును బలుకలేదు. కావున నాతఁడు దీనిని విధివిధానముగ గ్రహించెను; కాని విదురుఁ డన్యథా తలంచలేదు. ఆతఁ డిట్లు తలఁచెను :— "ఇది మాయాపతియగు మాధవుని మోహినీమాయా ప్రభావము. ఆతఁ డెవనికే నెప్పు డేవిధముగఁ జేయింపఁ దలఁచునో, అప్పుడాతని కట్టి బుద్ధి పుట్టించుచుండును." అని తలఁచి ఆతఁడు వెంటనే రాజసభా భవనము నుండి లేచి బయటకు వచ్చి, సభాద్వారమునఁ దన విశాలధనుస్సు నుంచి, యచ్చటనుండి వెడలిపోయెను.

అంతఁ బరీక్షిన్మహారాజిట్లనెను :— "ప్రభూ! ధనుస్సును ద్వారమున నుంచుట కేమి కారణము?"

ఇది విని శ్రీ శుకుఁ డిట్లనెను :— "రాజా! ధనుస్సును ద్వారమున నుంచుటకుఁ జాల కారణములు కలవు. మొదటి కారణము శత్రువులనుండి రక్షించుకొనుటకే ధనువు. రాజకార్యములు త్యజించినప్పు డిక శత్రుమిత్రు లెవరును లేరుకదా! అట్టియెడ ధనుర్బాణములతోఁ బని యేమి కలదు? ఇఁక రెండవకారణ మేమనఁగా - నిప్పు డాతఁ డలక్షితుఁడై ఎవరును గుర్తింపకుండుటకు

యవధూతవేషమునఁ దిరుగఁ దలఁచెను. విల్లుండు నెడలఁ బ్రజలు శత్రుఁడెవఁడో రాజ పరివారములోనివాఁడని గ్రహింతురనియు ధనుస్సు నక్కడుంచెను. మూఁడవకారణము - ఒకవేళ ధనుస్సును దీసికొనిపోయినచో నితఁడు పాండవపక్షమునఁ జేరినాఁడని కౌరవులు సందేహపడవచ్చును. ఇప్పు డీ శంకానిర్మూలనము కావించుటకును, తటస్థుఁడనై నెవరిపక్షమున జేరకున్నట్లు గ్రహించుటకును ధనుస్సును విడిచిపోయెను. నాల్గవకారణము - హత్యకు మూలమీ ధనుస్సే. అన్నదమ్ములిప్పుడు రక్తపిపాస జెందియున్నారు. తాను వెళ్ళిపోయిన తర్వాత కౌరవ పాండవులు వినాశము కాకుండునట్లు కల్యాణము కాంక్షించు మీరు ధనుస్సులు క్రిందబెట్టుఁడని తెలుపుటకా యనునట్లుంచెను. అయిదవ కారణము - మీ యీ ధనుస్సును ధరించినంతవఱకు మీ కార్యము చక్కపెట్టుచుండెడు వాఁడను. ఇప్పుడు మీ పని మీరే చూచుకొనుఁడు. నే నిప్పుడు ధనుపద్భ్రంశము చేసికొందును. అనఁగాఁ దన ప్రధానమంత్రిత్వమును ధనుస్సునక్కడనుంచి రాజీనామా పత్రము నొసంగినట్లు దోఁచునట్లు చేసెను. ఆఱవకారణము - నేను కేవలము మీ ధనుస్సును ధరించుటచేతనే మీకు హితమును జెప్పుచుంటిని. మనస్సు మా పాండవులమీఁదనే కలదు. కావున మనస్సుతో నిప్పుడును పాండవుల కల్యాణమునే కాంక్షించు చున్నాను. మరల నేను ధనుస్సును ధరింపవలసిన అవసరము లేనప్పుడే వచ్చెదను. అనఁగా ధర్మరాజు సింహాసనారూఢుఁడైనప్పుడే వచ్చెదను." ఈ విధముగ ననేక గూఢరహస్యములను విచారించి విదురుఁడు నిఃశస్త్రుఁడై నగరమునుండి వెడలిపోయెను.

—(•*•)—

# విదురుండు హస్తినాపురమును వదలి తీర్థయాత్రకు వెడలుట

శ్లో॥ నిర్గతః కౌరవపుణ్యలబ్ధో
గజాహ్వయా త్తీర్థపదః పదాని,
అన్వాక్రమత్ పుణ్య చికీర్ష యోర్వ్యామ్
స్వధిష్ఠితో యాని సహస్రమూర్తిః ॥

—శ్రీభాగ. ౩ స్కం. ౧ అ. ౧౭ శ్లో.

వ. పరమ భాగవతోత్తముండైన విదురుండు బంధుమిత్ర జాతంబుల విడిచి సకలభువన పావనంబులును గీర్తనీయంబులును నైన తీర్థంబులను నగణ్యంబులైన పుణ్యక్షేత్రంబులను దర్శించెను.

—శ్రీమదాంధ్రభాగవతము.

—·•·—

హితవాక్యములను బలికినఁ జెడ్డగాఁ దోఁచినను, హితైషిని శత్రువుగాఁ జూచినను, బూజ్యులను దూషించినను, గురుజనములను గూడ అవహేళనము కావించినను, సాధుపురుషులను దిరస్కరించినను వానికి వినాశకాలము సమీపించినదని గ్రహింపవలెను. మృత్యువునకు వశుఁడై తన సర్వస్వమును నాశము చేసికొనుటకే మానవుఁ డిట్టి యాచరణము నొనర్చును. నిరతము మన హితమును గోరుచు మనమొనర్చు దుర్వ్యవహారమునకు దుఃఖితులై మనలను వీడి వెళ్లగా, అట్లు వెళ్ళిన తర్వాత మనకు పశ్చాత్తాపము కలుగకున్నచో మనకు శుభసూచకము కాదని గ్రహింపవలయును.

ఇది తెలిసియే పరీక్షిన్మహారాజిట్లడిగెను:— "ప్రభూ! పరమభాగ
వతుఁడగు విదురుఁడు హస్తినాపురమునుండి వెళ్ళిన తర్వాత నేమి
జరిగెను? ఆతఁ డెచ్చెచ్చటికి వెళ్ళెను? ఈ వృత్తాంతము
నంతను మీరు నాకుఁ జెప్పవలయును."

పరీక్షిన్మహారాజుయొక్క యీ యుత్సుకతను గాంచి శుకుఁ
డిట్లనెను:— "రాజా! ఏమైనది? ఏమి కావలయునో అదియే అయి
నది. విదురుఁడు కౌరవుల యొద్దనుండి యెప్పుడు వెళ్ళినాడో వారి
భవనము నుండి వారి పుణ్యమంతయు నప్పుడే వెళ్ళినది. ఏదో
ప్రబల పుణ్యప్రభావముచే వారు పదవిని, ప్రతిష్ఠను, రాజసింహా
సనమును, పరమ బుద్ధిమంతుఁడగు విదురువంటి మంత్రిని లభింపఁ
జేసికొనిరి. ఆ పుణ్యము నేఁటితో ముగిసినది. సమస్త పుణ్యము
తోడను, సద్గుణముల తోడను విదురుఁడు హస్తినాపురమునుండి
తరలిపోయెను. భూమండలములోని సమస్తరాజన్యులు ఆతనిని
ధర్మరాజు రాజసూయ యజ్ఞమునను, హస్తినాపురమునను అనే కావ
సరములందు ప్రధానమంత్రి రూపమునఁ గాంచిరి. వేలకొలదిమంది
మీద నధికారము చెలాయించు నాతనిని దర్శించిరి. నేఁడాతని నొం
టరిగా నకించనవేషమునఁ గాంచి లోకులు వివిధ విధములఁ
బ్రశ్నించుచుండిరి. విదురునట్టి మహాత్ముఁ డేరిపైనైన దోష
మెన్నునా? అందువలన నాతఁడు తన్నెవరును గుర్తింపఁజాలకుండు
నట్లు వేషమును ధరించెను. రాజోచిత వస్త్రభూషణాదులను దీసి
పారవేసెను. సాధారణ వల్కలాజినములను శరీరమున ధరించెను.
శరీరమంతటను భస్మము నలదెను. జడలు ధరించెను. గడ్డమును
బెంచెను. మౌన వ్రతమును ధరించెను. పెద్దదండమును జేతధరిం
చెను. ఈ విధముగ నాతఁడు విచిత్ర వేషమును ధరించి భూమిపైఁ

జరించుచుండెను. భోజన నియమము లేదు. భగవదిచ్ఛచే లభించు కందమూల ఫలాదులనుదిని సంతోషించుచుండెను. దొరకని రోజున నుపవసించెడివాడు. అతఁడేతీర్థమునకుఁ బోయిన నచ్చట ముందుగా స్నానముచేసి, భగవద్ధ్యానము చేయును. ఎచ్చట ప్రొద్దుక్రుంకిన నచ్చట ఆకులు పరుచుకొని పరుండును. తన ఆత్మీయ బంధువు లున్నచోటను వెళ్ళెడివాఁడు కాఁడు. ఈ విధముగ నాతఁడు తన యజ్ఞాతజీవితమును గడుపుచుండెను. సమీపదేశ రాజన్యులతో నాతనికి నిత్యము పని కలుగుచుండెడిది కావున నాతఁడిరుగు పొరుగు దేశములలోఁ దిరుగక దూరముగ దక్షిణదేశ తీర్థములందు మొట్టమొదట తిరుగుచుండెను.

దక్షిణదేశములోని భగవానుని విశాల దివ్యదేశములను విదురుఁడు కాంచెను. అచ్చటచ్చట గొప్పగొప్ప విష్ణ్వాలయములు కలవు. అచ్చటచ్చట దీర్ఘాకారముగల విశాల పర్వతములవంటి శివాలయములు గలవు. పెద్దపెద్ద గోపురములుగల దేవాలయము లెచ్చట కనఁబడునో అచ్చటికి వెళ్ళెడివాఁడు. దాక్షిణాత్యులు తమ భాషలో నేదో గడబిడగా మాటలాడుకొనెడివారు. కాని విదురునకుఁ దెలిసెడిది కాదు. సముద్రతీరమునఁగల యాప్రదేశము మిక్కిలి మనోహరముగను, పచ్చపచ్చగ నుండెడిది. ఆ పరమపవిత్రములగు నగర, వన, ఉపవన, పర్వత, నదీనద, నికుంజములను, నిర్మల నీరములుగల సరోవరాదులను గాంచి విదురుఁడు మిక్కిలి యానందమును జెందెను. విదురుడు మిక్కిలి బుద్ధిమంతుఁడు. ఆతని కన్నిభాషలును దెలియును. ఇంతెందుకు, ఆతనికి మ్లేచ్ఛ భాషకూడ బాగుగఁ దెలియును. కాని యాతఁడెంత శ్రద్ధ చూపి నప్పటికిని దక్షిణాదిభాష లతని కంతుపట్టలేదు. ఇచ్చట సాధువు

దేవరైనఁ గనఁబడిరా వారితో మాటలాడెడువాఁడు. లేకున్న మౌన ముండెడువాఁడు. అవసరవిషయములను సైగలద్వారా చెప్పెడు వాఁడు. ఒకానొక సమయమున నాతనికొక విరక్తుఁడు రామభక్తుఁడు కనఁబడెను. సంభాషింపఁగా నాతఁడొక కథ చెప్పెను. అది యిట్లుం డెను.

కౌసల్యా నందనుఁడగు శ్రీరామచంద్రుఁడు అశ్వమేధాది యజ్ఞము లొనర్చినతర్వాత తమ్ములనందఱను బిలిచి, మీరువెళ్లి సమస్త దేశభాషలను నేర్చుకొనిరమ్మని పంపెను. చక్రవర్తికి అన్ని భాషలును వచ్చియుండవలయును. లక్ష్మణుని దక్షిణదిక్కునకుఁ బంపెను. లక్ష్మణుఁడు కడుబుద్ధిశాలి. అట్టి వానికిఁగూడ దక్షిణదేశ భాషలను నేర్చుట కష్టమయ్యెను, వాటి ఉచ్చారణ అంతయుఁ గంఠముతోడనే జరుగును. నేర్చుకొని అయోధ్యకు వచ్చెను. శ్రీరాముఁ డిట్లనెను:— "సోదరులారా! మీరేయే భాషలు నేర్చితిరో నాకు విని పింపుడు." లక్ష్మణుని వంతు రాఁగానే యతఁడొక తప్పేలలో కంకర రాళ్ళనుబోసి దానిని గదలింప మొదలిడెను. అంత నవ్వి శ్రీరాముఁ డిట్లనెను:— "తమ్ముడా! ఇదేమి గారడీ ఆడుచున్నావు? దక్షిణ భాషలను వినిపించుచున్నావా? లేక ఆట ఆడుచున్నావా?" అంతఁ జేతులను జోడించుకొని లక్ష్మణుఁ డిట్లనెను:— "ప్రభూ! ఇదియే దక్షిణభాష ఖాళీతప్పేలలో కంకరరాళ్లువేసి కదలించిన నెట్లు శబ్దమగునో, సరిగా అట్లే దక్షిణభాషలని తెలియవలయును."

ఇది విని విదురుఁడు మిక్కిలిగ నవ్వెను. దక్షిణాది వాంధ్ర విషయము వచ్చినప్పుడెల్ల నాతనికి లక్ష్మణుని మాట జ్ఞాపకమునకు వచ్చెడిది. ఈ విధముగ నాతఁడు భారతవర్షములోని సమస్తతీర్థము లను గాంచి, చివరకు ద్వారకా సమీపమున నున్న ప్రభాసపట్టణ

క్షేత్రమునకు వచ్చెను. అక్కడే అతఁడు మహాభారతయుద్ధమైనట్లు వినెను. కౌరవు లందఱును సమసిరి. పదునెన్మి దక్షౌహిణీ సేన సంహరింపబడెను. వాసుదేవుని సహాయమున ధర్మపరాయణుఁడగు ధర్మరాజు సమస్త సర్వంసహాచక్రమునకు నేకచ్ఛత్రాధిపతి యయ్యెను.

విదురుఁడు కౌరవుల ఆచరణమునుగాంచి మొదటినుండియు దుఃఖించుచుండెను. "వినాశకాలే విపరీత బుద్ధిః" అనునట్లు వీరికి వినాశకాలము సమీపించినది. కావుననే యిట్టి విపరీతబుద్ధి పుట్టినదని ఆతఁడు గ్రహించెను. కౌరవ పాండవులకు యుద్ధము జరుగుట ఆతని కిష్టము లేదు. కావున జరుగవలసిన దాని నెవ రాపఁగలరు? యుద్ధమాగదనియు, దుర్యోధనుఁడు చెప్పినమాట వినఁడనియు, ధృతరాష్ట్రుఁడైనను వానిముందేమియు మాటలాడఁ జాలఁడను సంగతిని దెలిసికొని యాతఁడు తీర్థయాత్రా మిషమున వెళ్ళిపోయెను. ఒక్కచోటనే పుట్టిన వెదురు పరస్పరమురాచుకొని, దావవహ్నిచే దగులఁబడి భస్మమైనట్లు, స్పర్థచేఁ గుటిలతాకారణమునఁ గౌరవవంశము నాశనమైనదను సంగతిని విని యాతఁడు చాల దుఃఖమును జెందెను. వారెట్టివారైనఁ గానిండు, వారందఱును దనవారేకదా! ఏమిచేయఁగలఁడు? అతఁడు కులవినాశ శోకసంతప్తుఁడై, యూరక సరస్వతీనదీ తీరమునకుఁ జేరి, ప్రాచీనసరస్వతీ సాగర సంగమమున స్నానమొనర్చి, అంతఁబోయిపోయి త్రిత, ఉశన, మను, పృథు, అగ్ని, అసిత, వాయు, సుదాస, గొ, గుహ, శ్రాద్ధదేవాద్యేకాదశ దేవతా నామములచేఁ బ్రసిద్ధములగు తీర్థములన్నిటిలో స్నానముచేయుచు, దక్షిణతీర్థము లన్నిటిని సేవించెను.

దేవాలయ గోపురాంతముగ నెగురు ధ్వజములను జూడఁ గానే, అతఁడచ్చటనే నేలపైఁబడి ప్రణామ మొనర్చెడివాఁడు. విష్ణుమందిర గోపురముల మీఁదను, ద్వారముల మీఁదను జెక్కఁ బడిన శంఖ, చక్ర, గదా, పద్మములను జూడఁగానే అతఁడు పడు ఆనందమునకు మేరలేకుండెను. శివాలయములలోఁ గల పెద్దపెద్ద నందులను గాంచి మిగులనానందమును జెందెడువాఁడు. ఒక్కొక్క శివాలయములోఁ గొండంత నందిని గాంచి, మన యుత్తరదేశములో నింతటి గొప్ప నందీశ్వరులు లేరే అని చాల ఆశ్చర్యమును జెందుచుండెడువాఁడు. ఒక్కొక్కచోట చాల పొడవైన గరుడ విగ్రహములను గాంచెడువాఁడు ఈ విధముగ భగవానుని అస్త్ర, ఆయుధ, పార్షద, పరివార, వాహనాదులను గాంచఁగానే ఆతని శరీరము పులకించెడిది. ఎక్కడ శంఖ, చక్ర, గదాది ప్రతిమ లను జూచునో. అచ్చట ఆతనికి వాసుదేవ స్మరణము కలుగు చుండెడిది. ఆహా! మా శ్యామసుందరుని చరణములయందు ఇట్టి వజ్ర, అంకుశ, ధ్వజ, పద్మ, శంఖ, చక్రాది చిహ్నములు కలవు. మా నందనందనుఁడే ఒక్కొకచోట చతుర్భుజుఁడగు విష్ణుఁడ య్యును, ఒక్కొక్కచోట లింగాకారమున శివుఁడై విరాజిల్లు చున్నాఁడు. ఆ నటవరుఁడు బహురూపధారి, అన్నియు నాతని మూర్తులే. అన్నిరూపములలోను ఆతఁడే వ్యాపించియున్నాఁడు. సమస్త స్వరూపముల చేతను ఆతఁడే వారివారి భావముల ననుస రించి పూజలను గ్రహించుచున్నాఁడు. ఈ విధముగ నాతఁడు భేదబుద్ధిని వీడి. సమస్తతీర్థములందును స్నానపూజాదుల నొన ర్చుచు నుత్తర దిక్కుగా బయలుదేరిపోయెను. ఆతఁ డత్యంత సమృద్ధిశాలియైన సౌరాష్ట్ర, సౌవీర, మత్స్య, కురు, జాంగలాది దేశములను దాఁటుచు, యమునానదీతీరముననే నందనందనుని

క్రీడాస్థలమును, బరమపావనమునగు వ్రజభూమికిఁ జేరెను. ఆవ్రజ రజ కణలేశమునకై బ్రహ్మాది దేవతలు నిరంతర మా వేదన పడుచుందురు. అట్టి భూమికి చేరి విదురుఁడు భావసమాధిని జెందెను. ఆతని సమస్త సరీరరోమములును గగుర్పాటుచే నిలువబడెను. ఆతని నేత్రములనుండి అశ్రువులు ప్రవహించుచుండెను. ఇట్టి స్థితిలో నాతఁడు యమునా సైకతప్రదేశమునబడి, భగవద్ధ్యానములో నిమగ్నుఁడయ్యెను.



ఆనందము వాగ్విషయముకాదు. ప్రేమోన్మత్తులును, హరికి ప్రియులును, సంసారసంబంధ బాహ్యులు నగు భక్తులు సమావేశమైనప్పుడు కాంచిన ప్రేమహీనహృదయులు కూడ ప్రేమమయులగుదురు.

ఒక భక్తుఁడింకొక భక్తుని జూడఁగానే ఆతనికి దాను ముందుగాఁ బ్రణామము చేయవలయుననియు, రెండవవాఁడీతనికిఁ దాను ముందుగా నమస్కరింపవలయుననియుఁ గోరుచుండును. ఇద్దరి హృదయములలోను భక్తవాంఛా కల్పతరువగు శ్యామసుందరుఁడు విరాజిల్లుచుండును. భక్తుఁడగువాఁడు వేరొక భక్తుని జూడఁగానే వెంటనే నేలపైఁబడి ప్రణమిల్లును. ఇంతలోనే రెండవవాఁడు కూడ అతిశీఘ్రముగ భూమిపైఁబడి ప్రణమిల్లును. వీరిద్దరికోరికలు సఫలముకావింపవలెనని భగవంతుఁడపేక్షించును. వెంటనే ఆతఁడు వారి హృదయములనుండి బయటకు వచ్చి వారి మధ్య నిలువబడును. ఇద్దరును నాకు నమస్కరించుఁ డను. 'నేను భక్తుల కోరికలను దీర్చవలయును. కావుననే నేను భక్తులలో నుచ్చనీచతలను, పిన్న పెద్దతికములను, అధమ శ్రేష్ఠతలను జూడను' అనును. ఎవరికి ప్రణామము చేయవలయునో, ఎవరికి చేయఁగూడదో, అదియును గాక తనకంటె గొప్పకులమువానికి ముందుగాఁ బ్రణామము చేయవలననియు, నీచకులమువానికి ముందుగాఁ బ్రణామము చేయరాదనియు, నిట్టి నియమము లనేకలను స్మృతికారులు నిర్ణయించినప్పటికిని భక్తిమార్గములో నీ నియమము లేదు. భగవద్భాగవతులైనవారును, హరిశరణాపన్నులును, ప్రసన్నులైనవారును, విష్ణుభక్తిమార్గ దీక్షితులును, వైష్ణవదీక్షను బొందినవారును, వైష్ణవచిహ్నధారణము కావించువా రేవర్ణమునకుఁ జెందినవారైనను సరియే, యేజాతివారైనను గానిండు వంద

నీయులు, శ్లాఘనీయులుఁ, ఆదరణీయులు, ఆలింగనీయులు. ఎవని శరీరములో శ్యామసుందరుఁ డాసనము వేసికొని యున్నాఁడో, యెవని కరముంచేఁ గంసమర్దనుని కైంకర్యము జరుగుచున్నదో, యెవని పాదములు సర్వదా పుణ్యధామముఁ జరించుచుండునో, యెవని శిరస్సు సదా శ్రీపతికిని, ఆతని శరణాగతులకును నమస్క రించుచుండునో అట్టిభక్తుల అంగములెంత పావనములో, ఆతని స్పర్శ యెంతటి సుఖకరమో చెప్పఁదరమా ?

ఇద్దరు భక్తులయొక్క సమావేశ దర్శనాభిలాష గలవారే లోకములో ధన్యులు. ప్రేమోన్మత్తులగు భక్తద్వయమును గాంచిన కన్నులు ధన్యములు. ఏశ్రవణములు భక్తయుగళము ఏకాంత మున మాటలాడుకొనుమాటలను వినినవో వారిమధ్యజరుగు భగవ త్కథాలాపామృతమును గర్ణపుటములతోఁ ద్రావినవారి కర్ణములును ధన్యములు. అవియే కర్ణములని చెప్పఁదగినవి. వానికి శ్రవణ ములను పేరు సార్థకమైనవి. లోకములో నన్నియు సులభములే కాని భక్తులతో సమావేశము, భక్తదర్శనము, భక్తులను గౌఁగి లించుకొనుటఁ భక్తులతో సత్సంగము ఇవి చాల దుర్లభములు. భక్తసత్సంగము పుణ్యక్షేత్రములందును, భగవద్ధామములందును, పావనపురములందును సాధారణముగ జరుగుచుండును. భగ వానుఁడు తన యలౌకిక గుణాతీత విగ్రహమును ధరించి దివ్య లీలల నెచ్చట జరిపెనో, అట్టి స్థలములను దర్శించుటచే భావో ద్రేకము కలుగును. రసవృద్ధి కలుగును. అందువలననే భక్తులు సాధారణముగ భగవత్క్రీడా స్థలముల సమీపమున నివసించు చుందురు. ఆ సమీపముననే ఇటునటుఁ దిరుగుచుందురు.

బృందావనమునకు రాఁగనే విదురునకుఁ బరమశాంతి లభించెను. యోగీంద్రులు, మునీంద్రులు, బ్రహ్మాది దేవతలే వ్రజరజమునకు నమస్కరింతురో అట్టి దానిలో నాతఁడు పొరలాడెను. శ్రీ కృష్ణుఁడు గోపికల అజ్ఞానావరణమును తొలిగించి, వారిలోఁ దన యద్వైతభావమును స్థాపించిన పవిత్రమగు కాళిందీపులిన మదియే. ఏ నిభృత నికుంజములలో నందనందనుఁడు వ్రజాంగనలతో రాసలీల జరిపెనో ఆ యమృతవాహినీ సుధామయ సరిద్వర మిదియే. ఈ సూర్యతనయాతటమందు దన యరుణాధరమందు ధరించి మురళీమనోహరుఁడు మురళీగానము నొసర్చెను. వ్రజ జీవన రూపమగు నీ సరిద్వర శుద్ధ స్వచ్ఛ సలిలమును విషమయ మొనర్చిన కాళీయోరగమును శ్యామసుందరుఁడు మదమడంచిన దిచ్చటనే. ఈ వ్రజ వృక్షచ్ఛాయలఁ గూర్చుండియే శ్రీకృష్ణుని ఐకాంతిక దూతయగు నుద్ధవుఁడు ప్రేమోన్మత్తలగు గోపికలకు శ్రీకృష్ణ సందేశమును వినిపించినాఁడు. ఈ కదంబ శీతలఛాయలఁ గూర్చుండియే మహాబుద్ధిశాలియు. బృహస్పతి శిష్యుఁడు నగు నుద్ధవుఁడు ప్రేమసందేశమును వినిపించెను. ఆహా ! వ్రజభూమియందు గుల్మలతాస్వరూపమును బొందఁగోరినట్టియు, నాటువిక అజ్ఞ అహీర స్త్రీల చరణధూళిఁ దన సర్వస్వముగ నెంచిన యా యుద్ధవుఁడు ధన్యుఁడు విదురుఁ డిట్లనుకొనుచుండఁగనే ఉద్ధవుఁడు తన కెదురుగ వచ్చుటను గాంచెను. అతని గతి విచిత్రముగ నుండెను. ఒకచోటను అడుగు పెట్టఁదలఁపఁగా వేఱొకచోటఁ బడుచుండెను. కనుబొమ లెత్తుకొని యుండెను. కన్నులెఱ్ఱగ నుండెను. నేత్రపుకలు చింపిరి చింపిరిగ నుండెను. కన్నుల నుండి నిరంతరము అశ్రువులు ప్రవహించుచుండెను. ఈ దశ యందు ఉద్ధవునిగాంచి విదురుఁ డాశ్చర్యచకితుఁ డయ్యెను.

మొదట నతఁడిది స్వప్న మేమో యనుకొనెను. అట్టిభ్రమ కలుగఁగానే తన రెండుచేతులతోఁ దన కన్నులను నలుపుకొని, అటునిటుఁ జూడసాగెను. ఆ బృందావనమే, ఆ యమునా పులినమే, అతిమందగతిని యమున అచ్చటనే ప్రవహించుచుండెను. వృక్షలతాదులు నవియే. ఆ మయూరములే. ఆ హరిణములే. ఆతఁడు లేచి నిలుచుండి యిట్లు తలపోసెను:—ఇది స్వప్నముకాదు. ఇది మనోరథము. మన మేకాగ్రముగఁ జింతించినచో, ఆ సజీవమూర్తి మన నేత్రసమ్ముఖమునఁ బ్రత్యక్షముగఁ దాండవమాడుచుండును. ఇంత సేపటినుండి నేను ఉద్ధవునిఁ జింతించుచున్నాను. అందుకనియే ఆతని మనోమయ స్వరూపమెట్లు ప్రత్యక్షమై నాయెదుట నున్నదో చూడుము. ఇంతలోనే ఉద్ధవుఁడింకను దగ్గరకు వచ్చెను. ఇప్పుడు విదురుఁడు నదుటపడెను. ఆతనికి క్షణములో బాహ్య వృత్తి కలిగెను, ఇది మనోరథమును గాదు. ఉద్ధవుని మనోమయ మూర్తియును గాదు. ఈతఁడు ప్రత్యక్షముగ నుద్ధవుఁడే. అని ఇట్లనుకొనుచు నాతఁడాతని నాలింగన మొనర్చుటకుఁ బరువిడెను. అటునుండి ఉద్ధవుఁడును దుమికెను. తమాలశాఖను ప్రియంగుశాఖ పెనవేసికొన్నట్లును, బృందావనములో గంగా యమునలు కలిసిన ప్రయాగ ప్రత్యక్షమైనట్లుండెను. ఒకొక్కరొక్కరుప్పొంగి గట్టిగా నాలింగనము చేసికొనుటకు ముందువెనుకలకు లాగుకొనుచుండెను. క్షీరనీరముల వలెను, పిండి నీరువలెను వారిద్దరేకమైరి. వారి ప్రాణము లేకమగుటయేకాదు; వారి శరీరములును ఏదియో నాల్గుకాళ్ల మానవునివలె నొక్కటే అయిపోయినట్లు కనఁబడెను. చాలసేపటివఱకు వారిద్దరును తమ తమ హృదయములను శీతలము గావించుకొనిరి. వారి ప్రేమావేశము కొంచెము శాంతించిన తర్వాత వారిద్దరు వేఱై, అచ్చటనే యమునా కూలమునందు, రజతచూర్ణమువలె మెఱయు

# భగవత్పరివారముయొక్క కుశలప్రశ్న

శ్లో॥ తస్య ప్రసన్నాఖిల లోకపాలానా
మవస్థితానా మనుశాసనే స్వే,
అర్థాయ జాతస్య యదుష్వజస్య
వార్తాం సఖే కీర్తయ తీర్థకీర్తేః

— శ్రీభాగ. ౩ స్కం. ౧ అ.౨౫ శ్లో.

క. మదిఁ దన శాసన మిడి నిజ
పదములు సేవించు లోకపాలాదుల పెం
పొదవింప యదుకులంబున
నుదయించెను భువిని బలసహోదరుఁ డగుచున్

తే. చలనమందక భూరి సంసరణ తరణ
మైన సత్కీర్తి దిక్కుల నతిశయిల్లి
వఱల సమమతిమై యున్నవాఁడె కృష్ణుఁ
డనుచు విదురుఁకు యుద్ధవు నడుగుటయును.

— శ్రీమదాంధ్రభాగవతము.

—(•*•)—

సంభాషించుటలోఁ బ్రాచీనాచార మేమనఁగా పరస్పరము సంభాషణ జరుగునప్పుడు పృచ్ఛకుఁడు మొట్టమొదట స్వాగత సత్కార మొనర్పవలయును. ఆతఁడు యథాయోగ్యముగఁ బూజా సన్మానములుచేసి కొంచెము విశ్రాంతిని బొందిన తర్వాత నాతని సమీపమునకుఁ బోవును. ఆతఁడు చెప్పిన విషయము లన్నిటిని మిక్కిలి ధైర్యముతో వినును. అంత నుపక్రమోపసంహారపూర్వ

కముగ—నాతనికి మిక్కిలి సంక్షేపముగను, మిక్కిలి విస్తారముగను
గాకుండ ప్రత్యుత్తర మొసంగును. ఆ తరువాతఁ బ్రసంగానుసార
ముగ నింకను బ్రశ్నోత్తరములు జరుగును. ఈ విధముగ సంభా
షణ జరిగినచో రససంచారము కలుగును. ఈ రోజులలో స్వాగ
తమును లేదు, సత్కారమును లేదు: కుశలమును లేదు; క్షేమ
మును లేదు. పోఁగానే "ఎట్లా వచ్చావురా?" అని ప్రశ్నించుట
యును, వాఁడును బెడకట్టెగ "ఒక పనిమీఁద వచ్చాను. ఈపని
నీవు చేయాలి" అని జవాబొసంగును. ఇతఁడు వెంటనే "నాకవ
కాశములే" దని జవాబొసంగును.

ఇట్లని మరల వాని ముఖమును జూడకయే తన పనికిఁ
దాను బోఁగా నితఁడు వాఁడుముఖముతోఁ జేతులూగించుకొనుచు,
'ఈ వ్యర్థులందఱు అది చేయుము, ఇది చేయుము అని వ్యర్థముగ
బాధించుచుందురు. నా పని చేసికొనుటకు నాకే అవకాశములేదు'
అనుచుఁ దనలోఁ దాను దిట్టుకొనుచు బోవును. ఇఁక వచ్చిన
వాఁడో ఇట్లనుకొనును :— "ఎంతటి కోపిష్టి వాఁడు! ఈతనిమీఁద
నెంతో ఆశపెట్టుకొని రాఁగా మాటాడనైనను లేదు." ఇట్టిస్థితిలోఁ
బరస్పరము రససంచార మెట్లు కలుగును? అందువలననే ఈ రోజు
లలోఁ బరస్పర సంభాషణము జరుగుచున్నప్పటికి నానంద ముద్భ
వింపదు. మిథ్యాడంబరము మితిమీఱినది. ఇప్పటివారు మన
స్సును విప్పి మాటలాడనే మాటలాడరు. అభిన్నహృదయులై
ఇద్దరు నొకేమనస్సుగలవారైననే అట్లు మాటలాడుకొందురు,
విదురుఁడు, ఉద్ధవుఁడు నట్టి అభిన్నహృదయులగు సఖులే. వీరి
ద్దరును భగవంతునకుఁ బరమప్రియులే. ఇద్దరును దమ సర్వ
స్వము శ్రీకృష్ణుఁ డనియే భావించుచుండిరి. ఇద్దరియందును భగ

వేదగర్భుఁడును, లోకపితామహుఁడును జతురాననుఁడు నగు బ్రహ్మను బుట్టించెనో, ఎవఁడు జగతీ భారమును తీర్చుకొఱకు శూకరాది అనేకములగు నవతారములను దాల్చెనో, రాజుల రూపమునఁ బృథ్వియందుఁ బ్రబలిన అసురుల యసువులఁ దీసి, భక్త జనసౌఖ్యదాయకుఁ డగుటకు వసుదేవునకు రామకృష్ణులరూపమున నవతరించిన యా విశ్వవందితుల కుశలము నడుగవలసినదేమున్నది? కాని శిష్టాచారము ననుసరించి యడుగుచున్నాను. వారానందముతోఁ దమ కులమును బాలించుకొనుచున్నారా?

మాకు పరమసుహృదుఁడగు వసుదేవుని కుశలమును వినిపించుము. ఆతఁడు మా పదినెయగు కుంతీదేవికి సోదరుఁడే. తన చెల్లెంద్రయం దాతని కెంతటి మక్కువ! ఇప్పటివఱకును గూడ సదా వారిని బిడ్డలవలె భావించి దాన సమ్మానముల ద్వారా సత్కరించుచుండును. చిరకాలమునుండి ఆతనికి నాకు కలయికలేదు. ఆతఁడు మన మేనల్లుంద్రను బుత్రులవలెఁ బ్రేమించుచు, వారికి కావలసిన వస్తువుల నొసంగు చుండును.

శ్రీకృష్ణుని పెద్దకొడుకగు ప్రద్యుమ్నుని కుశలమును జెప్పుము. ఆతని కీడగు సౌందర్యవంతుఁ డీ రాజకుమారులలో నెవఁడైనఁ గలఁడా? ఆతఁ డంగజుని అవతారము. అనంగుఁ డంగములను ధరించి రుక్మిణీగర్భమున జన్మించెను. రుక్మిణీదేవి ఆతనిని గనుటకై యెంతగా నారాధించినది! ఎందఱికో బ్రాహ్మణులను భక్తితో సేవించినది. రుక్మిణీదేవియే కాదు; ఆమె పతియు మిక్కిలిగఁ దపస్సుచేసెను. ఉద్ధవా! గృహస్థులకు పుత్రముఖము చూడవలయునని ఉత్కటాభిలాష యుండును. ఈశ్వరేశ్వరావతారమగు సాక్షాత్తు వాసుదేవుఁడు పుత్రప్రాప్తికై హిమాలయములకుఁబోయి

ఆశుతోషుఁడగు పరమశివుని చాలకాలము శరీరమును శుష్కింపఁ జేసికొని ఆరాధించుటవలననే యీ యభిలాష అట్టిదని తెలియుచున్నది. ఈ మూలమునఁ బ్రద్యుమ్నుఁడు జన్మించెను. ఆతఁడు మన్మథావతార మైనప్పటికిని కూడను. అతి బలశాలియై యున్నాఁడు. సమస్త యాదవసేనకు ఆతఁడే ప్రధానసేనాపతి. ఆతని భుజబలమువలననే సమస్త యదువంశీయులు స్వర్గసుఖముల ననుభవించుచున్నారు.

ఉద్ధవా! మఱచితిని. అందరికంటె ముందుగా నీవు ఉగ్రసేనుని కుశలమును జెప్పవలయును. ఆతఁడు తన దుష్టపుత్రుని కారణమునఁ గారాగృహమున నుండి వివిధ కష్టముల ననుభవించెను. కులకళంకుఁడగు తన పుత్రుని మూలమున సర్వదా దుఃఖించుచుండెడువాఁడు. ఆతఁడిప్పుడు సుఖముగ నున్నాఁడా? శ్రీకృష్ణుఁడు కంసుని జంపియు రాజ్యమును గ్రహింపలేదు. కంసుని తండ్రియగు తన మాతామహునే సాత్వత వృష్ణిభోజ, దాశార్హ వంశములలోని యాదవుల కధిపతిగ నొనర్చెను. స్వయముగ శ్రీకృష్ణభగవానుఁ డెవనికి సేవకుఁడై సింహాసనమునకుఁ గ్రిందఁ గూర్చుండి చేతులు జోడించుకొని నిలుచుండి ప్రశ్నలకు జవాబొసంగుచుండునో అట్టి యాదవుల స్వామియగు నుగ్రసేనుని కుశలమును జెప్పుము.

జాంబవతీ తనయుఁడగు సాంబుని క్షేమసమాచారములను గూర్చియుఁ జెప్పవలయును. ఆతఁడెంతటి సుందరుఁడు! ఎట్టి కోమలప్రకృతి కలవాఁడు! ఆతని సౌందర్యముతో మోహనవిద్య కలదు. కులకామినులు కూడ ఆతని యనుపమ రూప లావణ్యములను గాంచి ధైర్యమును వీడెదరు. మాతలైనప్పటికిని శ్రీకృష్ణుని

బ్రాడెను. భగవంతుని యందు దాతని కెంతటి భక్తి ! ఎంతటి ఐకాంతిక నిష్ఠ ! వాని నన్నిటిని వర్ణించుట నా బుద్ధి కతీతమైన విషయము. ఎవని యొక్క తీక్ష్ణబుద్ధి కారణముగ యాదవులకు దానాధ్యక్షుఁ డయ్యెనో, తన తండ్రి శ్వఫల్కునివలె శుభదర్శనుఁడును, మంగళమయుఁ డెవఁ డయ్యెనో అట్టి కృష్ణకింకరుఁడగు నక్రూరుని కుశలక్షేమములను దెల్పుము.

వసుదేవుని పత్నులందఱును గుశలముగ నున్నారా? నేను ద్వారకకువెళ్ళి చాల దినములైనది. దేవకీదేవి యెట్టిభాగ్యవతి ! వేదత్రయి యజ్ఞవిస్తారము కావించు నర్థముల నుత్పన్నము కావించు నట్లును, అరణి అగ్ని నుత్పన్నముకావించునట్లును ముత్తెపుచిప్ప ముత్యమును, ప్రభ కాంతిని, పృథ్వి గంధమును, రసాయనము సువర్ణమును, లత సుగంధిత పుష్పమును, సింహిని ప్రాథమిక పుత్రుని నుత్పన్నము కావించి ధన్యమైనట్లు దేవకి శ్యామసుందరు దన యుదరములో ధరించి ధన్యయయ్యెను. ఆమె తన కోడండ్ర సమూహముతో సుఖపూర్వకముగ నున్నదా ?

ఉపాసన చేయువారి మనోబుద్ధి చిత్తాహంకారములను నీ యంతఃకరణ చతుష్టయమునకు అధిష్ఠాతలుగ అనిరుద్ధ, ప్రద్యుమ్న, వాసుదేవ, సంకర్షణుల నెన్నెదరు. వీరిలో మనస్సున కధిష్ఠాతృదేవుఁడును బాణాసురుని కడకుఁ జని, యాతని పుత్రి యగు ఉషను వివాహమాడినవాఁడును, తన కార్యములవలన నెల్లప్పుడు శరణాగతులను సంతుష్టిఁజెందించువాఁడునగు ననిరుద్ధుఁడు సపరివారముగఁ గుశలముగ నున్నాఁడా ?

నాకు యాదవుల పేర్లన్నియు గుర్తులేవు. ఒకటి రెండైన యుండిన గుర్తుంచుకొనెడివాఁడనే. అయిదాఱు కోట్లని విందును.

నగు నష్టమును కుశలమునుగూడ వినిపింపవలయును. మనుష్యుల సంగతి చెప్పనేల ? తన బాణవర్షముచేఁ ద్రిపురారియగు భూత నాథుని సంతృప్తి కావించినవాఁడును, రెండు చేతులతో సవ్యాప సవ్యములుగ సమానవేగముతో బాణములను సంధింపఁగలవాఁడు నగుధనంజయుఁడు తన శత్రువులను జంపి, ఆనందముగ ధర్మరాజు ననుగమించుచున్నాఁడా ?

సౌభాగ్యవశముచే సోదరులందఱకంటెఁ జిన్నవారును, అన్నలందఱతో ననుకూలముగ వర్తించువారును నగు నకుల సహ దేవుల క్షేమసమాచారమును దెల్పవలయును. వారి మీఁదఁ గుంతియు, ధర్మరాజ భీమార్జునులును దమ ప్రేమనంతను గురి యించుచుందురు అందఱు వారిని కంటికి ఱెప్పలవలె రక్షించు చుందురు. ఉద్ధవా ! పెద్దల వాత్సల్యమును బొందిన చిన్నవారే ధన్యులు. వారు పెద్దవారయ్యు సదా పిల్లలుగానే యుందురు. పెద్దల ఛత్రచ్ఛాయలలో మెలఁగుటవలన నిశ్చింతయేకదా! వారు అశ్వినీకుమారుల వీర్యమునకుఁ బుట్టిన మాద్రితనయు లైనప్పటికిని కుంతి వారిని పరాయివారిగ నెన్నఁడును జూడలేదు. ఆమె తన కడుపునఁ బుట్టిన తనయులవలెనే వారిని బెంచి పెద్దవారిని జేసెను. తనకు అయిదుగురు కొడుకులని చెప్పుకొనుచుండెడిది. నకుల సహదేవులు యుద్ధమునందును గుశలులే. రథమును జక్రములు గంతవ్యస్థానమునకెట్లు చేర్చునో అట్లే వారిద్దరు వారి సోదరులకు సహాయపడుచుందురు.

ఉద్ధవా ! పాండవమాతయగు కుంతీదేవి సమాచారమును జెప్పవలయును. విధివిధాన మెంతటి విచిత్రమైనది ! ఒంటరిగా ధనుర్ధారియై సమస్తభూమండలమును జయించిన పతి యుండగా.

జీవితములతోడనే స్వర్గమునకు వెళ్ళి తిరిగివచ్చినట్టియు, నస్త్రశస్త్రములతో సదాశివునితోగూడ సంతోషపఱచినట్టియు కొడుకులుండఁగా నామె తన బిడ్డలకొఱకు వనములందుఁ దిరిగెను. విధవయయ్యు నామె అగ్నిప్రవేశము చేయలేదు. తన బిడ్డలు పెద్దవారైన తర్వాత రాజసింహాసనమునకు అధికారులగుదురను నాశచేఁ బ్రాణములు నిలుపుకొనినది. పాప మామె జీవితమంతయు విపత్పరంపరల నెదుర్కొనవలసివచ్చెను. ఆమె శ్యామసుందరుని ఈ వరమునే అడిగెను. వాంఛాకల్పతరువగు భగవానుఁడు ఆమె మనోవాంఛను నెఱవేర్చెను. సర్వదా విపత్పరంపరామేఘము లామె శిరస్సునఁ దాండవమాడుచునే యుండెను. వారి కుశలము నేమి యడుగుదును ? ఆమె శ్రీకృష్ణకృపనే విపత్తులందును గుశలముగ భావించుచుండెను. ఆ మా వదినెగారినిగూర్చి నాకు చింతలేదు.

ఉద్ధవా ! అంధుఁడగు మా అన్న ధృతరాష్ట్రుని విషయములో నా కవశ్యము చింత కలదు. వృద్ధాప్యములో నాతని బుద్ధి భ్రష్టమైనది. మాయామోహము ఆతనిని నలిపి ముద్దచేసినది. ఆతఁ డిష్టానిష్టవిచారము కావింపలేదు. తన దుష్టపుత్రుల చేతిలో నాటబొమ్మైనాఁడు. నీవే చెప్పుము. రాజ్యమున కధికారి పాండురాజు. ఆతఁడు పరలోకగతుఁ డైనప్పుడు ఆతని రాజ్యము ఆతని కొడుకుల కీయవలసినది. ఆతఁ డట్లు చేయక అనాథబాలకులను, విధవయగు మఱదలిని గృహమునుండి వెడల నడిపెను. వా రాశ్రయహీనులై చిరకాలము వఱకు భిక్షమెత్తుకొని నిర్వహించుకొనుచు నటునిటుఁ దిరిగిరి. తన తమ్ముని పుత్రుల తోడనే యిట్టి వ్యవహారము. ఇఁక నేను నొక సోదరుఁడనే. సర్వదా ఆతని మేలే కోరుచుండెడువాఁడను. ఎల్లప్పుడు నుత్తమ

ములగు నీతులనే చెప్పెడువాఁడను. కాని, అట్టి నన్నుఁగూడ ఆతఁడు తిరస్కరించి గృహమునుండి వెడలనడిపెను. నన్నప రాధినివలె దేశమునుండి పాఱఁద్రోలినాఁడు.

ఈ యవమానముచే దుఃఖితుఁడనై నేనిట్లు అన్యథా భావించి మాటాడుచున్నా ననుకొనకుము. ఇతరులకు సుఖ దుఃఖములు కలి గింప జీవున కేమి సామర్థ్యము కలదు? ఇది యంతయు నా లీలా ధారి లీల, నటవరుని నాట్యము, అంతర్యామి యొక్క ప్రేరణ. ఎవరి కెప్పుడేమి చేయఁదలఁచి నాఁడో అప్పుడు వారికట్టి బుద్ధిని బుట్టించుచుండును. వారికట్టి విషయమునే తోఁచునట్లు చేయుచుం డును. ఆతఁ డజన్ముఁడయ్యు జన్మించినవానివలెఁ గనఁబడును. పురుషోత్తముఁడయ్యు సాధారణ మానవోచిత లీలలు చేసినట్లు కనఁ బడును. ఆతఁడు నా యందు కృపచూపెను. ఆ దుర్మార్గులు నాకు స్వాగత సత్కారాదులు చేసియుండినచో నేను జీవితకాలమంతయు వారికడ పడియుండెడువాఁడనే. వారి యన్యాయములను అనిచ్ఛా పూర్వకముగ నైన సమర్థింపవలసియుండెడిది. జగదాధారుఁడగు శ్యాము సుందరుఁడు నాపై దయచూపెను. వారికట్టిబుద్ధి కలుగున ట్లొనర్చినాఁడు ఇప్పుడు నేనీమహామహిముని అద్భుతమహిమావ లోకనము చేయుచు, నాతని కృపచే నన్యదృష్టికి దూరుఁడనై ఆనందపూర్వకముగఁ దీర్థములందుఁ దిరుగుచున్నాను. భగవద్ధా మములందు ఆనందము ననుభవించుచుఁ దిరుగుచున్నాను.

ఉద్ధవా! నిగ్రహానుగ్రహము లొనర్ప సర్వసమర్థుఁడగు ప్రభువు కౌరవుల నేల క్షమించినాఁడో? ఆతఁడు గొప్ప గొప్ప బల శాలులును, మదమత్తులు నగు మహీపతులకు మృత్యుద్వారము చూపించెను. కొందఱను స్వయముగఁ జంపెను. కొందఱ నితరు

లచే జంపించెను. తన భక్తులగు పాండవుల కిట్టి యపరాధము చేసి నప్పటికిని ఆతఁడు కౌరవులను స్వయముగఁ జంపలేదు. వారు చేయు నత్యాచారములను సహించుచుఁ జూచుచుండెను. వారి పాప ములు పండఁగానే, అన్యాయము పరాకాష్ఠకుఁ జెందఁగానే, దుష్ట త్వము హద్దుదాఁటఁగానే అందఱ నొక్కసారిగా రైతులు చైత్ర కార్తిక మాసములలోఁ బైరును గోయించునట్లు కోయించెను.

భగవానుఁడు జన్మింపవలసిన అవసర మేమున్నది? ఆతఁ డజన్ముఁడు. కర్మల కతీతుఁడు. ఆతఁడు తన యిచ్ఛాను సార ముగ సాధువులను రక్షించుటకును, దుష్టులను శిక్షించుటకును, ధర్మసంస్థాపనము చేయుటకును యుగయుగములం దవతారములను ధరించి, ఆయాస్థితుల ననుసరించి వర్తించు చుండును. ఒక్కొక్క ప్పుడు ఆతని విలక్షణ లోకోత్తర ప్రభావమునుగూడ జూపించు చుండును. ఆతని అవతారకాలమున ధర్మరక్షణము, అధర్ముల శిక్షణము గౌణకార్యములు. వాస్తవముగ నాతఁడు భక్తులను సుఖ పెట్టుటకే భూమిమీఁద నవతరించుచుండును. కర్మబంధనాధీనులై భక్తులే జన్మింపరు. అట్టియెడ భగవంతుని విషయము చెప్పనేల? భగవానుఁడు మానవరూపమును ధరించి కర్ణములకు సుఖమును బ్రసాదించునట్టియు, హృదయమందు అమృతరస సంచారము కావించునట్టియు సుఖలీలల నొనర్చును. కావున ఉద్ధవా! అయితే యీ విషయము లన్నియు నేను శిష్టాచారమునకు వశీభూతుఁడనై అడుగుచున్నాను. అసలు యథార్థముగ నేనడుగు ముఖ్యహేతు వేమియనఁగాఁ దన శరణుచొచ్చిన భక్తులకును, సమస్త లోకపాలకులకును, తన సేవకులకును బ్రియమొనర్చుటకు యదు

కులమున నవతరించిన పరమకీర్తిశాలియు, నజన్ముఁడు నగు వాసుదేవభగవానుని విషయములను వినిపించుము."

సూతుఁడు శౌనకాది మహామునుల కిట్లుచెప్పెను :—
"మునులారా ! ఇట్లుపలికి పిదుర(?)ఁ మారకుండి తదేకదృష్టితో నుద్ధవుని శ్రీముఖమును జూచుచుండెను."



# విదురప్రశ్నచే ఉద్ధవునకు భావసమాధి

శ్లో॥ పులకోద్భిన్న సర్వాంగో ముంచన్మీల ద్దృశా శుచః
పూర్ణార్థో లక్షితస్తేన స్నేహప్రసర సంప్లుతః॥
శనకైర్భగవల్లోకా న్నృలోకం పునరాగతః
విమృజ్య నేత్రే విదురం ప్రత్యాహోద్ధవ ఉత్స్మయన్॥

— శ్రీభాగ. ౩ స్కం. ౨ అ. ౫, ౬ శ్లో.

"......ఉద్ధవుండు సరోజాక్ష పాదారవింద మకరంద సుధాజలనిధి నిమగ్నమానసుండై సముత్కంఠం జింతించి యొక్క ముహూర్తమాత్రంబునకు బాష్పజలపూరిత లోచనుండై గద్గదకంఠుం డగుచు."

క॥ ఘనముగ నెమ్మనమున నిం
చిన కృష్ణవియోగ జనిత శిఖి దరికొనఁగాఁ
గనుఁగవఁ బెడచే నొత్తుచుఁ
జెను పొందిన చరిత శిఖర భిదురుఁడు విదురున్.

వ. కనుంగొని యిట్లనియె.

— శ్రీమదాంధ్రభాగవతము.

—•*•—

ప్రతివానికిని గొన్ని శంకలు కలుగుచుండును. సాధారణ ముగ ముముక్షువులు గురుజనసమ్ముఖమున భక్తిశ్రద్ధలతో వానిని నివేదింప, గురుజనము వానికి యథోచితముగఁ బ్రత్యుత్తరములొసంగి శాస్త్రీయపద్ధతిని సమాధాన పఱచుచుందురు. కొన్ని ప్రశ్నలకు పంచాయితీ జరుగవలసి యుండును. పృచ్ఛకు

నకు వాస్తవముగ నాశంక కలుగనే కలుగదు; కాని సర్వసాధార ణునకు ఆశంక కలుగుచుండును. కాని యందఱును దమ శంకను వ్యక్త పఱుపలేరు. హృద్గత భావముల నున్నదున్నట్లుగఁ బ్రక టింపఁగలుగుటయును నొక్క కళయే. అట్టిది యే భాగ్యశాలికోగాని కలుగదు. కొందఱు మన మనోగతభావములను గ్రహించి వ్యక్తము చేయఁగలరు. అది గోపనీయభావము కానియెడల మనము చాల సంతోషపడి "అయ్యా! నా మనస్సులోని భావ మిదియే. మీరిది గ్రహించితిరి" అందుము. శౌనకమహామునియుఁ, బరీక్షిన్మహా రాజును ఇద్దరు సిద్ధపురుషులే. ఇద్దరును బాల్యమునుండియు - అనేకజన్మలనుండియు భగవద్భక్తుని గావించి కావించి యీ స్థితిని బొందిరి. వా రేది ప్రశ్నించినను వారికొఱకు గాదు; సమస్తలోకము కొఱకు. తమ యుపకారముకొఱకు గాదు; లోకోపకారదృష్టితో నడుగుచుందురు. వారి కేశంకయును లేదు: కాని వారు సాంసారి కులకుఁ బ్రతినిధిత్వమును వహించి యడుగుచుందురు. వారు లోకములోని మన యందఱ భావములను వ్యక్తపఱచుచుందురు ఇట్టి శంకలు వారి కిదివఱకు కలిగియుండవచ్చును. ఏ ప్రశ్న యెచ్చట చేయవలసినదియు వారికి బాగుగా నందువలననే తెలి యును.

అనేక జన్మములు భక్తిసాధన చేయఁగాఁ జేయఁగా నా మాటలు ఈ మాటలు ప్రియములుగ నుండక కేవలము శ్రీకృష్ణ కథా వ్యసనమే ప్రియములుగ నుండి స్థితి యేర్పడును. కామాస క్తునకుఁ గామినీకథా ప్రసంగముతప్ప వేఱొకటి కమనీయముగ నుండనట్లు, వాని రోమరోమమున భగవచ్ఛర్చాదులను విను రోగ ముత్పన్నమగును. లోభికి ధనము తప్ప మఱి యే పదార్థమును

ప్రియము కానట్లును, వ్యసనికి తన వ్యసనముతప్ప అన్యవార్తలు రుచింపనట్లును, భగవద్భక్తునకు భగవత్కథలును, భాగవతుల కథలును ప్రియములగు చుండును. విదురుఁడు ఉద్ధవుని యదువంశములోని చిన్న పెద్దల యొక్కయు, అత్తకోడండ్ర యొక్కయు, ఆబాలగోపాలము యొక్కయు కుశలము నడుగఁగాఁ బరీక్షిత్తునకు సందేహము కలిగి యిట్లనెను :– "ప్రభూ! మహాభాగవతుఁడగు విదురుఁడు 'వాని కుశలమును జెప్పుము, వీని సమాచారమును జెప్పుము. వాని స్థితినిగూర్చి చెప్పు'మని ప్రశ్నించినాఁడేల? ఒక్క భగవంతునిగూర్చి అడిగియుండిన నన్నిపాదములు నేనుఁగు పాదములో నిమిడినట్లు అందఱ కుశలము నడిగినట్లే. ఆతఁ డట్లడుగ లేదు. పేరు పేరు వరుసల నడిగినాఁడేల? చెప్పుఁడు."

ఇది విని శ్రీ శుకుఁడు నవ్వుచు నిట్లనెను :– "రాజా! ఈప్రశ్న నీకనురూపముగనే యున్నది. విదురుఁ డిట్లు ప్రశ్నించుట కనేక కారణములు కలవు. భాగవతులు భగవంతునికంటె భక్తుల నాదరింతురు. భక్తులద్వారమునే భగవంతుఁడు లభించును. ఆతని యనుచరులను బూజింపనిది ప్రభువు కడకు ప్రవేశమేలేదు. కావున విదురుఁడు విస్తారముగ భగవచ్ఛరణాగతుల కుశలమును గూర్చి యడిగెను. సంభాషణ జరుగవలసిన పద్ధతియు నిదియే. ఆతఁడు మునుముందుగా భగవానుని యొక్కయు, బలరాముని యొక్కయు కుశలము నడిగెను. ఆలోచింపకయే ఆతని నోటి నుండి యీవిషయము స్వభావానుసారముగ వెలువడెను. ఏల యనఁగా నాతని యిష్టదైవము వాసుదేవ భగవానుఁడే. అంత నాతనికి శిష్టాచారము నుల్లంఘించితినను స్మృతికలిగి, ముందు తండ్రి క్షేమమడిగి తర్వాతఁ బిల్లవాని క్షేమ మడుగవలసి యుండునని

గ్రహించి, ఆప్రశ్ననట్లే సగములోనే దాఁటవేసి, వెంటనే "వాసుదేవుఁడు బాగున్నాఁడా?" యని యడిగెను. అంత నాప్రసంగములో నెవరెవరు జ్ఞాపకమునకు వచ్చిరో వారి సందఱ నడిగెను. అంతఁ బాండవులను గూర్చియు నడుగఁగానే వెనుకటి విషయము లన్నియు స్మృతికి వచ్చెను. అంత నాతఁడు సంబాళించుకొని యిట్లనుకొనెను :— "అయ్యో ! నేనీ చిక్కువిషయముల నడుగుచుంటినేల ? ఈ కౌరవులతోడను, ధృతరాష్ట్రునితోడను నేమి ప్రయోజనము ?" అందువలన నాతఁడు చివరి కిట్లులనెను :— "ఉద్ధవా ! ఇఁక సందఱ విషయములను వదలిపెట్టుము. నీవు తీర్థకీర్తియగు శ్యామసుందరుని విషయములను వినిపింపుము."

ఒక్క విషయము కలదు. రసవృద్ధి కొఱకు మొట్టమొదట నా యీ విషయములు పలికినమీఁదట ముఖ్యవిషయమును బ్రసంగించుటచే నా రస మభివృద్ధి కాఁగలదు. శ్రోతకును వక్తకు నుత్కంఠ కలుగును. ఉద్ధవుఁడు విదురునకు బాలసఖుఁడు. అకస్మాత్తుగఁ దాను భగద్విషయక మగు ప్రశ్న వేసినచో నుద్ధవునకు భావసమాధి రాఁగలదని ఆతని స్వభావ మెఱిఁగినవాఁడు కావున విదురునకుఁ దెలియును. అందువలన మొదట నా యీ విషయములను బలికి, ఆతనికి కృష్ణునిమీఁదఁగల సమాహిత చిత్తమును జిందర వందర చేసిన మీఁద భగవంతుని గూర్చిన ప్రశ్న నడిగిన భావసాగరములో నిమగ్నుఁడు కాఁడుకదా యనుకొనెను; కాని యుద్ధవుఁ డా నామములను విననేలేదు. ఆతఁడు చివర శబ్దము "సఖా ! తీర్థకీర్తియగు శ్యామసుందరుని విషయములను వినిపింపుము" అనుదానినే వినెను. విదురున కే భయము కలిగెనో అదియే జరిగెను. భగవన్నామమును వినఁగానే, ఆతని ధామ,

చూప, లీలాదు లొక్కసారిగా స్మరణకు వచ్చెను. ఉత్కంఠా వశమున నాతనికి "స్వధామ గమన" మను నంతిమలీల స్మరణకు వచ్చెను. ఆ స్మరణముచేతనే ఆతఁడు విహ్వలుఁడై గద్గదికుఁ డయ్యెను. ఎంత ప్రయత్నించినను మాటలాడఁజాలక పోయెను. విదురుఁడు వేసిన యిన్ని ప్రశ్నలలో నొక్కప్రశ్నకైన జవా బీయఁజాలక పోయెను.

అంతఁ బరీక్షిన్మహారాజు శుకముని నిట్లడిగెను :— "ప్రభూ! ఇచ్చట ప్రేమ పరాకాష్ఠను జెందినది. ఉద్ధవుని ప్రేమ అద్భుత ముగ నుండెను. నామశ్రవణముచేతనే సమాధి వచ్చునంతటి విలక్షణప్రేమయా ? ప్రశ్న నడుగఁగానే యేదో ఒకటి రెండు లీలలను వర్ణించుటయును, సందర్భ కుశలమును జెప్పుటయును, దర్వాతఁ గథాప్రసంగమందు ప్రేమవశమున మూర్ఛాదులు సాధా రణముగా నుత్తమభక్తులకుఁ గలుగుటయును గాంచుచున్నాము కాని కేవలము నామస్మరణము చేతనే యిట్టి దశ వచ్చినట్లు మీరు ఉద్ధ వుని విషయములోఁ జెప్పుచున్నారు. ఇట్టిస్థితి ఆతని కే సాధ నముద్వారా ప్రాప్తించినది ?"

ఇది విని శ్రీ శుకుఁడు చిఱునవ్వు నవ్వుచు నిట్లనెను :— "రాజా ! పైసా పాఱవైచి కొనుటకు ప్రేమ బజారువస్తు వేదియును గాదు. అట్టి ప్రేమ భగవత్కృపచే ననేక యోనులందు భ్రమిం చుచు, సంయోగవశమున జీవుఁడు భగవత్ప్రేరణచే నాతనియందు రక్తికలిగి, మనస్సాతనియందే లగ్నము కావించి, ఆతని పరిచర్య యందే ఆతని కాలమును గడుపుచుండినచో వాని కిట్టి యుత్కట ప్రేమ ప్రాప్తించు చుండును. భగవజ్జనులును భగవంతుఁ డెవ రిని తనవారిగాఁ జూచుకొని వరించెనో వారును బుట్టఁగానే పూర్వ

జన్మ సంస్కారనుసారముగ భగవత్పూజనమందు లగ్నమగుదురు. అప్పుడూడ పుట్టఁగానే తల్లితోక నేల త్రాగదు ? దగ్గఱనున్న వస్తువుల నేల తినదు. స్తనములవైపున కేల పోవలయును ? ఆ స్తనములలోఁ బాలున్నవనియు, మూఁతితో గ్రుద్ది వానిని ద్రాగవలయునని యుదాని కే మహావిద్యాలయములో నే యుపాధ్యాయుఁడు నేర్పినాఁడు ? ఎవరును నేర్పకయే, అది పూర్వజన్మ సంస్కారముచేఁ జన్నుల పాలు త్రాగఁబూనునో, అట్లే అనేక జన్మములందు భక్తి చేయు భాగవతుఁడు బాల్యకాలము నుండియు నదే యాటలాడుచుండును. భగవానుని సుమధుర నామములను గమ్మగ నుచ్చైస్స్వరమునఁ బలుకఁ బ్రారంభించును. బాలురతో నా గోపాలలీలలనే ఆడుచుండును. ఇటుకలు, రాళ్లుదొరకెనా వానిని గోపాలునిగా భావించి పూజింపఁ బ్రారంభించును. తల్లి పాలు పిదుకఁబోయిన నామె వెంట నొకబుడ్డి పట్టుకొనిపోయి తన గోపాలునికి పాలు పిదుకుమనును. పిల్లవాని వినోదమును గాంచి తల్లి పాలుపిదికి యిచ్చును. భక్తబాలకుఁడు దానినిఁ గొనిపోవును. ఎక్కడనో పూలను గోసికొని వచ్చును. ఆటవిక ఫలములు లభించెనా, చెట్లనెక్కికొనితెచ్చును. పచ్చని వెడల్పగు నాకులను బాలుర సహాయమునఁ గొనివచ్చును. ఆకులను బఱచి వానిమీఁద దన గోపాలుని వేంచేపు చేయును. తల్లి యిత్తడి పాత్రలను జిన్నవానిని గొనిపెట్టిన వానితోడను లేకున్న మట్టిపూజా పాత్రల నేర్పఱచుకొనును. గోపాలునకు నైవేద్యమిడుటయు, నాతనితో నాడుటయును, వానితో ముద్దు మురిపెములు చేయుటయు మొదలగు కార్యములన్నియు నాతనికి దైనందిన వ్యాపారము లగుచుండును. రాజా ! నీకు నన్నియును దెలియును. నీవును జిన్నతనములో నిట్టియాటలే యాడుచుండెడువాఁడవు. ఈ భగత్పూజా సాధన

చూపమగు ఫలనమే నేఁడు నీ విషయములో సత్యమైనది. ఈ సాధనమునే బాల్యకాలమునుండి ఉద్ధవుఁడు చేసినాఁడు.

మహారాజా! ఉద్ధవుని విషయము నేను నాతండ్రివలన వినియుంటిని. ఆతఁడై దేండ్లవాఁడై యుండఁగా బాలురతో సుమధుర భగవల్లీలల ననుకరించెడివాఁడు, భగవద్గానమునే చేసెడివాడు. ఆతని నామసంకీర్తనమునే చేసెడువాఁడు. ఆతనికి బూజగావించి, ధూప దీప నైవేద్యాదులచే నాతని నారాధించెవాఁడు. ఆటలలో మట్టితో మందిరములను నిర్మించి, మన మోహనుని మధురమూర్తిని స్థాపించెడివాఁడు. ప్రాతఃకాలమునఁ బెందలకడ లేచి యమునా పులినమునకుఁ బోయెడువాఁడు. ఇంతలోఁ బ్రొద్దెక్కెడిది. అంత తల్లి దుఃఖతయై, ఇంకను బిడ్డ చల్దియైనను భుజింపలేదని వెదకుచుఁబోయి, ప్రేమకోపమున నిట్లనును :— "ఓరీ! ఉద్ధవా! అన్నము నీళ్ళను మఱచి నీ విట్లాటలలో నిమగ్నుఁడవైనావేమి? చూడుము. ఎంత ప్రొద్దెక్కినదో! పిల్లలందఱు ఒకటి రెండుసారులు తినిరి. నీ వింతవఱకు చల్దిఅన్నమైన దినలేదు. పద! కొంచెము తినివచ్చి ఆడుకొనవచ్చును. ప్రొద్దెక్కినది."

తల్లి పలికెడి యీ ప్రేమభరిత వచనములను వినియు నుద్ధవుఁడు తన పూజను వీడి వదలివచ్చెడువాఁడు కాఁడు. ఆతఁడు తల్లితో నిట్లనును :— "అమ్మా! నీవు వెళ్లుము. నే నిప్పుడే వచ్చుచున్నాను. చూడుము, నీ కంటె ముందే నే నింటికి చేరుదును."

తల్లి గద్దించి యిట్లనును :— "నీ విక్కడనేమి అమలు చేయుచున్నావు? నాకంటె ముందు చేరుటకు నీయొద్ద నేమి విమానము కలదు?"

మంచుకరిగి పాఱినట్లు ఆతని కన్నీటిబిందువులు రాలుచుండెను. ఆతఁడు పాషాణప్రతిమవలె నిశ్చేష్టుఁడై, భగవద్ధ్యానమందు నిమగ్నుఁడై యీ లోకమును మఱచెను. ఆతని మనస్సు భగవల్లోకములో భగవత్సాక్షాత్కారము కావించుచుండెను.

ఆతని యీ ప్రేమదశను జూచునప్పటికి విదురుని హర్షమునకు మేరలేకుండెను. ఆతఁడిట్లనుకొనుచుండెను:— "ఆహా! ఉద్ధవుఁడు ధన్యుఁడు. ఈతని సేవ సఫలమైనది. ఈతని సాధన సాధ్యముతోఁ గలిసెను. ఈతఁడు తాను జేసిన కర్మల ఫలమును బొందెను. ఈతఁడు కృతకృత్యుఁడైనాఁడు. ఈతఁడు మానవశరీరమును ధరించినందులకు సార్థక్యమును బొందినాఁడు."

ఇప్పుడేమి చేయవలయును? విదురునకు మనస్సంతయు శ్రీకృష్ణకథమీఁద నుండెను. ఆతఁడు సమాధికంటె శ్రీకృష్ణకథయే శ్రేష్ఠమనుకొనుచుండెను. రసలంపటుఁడగు విదురుఁడు ఉద్ధవముఖకమల నిస్సృత శ్రీకృష్ణకథా మధువును ద్రావి మత్తుఁడు కాఁగోరుచుండెను. అందువలన నీతఁడాతని కర్ణములలో శ్రీకృష్ణనామోచ్చారణము కావించెను. ఆతఁడు పెక్కుసారులు "శ్రీకృష్ణ గోవింద హరే మురారే, హేనాథ నారాయణ వాసుదేవ" అను నీ మధుర నామమును ఆతని శ్రోత్రములందు కీర్తనచేయ మొదలిడెను. దీనివలన నాతఁడు నెమ్మది నెమ్మదిగా భగవల్లోకమునుండి మర్త్యలోకమునకు వచ్చెను. ఆతని చిత్తవృత్తి మానవలోకము వైపునకుఁ దిరిగెను. ఆతనికి కొంచెముగ దేహస్మృతి కలిగెను. ఎదుట కలకలమను శబ్దము చేయుచు కాళిందీపులినము కనఁబడెను. ప్రవాహములో నూగుచు వంగిన లతలు ఆతనికి దృష్టిగోచరములయ్యెను. ఎదుట కూర్చుండిన విదురుఁడుకూడ కనఁబడెను. ఈ విధముగ

# శ్రీ కృష్ణకథా ప్రారంభము

శ్లో॥ కృష్ణద్యుమణి నిమ్లోచే గీర్ణేష్వజగరేణ హ,
కిం ను నః కుశలం బ్రూయాం గత శ్రీషు గృహేష్వహమ్॥
దుర్భగో బత లోకో౽యం యదవో నితరామపి,
యే సంవసంతో న విదుర్హరిం మీనా ఇవోడుపమ్॥

— శ్రీభాగ. ౩స్కం. ౨అ.౭, ౮శ్లో.

క. “యమునం దను ఘనకాల భుజం
గము పుంగవుఁ డెగచి పట్టఁగా యదువంశో
త్తముల చరిత్రము దత్కుశ
లము లేమని చెప్పుదుం గలంగెడి మనముక్.

సీ. మునిజన ముఖపద్మములు ముకుళింపంగ
ఖంజనలోచనోత్పలము లలర
జార చోరుల కోర్కె సఫలత నొందంగ
దానవ దర్పాంధ తమస మడర
వరయోగిజన చక్రవాకంబు లడలంగఁ
గలుషజనానురాగంబు పర్వ
భూరిదోషాగమస్ఫూర్తి వాటిల్లంగ
నుదిత ధర్మక్రియ లుడిగి మడఁగ

తే. మానుషాకార రుచికోటి మందపఱిచి
యనఘు యేమన నేర్తుఁ గృష్ణాభిధాన
లోకబాంధవుఁ డుత్తమశ్లోకమూర్తి
మించు తేజంబుతో నస్తమించెనయ్య.

వ. మఱియు లలిత నికషణ విరాజమాన మణిగణ కిరణ సుషమా విశేష విడంబిత విమల సలిలంబులందుఁ బ్రతిఫలిత సంపూర్ణ చంద్రమండలరుచి నిరీక్షించి జలచరబుద్ధిం జేసి తజ్జల విలోల మీనంబు లనూన స్నేహంబునం దలంచు చందంబునఁ గృష్ణాను చరులైన యదువృష్ణికుమారు లమ్మహనీయమూర్తిం దమకు నగ్రేసరుండని తాని లీలామానుష విగ్రహుండైన పరమాత్ముండని యెఱుంగరు."

— శ్రీమదాంధ్రభాగవతము.

సర్వదా సలిలములందు మునిగియున్నవాఁడు రెండవవానికి జలక్రీడాసుఖము ననుభవింపఁజేయఁజాలఁడు. అట్లే అసలు నీటినే తాఁకనివాఁడు కేవలము వాక్కుతో నచ్చటి సుఖము నితరులకుఁ జవిచూపఁజాలఁడు. మునుఁగుట నెఱిఁగినవాఁడును, మునిఁగి పైకి తేలఁగలవాఁడును, సడుమువఱకు నీటిలోనుండి అర్ధశరీరమును బయటనుంచుకొనఁగలవాఁడును, తన్నుఁదాను రక్షించుకొనుట యందు సమర్థుఁడును, ఇతరులనుగూడ సంరక్షింపఁగలవాడే ఆ దివ్య శీతలసుఖమును జవి చూఁపగలఁడు. మునుగుటయే యెఱుఁగక నీటియొడ్డున నిలుచుండి యూహచే యుక్తులు చెప్పువాఁడు వావదూకుఁ డనఁబడును! వాని జ్ఞానము అనుభవశూన్యమైన శాబ్దిక జ్ఞానము. తాను రుచిచూడని సుఖము నితరుల కెట్లు చవిచూపఁ గలుగును ?

ప్రేమవిహ్వలులైరె తమ శరీరమును మఱచినవారు తమ భావములద్వారా ప్రజలను బ్రభావాన్వితుల నొనర్చిన నొనర్చుదురుగాక; కాని వారిపాలన శారీరకముగాఁ నుపకారమును, బాహ్యసాధనమును గాఁజాలదు. ప్రేమమార్గము నెఱుంగక, కేవ

లము ఆ పుస్తకములోనివి యీ పుస్తకములోనివి యేకరువు పెట్టి, వ్యర్థ బకవాదమును జేయువాఁడు ఆర్థికలాభమేమైనఁ బొందినఁ బొందవచ్చునుగాని, పారమార్థిక ప్రయోజనమేమియు నుండఁజా లదు. ప్రేమ ప్రపంచములోనికి వెళ్ళి, సగములోనే తిరిగివచ్చు మాధ్యమికుల వలననే లోకమున కుపకారము కలదు. వారు దివ్య లోక లీలలను గాంచి, యా వర్ణనమును లౌకికభాషలోఁ జేయుచుం దురు. ఆతని మనస్సు లగ్నమైనది ఆ శోభలో; కాని వ్రాయుట ప్రాకృతసాధనములతో. ఇట్లాతని వృత్తి యూర్ధ్వముఖముగ నుం డును; కాని దానిని సాంసారిక వ్యవహారములతో జోడించు చుండును. ఈ విధముగ నాతఁడు ప్రాకృతికమునకును, అప్రా కృతికమునకును మధ్యస్థుఁడై, యచ్చటనుండి దివ్యముఖమును ఈ జనన మరణ రూపమగు ప్రపంచమందు - ఈ యర్థలౌకికభాషలో స్థాపించును. దానిని సమాధిభాష యందురు. శ్రీమద్భాగవతము సమాధిభాషలోనే వ్రాయఁబడినది.

శ్రీకృష్ణస్మృతి కలుగఁగానే ఉద్ధవుఁడు దివ్యలోకమునకు, బోయెను. ఆనందరస సింధువులో మునిఁగిపోయినాఁడు. శ్రీకృష్ణ చరణారవింద మకరంద మాదక మధువును ద్రావి మదమత్తుఁ డయ్యెను. ఆతనికి బాహ్యప్రపంచ జ్ఞానములేదు. కాని నిరంతర నామసంకీర్తన శ్రవణముచే నాతని వృత్తి కొంచెము క్రిందికి దిగెను. ప్రేమోన్మత్తత కొంచెము తగ్గెను. పూర్తిగా తగ్గలేదు; అయ్యు నేమియు మాటలాడఁజాలనంతగఁ లేదు. మధ్యావస్థకు వచ్చెను. విదురుఁ డేయే నామములతోఁ గుశలప్రశ్న మొనరించెనో వారి నామములం దాతనికి దృష్టియేలేదు. విదురుఁడును శిష్టాచారముగానే యడిగియుండెను; ఈతఁడు నట్లే వినియు వినకయే యుండెను.

ఆతని చెవులలో నా వివరశబ్దము 'వార్తాం సఖే కీర్తయ తీర్థకీర్తేః' "మిత్రమా! ఆ తీర్థకీర్తియగు వాసుదేవుని విషయములను జెప్పుము" అనునదే గింగురుమని ప్రతిధ్వనించుచుండెను. ఆతఁడా విషయమును జెప్పుట కుపక్రమించుచుండెను. చంద్రునిగాంచి చంద్రకాంతమణి కరుగునట్లును, రాకాసుధాకరుని గాంచి రత్నాకర ముప్పొంగి తరంగములతో నూగునట్లును, అత్యంత రూపసంపన్నుఁడగు పురుషుని గాంచి యసతియగు సతివచిత్తము ద్రవించినట్లును, మనోనుకూల సుగంధిత మధురపదార్థములను గాంచిన జిహ్వాలోలుపుని నోట నీరూరినట్లును, కమనీయ కామినీకటాక్ష వీక్షణములచేఁ గాముకుని చిత్త మస్థిరమైనట్లును, అత్యంత ప్రియశిశువును గాంచఁగానే మాతృస్తనములనుండి పాలుకారునట్లు అధికారి యగు శ్రోతను జూడఁగానే శ్రీకృష్ణకథారసికుఁడగు భావుకవక్తయొక్క వాగ్ధార తనకుఁదానే ప్రవహించును. కావుననే శ్రీకృష్ణకథా ప్రశ్న చేయఁగానే ఉద్ధవుఁడు చెప్పఁ బ్రారంభించెను. కథకు రెండుభాగములుండును. ఒకటి కథాభాగము, రెండవది పూర్వరంగము లేక ఉపక్రమము. కథ చెప్పుటకు ముఖబంధమువంటిది ఉపక్రమము లేక ప్రస్తావన. అందుకనియే విదురుఁడు కూడ తన ప్రశ్న ప్రస్తావన కుశలపూర్వకముగఁ బ్రశ్నించెను. భగవద్విషయమును వినిపింపుమనియే యాతని ముఖ్యప్రశ్న. దీని భూమిక కొఱకే-విషయము నడుచుటకై, ఆతఁ డిందఱ కుశలప్రశ్నమును గావించిన మీఁదట తనయొక్క అసలు అభిప్రాయము బయటపెట్టెను. ఉద్ధవుఁడు పరమభాగవతుఁడు. విదురుని యభిప్రాయము శ్రీకృష్ణకథయే యనియుఁ, గుశలప్రశ్న మొక ప్రాసంగిక శిష్టాచారమనియు నాతఁడు గ్రహించెను, ఇట్లు గ్రహించియే ఉద్ధవుఁడు శ్రీకృష్ణకథ నుపక్రమింపఁ బూనుకొనెను.

అత్యంత నిరాశా స్వరమున నుద్ధవుఁ డిట్లనెను:– "విదురా! నీవు కుశల మడుగుచున్నావా? ఎవని కుశలమడుగు చున్నావు? యాదవుల కుశలమా? లేక లోకకుశలమా? కుశల మెప్పుడు ప్రకాశమున నుండును. అంధకారమందు నల్దిశలను భయమే. సూర్యాస్తమయమైన తర్వాత తమసావృత్తమైన భయంకర నిశారాత్రి బయలుదేరును. అంధకారమునఁ గుశలమెచ్చట? భువనభాస్కర సమానుఁడగు భగవంతుని ప్రస్తానానంతర మింకఁ గుశల మెక్కడిది? ఇప్పుడు సర్వత్ర అకుశలమే అకుశలము. స్వర్గాదులను గూడ తిరస్కరించు పుణ్యవతియగు ద్వారకాపురి నేఁడు తన స్వామి యగు ద్వారకాదీశుఁడు లేక శ్రీహీనమై విధవయైనది. ఆమె నుదుట సింధూర తిలకము చెఱగిపోయినది. అతుల వైభవము నశించినది. ఆమె యలినీలాలకములు ఛేదింపఁబడినవి. చూడామణిని గోల్పోయి శోభాశృంగార రహితమై యప్రియదర్శనయైనది.

నీవు సమస్తలోక కుశల మడుగుచున్నావు. అయితే యీ లోక మభాగ్యమైనది. యథార్థముగ నిది దుఃఖశోకాలయము. ఇది వఱ కెట్లున్నదో అట్లే యైనది. స్వభావము నెవరు మార్పఁగలుగుదురు? కుక్కతోఁకను దమ ప్రభావముచే వంకర లేకుండఁ జేయఁగలిగినచో, నా ప్రభావము తొలఁగగానే వంకర వంకరగానే నిలిచియుండును. దుఃఖ, శోకములు, ఆపద్విపత్తులు, చింతా గ్లాని భయములు, ఆధి వ్యాధులు మొదలగువానిచే నిండియుండిన యీ ప్రపంచమున శాంతి యెక్కడిది? సుఖ మెక్కడిది? మేదముచే నిర్మింపఁబడిన అశుద్ధమగు మేదినికి పవిత్రత యెక్కడిది? దీని యుత్పత్తియే అశుద్ధమగు మేదినిచే నైనది. ఆ మేదమైనను మంచి వానిది కాదు. క్రూరకర్ములగు మధు కైటభ రాక్షసుల క్రొవ్వుచే

నిది యేర్పడినది. దీనికి పావనత యెక్కడనుండి రాఁగలదు? దీని మీఁద పరమపావనుఁడగు భగవానుని పునీత పాదపద్మములు పడుటచే నిది పవిత్రాతి పవిత్రమైనది. జగద్వంద్య చరణకమల ప్రక్షాళిత జలమగు గంగ ప్రవహించిన యీ స్థానము సర్వులకును పవిత్రమొనర్చు తీర్థమైనది. ఈ శోకపూర్ణమగు ప్రపంచమును ప్రభువు తన పదరజముచేఁ ప్రపూతమొనర్చెను. ఆతఁ డొంటరిగ నెన్నఁడును రాఁడు. తన పరికర, పరివార, ధామ, ఆయుధాదులతోఁగూడ నవతరించును, దీనిమీఁద ప్రాకృత గుణరహితమగు బృందావన ధామమున్నది. కాఁబట్టియే యీ పృథ్వి యదృష్టవంతురాలైనది. భగవంతుఁడు తన ప్రకటలీలకు వచ్చునప్పుడు పృథివి శ్రీసంపన్న యగును. ఆమె పరమభాగ్యశాలి యగును. ఆతఁడు తన లీలాసంవరణ మెప్పుడు కావించునో అప్పు డీ ప్రపంచమంతయు నప్రియదర్శన యగును. భగవంతుని కృపాదృష్టి జీవుని పైఁబడినను, లేక జీవియే ప్రేమదృష్టులతో భగవంతుని జూచినను నాతఁడు కృతార్థుఁడు కాఁగలడు. విదురా! ఇతరుల విషయమును వదలిపెట్టుము. దేవకీనందనుఁ డే యదు వంశములో నవతరించెనో, ఆ యదువంశజు లెల్లప్పుడు వెంటనున్నప్పటికి నాతనిని గుర్తింపలేకపోయిరి. సమీపమున నుండియు స్వరూపవంచితులైన నీ యాదవు లెంతటి యభాగ్యులు! ఎంతటి మందబుద్ధులు!"

అంత విదురుఁ డిట్లడిగెను:— "ఉద్ధవా! ఇట్లనుచుంటివేల! భగవంతు నెఱుఁగకున్న పోనిమ్ము. కాని, ఆతఁడు భూభారమును దీసివేయుటకు స్వయముగ సాక్షాత్తుగ సగుణరూపమున నవతరింపఁగా నప్పుడాతని ప్రభావమును గాంచి యాతఁ డిట్టివాఁడని

గ్రహించియే యుండును కదా! ఆతని లోకోత్తర కార్యములవలన నాతని భగవత్సత్తా ప్రకటమై యుండును గదా !"

ఇది విని ఉద్ధవుఁ డిట్లనెను :– "విదురా ! ఇదంతయు భగవంతుని మాయ, ఇంతటి ప్రభావమును ఇంతటి యైశ్వర్యమును ఆతఁడు ప్రకటపఱచినను వారాతనిని దమవలె యదు వంశీయుఁడే యనుకొనిరి. ఒక్కొకడు పునఁ బుట్టినను ఎవరి భాగ్యము వారిదే. ఒకఁడు ప్రభావశాలి యగును. వేఱొకఁడు ప్రభావహీనుఁడగును. ఒకఁడు శక్తిశాలి యగును. వేఱొకఁడు నిర్బలుఁడగును ఒకఁడు ప్రకాశవంతుఁడగును. వేఱొకఁడు ప్రకాశ హీనుఁడగును. ఇదియే భేదము. హిమాలయమునఁ బుట్టిన లతలు పార్వతిని దమవలెఁ బుట్టినది కావునఁ దమ సోదరి యను కొనునట్లును, భూమినుండి పుట్టిన సీతను దుబ్బులు తమ సహచరి యనుకొనునట్లును, దేహమునఁ బుట్టిన పేలుగణపతినిగూడ తమ వలె నొక పెద్ద పేను అని తలఁచినట్లును, అరణ్యములలోని కమలాది పుష్పములు కుమారస్వామినిగూడ తమ జాతివాఁ డనుకొను నట్లును, సముద్రములోఁ బుట్టిన చంద్రుని అమృతమయుఁడని దెలిసికొనఁజాలక జలజంతువులన్నియుఁ దమవంటి జలజంతువని తలఁచినట్లు యాదవులుకూడ కొందరాతనిని సోదరునిగను, గొందఱు తండ్రిగను, గొందఱు పితామహునిఁగను, గొందఱు పితృవ్యునిగను, గొందఱు పుత్రునిగను భావించి పిలుచుచుండురు. ఆతని యథార్థరూపము నెవరును గ్రహింపఁజాలకుండిరి."

అంతఁ విదురుఁ డిట్లడిగెను :– "ఉద్ధవా ! యాదవులు వివేకహీనులా ? వారు భావమును గ్రహింపలేనివారా ? ఇన్ని దిన

ములు సమీపమునుండియు భగవానుని యతులభావపూర్ణ పరాక్రమ మును దెలిసికొనలేకయే యుండిరా ”

దుఃఖితమనస్సుతో నుద్ధవుఁ డిట్లనెను :— “విదురా ! దీనికి నేనేమని జవాబు చెప్పగలను ? భగవానుఁడు తన యథార్థరూప మునుజూప నిష్టపడలేదని మాత్రము చెప్పి నిన్ను సంతోషపెట్ట వలయును. ఆతఁడు తన యోగమాయా జవనికను అందఱహృదయ ముల మీఁదఁ బడవైచినాఁడు. అందువలననే అందఱు నాతని నొక పరాక్రమవంతుఁడనియు, యశస్వియనియు, యాదవశ్రేష్ఠుడనియు మాత్రమే భావించిరి. ఇట్లు భావించియే వారాపనిని గౌరవించిరి. అట్లు గౌరవించి వారందఱును భగవంతుని సంకేతములను దెలిసికొను చుండెడివారు. అందఱునుబుద్ధిమంతులు. అందఱును శ్రద్ధా యుక్తులై యాతని యాజ్ఞలను బాలించుచుండెడువారు; కాని భగ వద్బుద్ధితోఁ గాదు. వారెట్లు భావించినను వారికి మేలే కలుగఁ గలదు.తెలిసి త్రాగినను, దెలియక త్రాగినను అమృతమును ద్రావిన నమరుఁడు కాఁగలఁడు. కాని, తెలియక త్రాగిన రసా స్వాదనము కలగదు. అందుకనియే భక్తుఁడు భగవంతుని గోరఁడు; ప్రేమను గోరును. అనంత పరాక్రమమును, అతులవైభవమును, మహదైశ్వర్యమును, అద్భుతలావణ్యమును, అభూతపూర్వదయా దాక్షిణ్యములను, అనుపమ సౌందర్యమును, లోకోత్తర దివ్యాతి దివ్యగుణములను అల్పజ్ఞుఁడగు నీజీవి యెట్లు తెలిసికొనఁగలఁడు ? ఆతని నీప్రాకృతిక బుద్ధిచే నెట్లు తెలిసికొనఁగలఁడు ? యథార్థ జ్ఞానములేని అల్పజ్ఞుఁడగు జీవికి భగవంతుఁడు ప్రత్యక్షమైనను, ఆ దర్శనముచే నాతనికి రసాస్వాదన మెట్లు కలుగఁగలదు ? అందులకే భక్తులాతని నిట్లు ప్రార్థింతురు :— “స్వామీ ! మాకు భక్తి నొసఁగుఁడు. నీ దివ్యాతి దివ్యరసమును మాటిమాటికి రసా

స్వాదనపూర్వకముగ నానందమనుభవింపఁజేసెడు ప్రీతి నొసంగుము." దర్శనము దైత్యదానవులకు నైనది. అట్టివారికికూడ భగవంతుఁడు ముక్తినొసంగినాఁడు. కాని వారికా రసాస్వాదనము లేదు. ధర్మరాజు రాజసూయయాగమున శిశుపాలుఁడు క్రోధోద్రేకమున భగవంతుని అనేకవిధములఁ దిట్టెను. అనేకములగు నసరాని పల్కులు పలికెను. కాని శ్యామసుందరుఁడు నవ్వుచుండెను. వానికిని సాయుజ్యముక్తి నొసంగెను; కాని వానికి రసాస్వాదనము లేదు."

విదురుఁ డిట్లనెను :— "ఉద్ధవా! నీవు రసము రసమని మాటిమాటికి పలుకుచున్నావు. రసమనఁగా నేమి? రసమనఁగా నా పరబ్రహ్మ పరమాత్మస్వరూపుఁడగు శ్యామసుందరుఁడే. ఆతఁడు ప్రాప్తించిన నిఁక రసావశ్యకతయేల? రసము లభించినది కదా! తిట్లు తిట్టిననే ముక్తిలభించిన మనకు జపమాలాదులతోఁ బనియేమి? వాటి నావలఁ బాఱవైచి ఆయనను దిట్ట మొదలు పెట్టవచ్చును. వైరభావముతోడనే ముక్తిలభించిన ప్రేమపంకమునఁ బడవలసిన యవసర మేమికలదు?"

ఇది విని ఉద్ధవుఁడు చిఱునవ్వు నవ్వుచు నిట్లనెను :—— "విదురా! నీవుకూడ నిట్లు పలుకుచున్నావా? ముక్తిలోభమున మనము అనుపమరసమును బలిత్యాగము కావింపఁగలమా? సౌందర్య మాధుర్యములు మన హృదయములలో నుండఁగా నచ్చట వైరమునకు స్థాన మీయఁగలమా? మన నయనములందు మధురమూర్తియుండఁగా భయంకరమూర్తికి స్థానమెక్కడిది? చక్రమును గాంచిన మనము దూరమునుండియే ప్రణామ మొనరింతుము. మనకు మురళితో మిత్రత్వము కదా! మన కా మురళీధరుని ప్రియ

# భగవంతుని లోకోత్తర సౌందర్యము

శ్లో॥ యద్ధర్మ సూనోర్బత రాజసూయే
నిరీక్ష్య దృక్స్వస్త్యయనం త్రిలోకః,
కార్త్స్న్యేన చాద్యేహ గతం విధాతు
రర్వాక్సృతౌ కౌశలమిత్యమన్యత॥

—శ్రీభాగ. ౩ స్కం. ౨ అ. ౧౩ శ్లో.

సీ.......................

తే. తాన తనమూర్తి నిజశక్తిఁ దగ ధరించి
యమ తనూభవు రాజసూయాధ్వరంబు
నందు నెవ్వని శుభమూర్తి నర్థితోడ
నింతు వేడుకఁ జూచి వర్ణించుచుందు.

క. ప్రకటముగఁ గమలభవ సృ
ష్టికిఁ గారణ మిమ్మహాత్ముఁడే యనుచును ను
త్సుకులై తన్మూర్తిని ద
ప్పక చూచిరి గాదె తత్సభాజనులెల్లన్.

—శ్రీమదాంధ్రమహాభాగవతము.

—(•*•)—

భక్తులు రెండు విధములుగ నుందురు. ఒకరు జ్ఞాన ప్రధానులు. రెండవవారు భావుకులు - హృదయప్రధానులు. వీరి లోను మరల నధికారభేదముచేతను, సాధనభేదముచేతను నసంఖ్యా కములగు భేదములు కలవు. జ్ఞానప్రధానులగు భక్తులు లోక రహస్యమును దెలిసికొని యనన్యభావముచే నుపాసింతురు. కాని

భావుకభక్తుల కీలోకముతోడను, తత్త్వములతోడను నే ప్రయోజన మును లేదు. వారి దృష్టిలో నున్నది ఒక్కటే తత్త్వము. వారి దృష్టి - నల్లని కంటిపాపలవలన - ఆ రంగుగానే అయ్యెను. వారెక్కడ చూచినను ఆ నందనందనునే చూచుచుందురు. ఆతని కీ ప్రపంచమువలనఁ బ్రయోజనము లేదు. మాయలేదు, అవిద్య లేదు, ప్రకృతితోఁ బనియులేదు. సంసారము సుఖమయమగుఁ గాక దుఃఖమయమగుఁగాక, ఆతని శ్యామసుందరుఁడు సుఖ స్వరూపుఁడే. ఆతఁడు విశుద్ధ అద్వైతమునే నమ్మెను.

కొందఱు భక్తులు వాణీవినోదము కొఱకు ఈ దృశ్య ప్రపంచమునుగూర్చి యేదియో చెప్పుచుందురు; వినుచుందురు. ఇట్లు చెప్పుటవలన, వినుటవలనఁ బ్రయోజన మొక్కటే. అది తన యిష్టమూర్తి స్మరణము. ఉద్ధవుఁ డిట్టి భావుకహృదయ ప్రధానముగల భక్తుఁడు. ఏకాదశస్కంధములో నాతఁడు వేసిన ప్రశ్నలను జూచిన చిక్కుగానున్న దార్శనిక సిద్ధాంతములను సమన్వయపఱచుటకు, చిక్కుప్రశ్నల నన్నిటిని విడదీయుటకుఁ బ్రయత్నించెను. విభిన్నములుగఁ దోఁచు మతములనన్నిటి నేకీ కరణ మొనర్చెను. కాని ఆతఁడు శ్రీకృష్ణ ప్రేమచే రోదనము చేయుటను, తటతట కొట్టుకొనుటను గాంచినప్పుడును, ప్రేమా వేగమున విహ్వలుఁ డైనప్పుడును, వ్రజాంగనలకు మాటిమాటికి ప్రణామ మొనరించినప్పుడును, వ్రజములో గుల్మలతా స్వరూ పము తాను బెందవలెనని భగవానుని యాచించినప్పుడును దత్త్వ జ్ఞాన విషయములు తాను కేవలము లోకసంగ్రహార్థము చర్చించి నట్లు తోఁచఁగలదు.

విదురుఁ డంతటి భావుకభక్తుఁడు కాఁడు. ఆతఁడు సరస జ్ఞానభక్తుఁడు మన శ్యామసుందరుఁడు వచ్చెడువాఁడునుగాఁడు, పోయెడివాఁడునుగాఁడని యాతని విశ్వాసము. ఆతని ఆవిర్భావ తిరోభావములు కేవలము వినోదమాత్రములు. ఆతఁ డుద్ధవుని నోట భగవానుఁడు స్వధామమును జేరిన వార్తను, యాదవులు కౌరవులు వినాశమైరను సమాచారమును వినియు నాతఁ డొక్క మాటైన దుఃఖసూచకముగఁ బలుకలేదు. 'అయ్యో! ఎంతపని యైనది' అనియైనఁ బలుకలేదు. ఉద్ధవుఁడు విరహముచే నెంతయో విహ్వలుఁడయ్యెను. భగవానుఁడు స్వధామమును జేరఁగానే యెంతయో వ్యాకులుఁడయ్యెను. స్మృతికూడ తప్పినది. విదురుని మనస్సులో స్వభావానుసారముగఁ గొంచెము శోకము ఉత్పన్నము కాఁగా, విదురుఁడు దానిని దన వివేకముచే శాంతింపఁ జేసికొనెను. ఆతఁడు శ్రీకృష్ణ గుణకీర్తన శ్రవణ లోలుపుఁడు. శ్రీకృష్ణకథ యెచ్చట జరుగునో అచ్చట తన శ్రీకృష్ణుఁడు ప్రత్యక్షముగ నుండుననియు విషయవార్తలు జరుగు చోటునుండి పాఱి పోవుననియు నాతని విశ్వాసము. అందువలననే ఆతని ప్రశ్న యిట్లుండెను :– "తీర్థకీర్తియగు వాసుదేవభగవానుని విషయములను జెప్పుము. ఆతని లీలలను వినిపింపుము. ఆతని సౌందర్య మాధుర్యములను వినిపింపుము." ఉద్ధవునకుఁ గావలసినదియు నిదియే. ఒకే కోరిక కలవా రొక్కచోట సమావేశమైరేని అచ్చట అద్భుతానందము కలుగును. సాధారణముగ మాదక ద్రవ్యముల నొంటరిగా నెవ్వరును సేవింపరు. గంజాయి సలిచిరా తలకొక గ్రుక్క నిత్తురు. భంగు నూఱిరా తలకొక గుటక నిత్తురు. దాని యలవాటు లేనివారినైనను బిలిచి "ఒక్క గుటక వేయుఁడు. దీనిలో నేమియును లేదు. బాదాముపప్పు, మిరియాలు, కొద్దిగా

నామమాత్రము గంజాయి" అని యిచ్చుచుందురు. ఇట్టివాని యానందము నలుగురు కలిసి త్రాగిననే వచ్చును. ఒకే అభ్యాసము, స్వభావము కలవారు సమావేశమైనను, ఒకే ప్రాణముగ రెండు శరీరములు కలిసినచో స్వర్గము బెత్తెడెడముగ నుండును.

విదురుఁ డెట్టి యున్మత్తుడో, అతనితో నట్టి యున్మత్తుఁడే యగు నుద్ధవుఁడుకూడ కలిసెను. ఇద్దరు పిచ్చివాండ్రు కలిసికొనిరా, వారిఁక లోకమునే మఱతురు. ఇద్దరు వారి యాలోచనలలో మత్తులగుదురు. విదురునకు వినుటచేతను, ఉద్ధవునకు జెప్పుటవలనను రస ముత్పన్నమగును. కావున విదురుఁడు మెదలక నేకాగ్రమనస్సుతో నుద్ధవుని ముఖమును జూచుచుండెను. ఉద్ధవుఁ డానంద మగ్నుఁడై భగవంతుని సౌందర్య మాధుర్యములను జెప్పుచుండెను.

ఉద్ధవుఁ డిట్లనెను :— "విదురా! భగవంతుని దర్శన మొక్క జన్మములోని పుణ్యముచే లభించునది కాదు. వేలకొలఁది జన్మములలోఁ దపో, యజ్ఞ, సమాధులద్వారా ఆ పరమారాధ్యుఁడగు భగవాను నారాధించిన యా మహాభాగ్యశాలికే దేవదుర్లభమగు భగవద్దర్శనము లభింపఁగలదు. ఆతని దర్శనమే దుర్లభము. నిరంతర మాతని రూపమాధుర్యము ననిమేషభావముతోఁ గ్రోలుట ఆతని కృపచేతనే లభింపవలసియుండును. నేత్రసాఫల్యము శ్యామసుందరుని త్రిభువన కమనీయమూర్తి దర్శనమువలననే కాఁగలదు. అల్పపుణ్యులగు దర్శన పిపాసువులకు భువనమోహనకరమగు దన మనోహర రూపమును జూపించి, వారి కన్నులను దృప్తి కావింపకయే వానిని పిపాసితలుగనే వీడి భగవంతుఁ డీ ధరాతలమునుండి యంతర్హితుఁడయ్యెను. ఈ పృథ్విని వీడి

పోయెను. తన మానవలీలా సంవరణము కావించి స్వధామము నకుఁ బోయెను. దీనిమూలమున దర్శన పిపాసువుల నేత్రములను హీనము కావించెను.

విదురా! ఆ మదనమోహనుఁడు రూపమును మనుష్య రూపమువలెఁ దాల్చినాఁడుకాని యాతఁడు మనుష్యుఁడా? కాదు, కాదు! విదురా! మానవదేహమున కింతటిసౌందర్యముండుట సంభ వింపదు. ఆతఁడు తన యోగమాయ నాశ్రయించి మానవలీల లొనర్చుటకై తన యంగ ప్రత్యంగములను ప్రాకృతిక మానవుల వంటి యాకారమును రచించుకొనెను. మానవోచితలీల నొనర్చుచు నాతఁడు రాగ, ద్వేష, కామ, క్రోధములతోఁ గూడుకొనినవారి హృదయములందు సుఖసంచారము కావింపఁగలిగెను. నీరస మానవజీవితమునకు సరసతా సంపుటము కావింపఁగలిగెను. ఆధివ్యాధి చింతా సంతాపములందు మునిఁగిన జీవులకు ప్రేమరసా స్వాదనము కావించెను. ఆ సౌందర్య మిట్టిదన వీలులేదు. అన్యులమాటయేల? తాను స్వయముగ నల్లగ నుంగరములు తిరి గిన వెండ్రుకలను దువ్వుకొనుటకు అద్దముముందు నిలుచుండి, శారదీయ కమలమును, పూర్ణరాకాసుధాకరుని దిరస్కరించు శ్రీ ముఖమును దాను జూచుకొని విస్మితుఁడయ్యెడువాఁడు. అద్దమున జూచుకొనుచు నాశ్చర్యమున నిట్లనుకొనెడువాఁడు :— "అరే! ఇంత సుందరుఁ డెవ్వఁ డీతఁడు? దేవతయా? దానవుఁడా? యక్షుఁడా? గంధర్వుఁడా? కింపురుషుఁడా? ఎవఁ డీతఁడు? ఇంత సౌందర్యమును నేనెచ్చటను జూడలేదే?" అని విస్మయ ముతోఁ గదలి యిట్లనుకొనును :— "అరే! ఇది నాప్రతిబింబ మేనే! నా ముఖ మింత సుందరమా?" విస్మయావిష్టుఁడై మరలఁ

జూచుకొని ముగ్ధుఁడై పోవును. రూపసాగరమునుగూడ విస్మ యము కావించిన యీరూపమును సాంసారికవస్తువుతో దేనితోఁ బోల్పఁగలము ?

విదురా ! నీవు ధర్మసూనుని రాజసూయయాగ శోభను మఱచితివా యేమి ? నీవప్పుడు ముఖ్య కార్యకర్తలలో నొక్కఁ డవు. ఆ సమయమున దేశదేశాంతరములలోని రాజులు, రాజ కుమారులు సమావేశమైరి. వచ్చిన రాజులలో నొక్కనికంటె నింకొక్కరుఁడు రూపవంతుఁడు, సుందరుఁడు, సుకుమారుఁడై యుండెను. తారాగణము ఆకాశశోభ నినుమడింపఁజేసినట్లు చిత్ర విచిత్రవస్త్రభూషణాదులచే నలంకరింపఁబడిన ధర్మరాజ యజ్ఞ మంటపము శోభిల్లెను. వీరందఱిలో శ్రీకృష్ణచంద్రుఁడు మచ్చ లేనిచంద్రునివలె సల్లీలఁ వెలుఁగుచుండెను. అగ్రపూజా ప్రశ్న వచ్చునప్పటికి సహదేవుఁడు లేచి వాసుదేవుఁడే అగ్రపూజ కధికారి యని చెప్పెను. ధర్మాత్ములగు రాజులందఱును దీనిని సమర్థిం చిరి. ధర్మరాజు సంతోషమునకు మేఱలేకుండెను. సాధారణ మానవుని పూజ కాదాయెను, సాక్షాత్తుగ గోలోకవిహారియగు నంద నందనుని పూజ. పూజ చేయువాఁడును సాధారణ వ్యక్తి కాఁడు, చతుస్సముద్ర పరివలయిత సప్తద్వీపవతి యగు నీ వసుంధరను నేకచ్ఛత్రముగా నేలిన ధర్మరాజు యజమాని. యజ్ఞదీక్ష గొనిన దగుటచే హరిణ శృంగమును ధరించి, అయోనిజయగు ద్రౌపది సమ్రాజ్ఞియై ఆతనికి దక్షిణ దిక్కున నుండెను. భగవంతునిపై శ్వేతఛత్రము విరాజిల్లుచుండెను. వేదజ్ఞులగు బ్రాహ్మణులు నానా ఉపచారములచే వైదికమంత్రములతో, దివ్యౌషధీ, మహౌషధీ, జలములలో విధ్యుక్తముగ నభిషేకమును జేయించుచుండిరి. దివ్య

పీతవర్ణమువ్వఁబడిన కాషాయవస్త్రమును ప్రేమాశ్రునేత్రములతో ధర్మరాజు నీలమణివలెఁ బ్రకాశించు శ్రీయంగముపై ధరింపఁజేసెను. నానారత్నములతోడను, మణులతోడను గూడుకొనిన హారములను, దివ్యభూషణములను సమర్పించెను. ఆహా! ఆ సమయమున నారసి కాంతి, శోభ యెట్లున్నది! సభయంతయు చిత్రప్రతిమల వలెనైరి. నిరంతరము జూచుచున్నప్పటికి నందఱు సంతృప్తులైరి. అందఱి నేత్రములు ఆశ్చర్యచకితము లయ్యెను. అందఱు విస్మయాశ్చర్యచకితులై యిట్లనుకొనిరి :– "ధన్యులము! ఎట్టి సౌందర్యము! ఎట్టి అనుపమ లావణ్యము! బ్రహ్మ తన నైపుణ్యము నంతను ఖర్చుపెట్టిచేసెను. ఆతఁడు తన చాతుర్యమునంతను ఈ ఒక్క విగ్రహమందే వినియోగించెను. ప్రపంచములో నీతని సౌందర్యమున కుపమానములేదు. దీనికి సమానమగునది లేదు."

విదురా! ఆ రూపమును మన మెంతగాఁ జూచిన, మన తృష్ణ అంతగాఁ బెఱుగుచుండెను. అయ్యో! అట్టి రూపము నేఁడు మన కన్నులనుండి మాయమైపోయినది. నేఁడు మనకా అనుపమ లావణ్యయుక్తమగు శ్రీవిగ్రహము కనఁబడదు. మన కన్ను లా రూపమును జూడ నువ్విళ్లూరుచున్నవి. ఈ ప్రాపంచిక రూపము లన్నియు నిస్సారభూతములుగఁ దేజోవిహీనములుగ నున్నవి. కన్ను లిప్పు డెవరినిఁ జూడఁగోరుటలేదు."

సూతుఁ డిట్లనెను :– "మునులారా! ఈ విధముగఁ జెప్పి యుద్ధవుఁడు రూపధ్యానములో నిమగ్నుఁడయ్యెను. విదురుఁడును గదలక మెదలక ఉద్ధవముఖ నిస్సృత రసము నేకాగ్రచిత్తముతోఁ బానము చేయుచుండెను."

—•*•—

# శ్రీకృష్ణుని లోకోత్తర మాధుర్యము

శ్లో॥ యస్యానురాగ ప్లుతహాసరాస
లీలావలోక ప్రతిలబ్ధమానాః,
వ్రజస్త్రియో దృగ్భిరనుప్రవృత్త
ధియోఽవతస్థుః కిల కృత్య శేషాః॥
— శ్రీభాగ. ౩ స్కం. ౨ అ. ౧౪ శ్లో.

సీ. శరదాగమారంభ సంపూర్ణ పూర్ణిమా
చంద్ర సాంద్రాతపోజ్జ్వలిత మగుచు
వెలయు బృందాటవీ వీథియం దొకనాఁడు
రాసకేళీ మహోల్లాసుఁ డగుచు
రుచిర సౌభాగ్య తారుణ్య మనోరమ
స్ఫూర్తిఁ జెన్నొందిన మూర్తి యలర
సలలిత ముఖచంద్ర చంద్రికల్ గోపికా
నయనోత్పలముల నానందమునఁగ

తే. భవ్యచాతుర్యభంగిఁ ద్రిభంగి యగుచు
నబ్జనాభుండు సమ్మోద మతిశయిల్ల
లీలఁ బూరించు వరమురళీ నినాద
మర్థి వీతేర విని మోహితాత్మ లగుచు.

చ. పతులు మఱందులుం సుతులు బావలు నత్తలు
మామలున్ నను
న్నతి వలదన్న మానక మనంబునఁ గృష్ణపదాబ్జసేవనా
న్వితరతి గోపకామినులు వే చనుదేర దయాపయోనిధి
ఛితగతి రాసకేళి సలిపెం దరుణీ నవపుష్పబాణుఁడై
— శ్రీ మహాంధ్రభాగవతము.

మనస్సు స్వాభావికముగ మాధుర్యమును గ్రహించు చుండును. స్వాదిష్టపదార్థములను జిహ్వ ప్రీతితో రుచి చూచును. ప్రియ పదార్థములను గాంచి హృదయము పరవశమై దానివైపున కాకర్షింపఁబడును. భగవానుని యైశ్వర్యమునుగాంచి, కొందరా తనిని గాంచి భయపడుదురు. కొందఱు దుష్టదమనమునకుఁ బ్రసన్నులగుదురు. కొందఱు ద్వేషింతురు. కొందఱు కోపము చెందుచుందురు కాని యాతని మాధుర్యవిలాస మందఱియందు నొక్కటిగానే యుండును. ఖరదూషణులు శత్రుభావముతోఁ జంపుటకై దూర్వాదళ శ్యాముఁడును. రఘుకులతిలకుఁడును, అయోధ్యాలంకారుఁడును, కౌసల్యాకిశోరుఁడు నగు శ్రీ రాముని కడకు వచ్చి, యా యనుపమ సౌందర్యమును, లోకోత్తరమాధుర్య మును జూడఁగానే ఆతని నోటినుండి యీ శబ్దము లప్రయత్నముగ వెలువడినవి — "ఈతఁడు నా సోదరినిఁ గురూపఁగాఁ జేసినప్పటి కిని, ఇట్టి యనుపమ మాధుర్యయుక్తుఁడగు భూమీశ్వరుఁడు చంపఁ దగినవాఁడు కాఁడు." శత్రుశిరమున నాట్యమాడిని దీనిని మోహన విద్య యందురు. ఈ మాధుర్యము శ్రీకృష్ణరూపమున బరాకాష్ఠను బొందినది. ఆతని నొక్కమారు కాంచెనా ఆతనికి మూల్యములేని క్రీతదాసుఁడు కావలసినదే. ఇది సర్వసాధారణ విషయము. కాని స్నేహమయుఁడును, ప్రేమమయుఁడును, సహృదయుఁడునగు శ్రీకృష్ణునియందు తన మనో ప్రాణముల నర్పించిన వ్రజాంగనల విషయములోఁ జెప్పవలసినదేమున్నది? ఉద్ధవుఁడు సౌందర్యచర్చ చేయుచుండఁగా నా వ్రజాంగనల యనుపమ ప్రేమ స్మరణకు వచ్చెను. ఆ యావేశములోనే యీతఁడిట్లు చెప్పుచుండెను.

"విదురా! మూర్తిమంతమగు మాధుర్యస్వరూపుడైన శ్రీహరి లోకోత్తరలావణ్యము నెవరుఁ జెప్పఁగలరు? ఎట్లు చెప్పఁగలరు? ఇది చెప్పఁదగిన విషయము కాదు. పలుకఁదగిన పలుకును గాదు. నీవు శ్రీకృష్ణవార్తలను జెప్పుమనుచున్నావు. అవి వాగతీతమైనవి. భగవంతుఁ డనేకావతారములలో ననేకములగు లోకోత్తర చమత్కారములను గావించెను. తన యైశ్వర్యమును గూడ ప్రదర్శించెను: కాని యీ యవతారమందు కొంచెము విలక్షణమగు స్వారస్యమును బ్రదర్శించెను. మూర్తిమంతమగు రస విగ్రహమా యనునట్లుండెను. శుద్ధ స్వచ్ఛములగు దానిమ్మగింజల వలెను, ముత్యముల వరుసవలె నున్న ఆతని పలువరుసలు బయట పడునట్లు చిఱునవ్వునవ్వేనా, ప్రేమవతులును, మహాభావవతులును, బృందావనవాసినులగు వ్రజవనితల హృదయమందొకవిధమగు వికలత కలుగుచుండెడిది. ఆతఁడు తన కోమలకరములతో వారి శరీరములను దాఁకి కమనీయకటాక్షములచే వ్యథితులనొనర్చుచు, వారితో సంభాషించుచు, వినోదమొనర్చుచు, హాస పరిహాస కథా వళులను జెప్పుచుండిన వారు ధన్యులగుచుందురు. తామే సర్వ ప్రపంచములో సౌభాగ్యవతులును, శ్రేష్ఠ లనుకొనుచుందురు. ఏ పని చేయుచుండినను శ్రీ కృష్ణదృష్టి పడెనా వారు చిత్ర ప్రతిమలవలె నిశ్చేష్టు లగుచుందురు.

విదురా! నేనా శ్రీకృష్ణసందేశమునుగొని యా బృందావన విరహిణుల శరణమునకుఁ బోయినప్పుడు వారి యనురాగమును బ్రత్యక్షముగ దిలకించితిని. శ్రీకృష్ణునియెడ వారి కెంతటి స్నేహము! ఎంతటి ఆసక్తి! ఎంతటి అనురక్తి! దానిని గాంచి నేను చకితుఁడనైతిని. గోపగోపాంగనలు చెప్పిన ప్రేమ విషయ

ములను, వారు చెప్పిన పురాతనకథలను విని నేను నిర్ఘాంతపడి పోయితిని. ధన్యుఁడ నైతిని. వెళ్లుట ఒక్కరోజు మాత్ర ముండవలయుననియే. కాని యా రస సాగరములో మునిఁగి నెలలపర్యంత మచ్చటనే యుండి యా విషయములనన్నిటిని వినుచు నేయుంటిని. భగవంతుని సౌందర్య మాధుర్య ప్రభావ్యాప్తిచే వ్రజములోని సజీవులు నిర్జీవులుగను, నిర్జీవులు సజీవులుగ నయ్యె డువారు. గోవర్ధనశిల లెన్నో కఱఁగుటను నేను గాంచితిని. వాటిమీఁద నిప్పటి కింకను శ్రీకృష్ణునియొక్కయు, గోపగోపీజన ములయొక్కయు, గోవుల యొక్కయుఁ జరణచిహ్నము లన్నో అంకితములై యున్నవి. వృక్షములకు రోమాంచములయ్యెడివి. అవియు సజీవ మానవులవలెఁ బ్రేమాశ్రువులను రాల్చుచుండెడివి. ఆతని వేణు గానమును విని ప్రకృతి స్తబ్ధమయ్యెడిది. ఆతని రూపమును గాంచి వ్రజాంగనలు శరీరములు మఱచి, యన్యమన స్కలై, వెఱ్ఱివాండ్రవలె దారియు డొంకయు తెలియనివారువలెఁ బ్రేమోన్మత్తలై యుండెడువారు,

వ్రజములోఁ బ్రతియింటిలోఁ బొయ్యిలో నిప్పు నుంచు కొనెడువారు. ఒకరెంటిలో నారిపోయెనా ప్రక్కయింటినుండి మరల నిప్పు తెచ్చుకొనెడువారు. సాయంకాలము కాఁగానే ప్రతి యింటను దీపము వెలుగుచుండెడిది. ఒక యింట వెలిఁగింపఁగానే మిగిలినవారు త్వరత్వరగాఁ బరువిడివచ్చి దీపము వెలిఁగించుకొని పోవుచుందురు. ముందుగా మురళీమనోహరు నింట దీపము వెలిఁ గింపఁబడెడిది. అంత వెంటనే వ్రజాంగన లందఱు అచ్చటికివచ్చి తమ తమ దీపములను వెలిఁగించుకొని పోయెడువారు. ఒకటికి రెండుపను లయ్యెడివి. దీపమును వెలిఁగించుకొనెడివారు. వ్రజ

కులదీపకుఁడగు శ్యామసుందరుని దర్శనము సయ్యెడిది. ఒక కార్తి
కమున సాయంతనము కాఁగానే వారింటికి గుంపులు గుంపులుగ
గోపికలు వచ్చెడువారు. ప్రేమోన్మత్తయగు నొకానొక నూతన
వివాహిత వచ్చినది. ఆమె మొట్టమొదటనే యా యనుపమ
మాధుర్యరసమును రుచిచూచెను. ఆ దినమున దీపము ముందర
అనే శ్యామసుందరుఁడు తల్లితో జగడమాడుచుండెను. ఆహా!
ఆతని సౌందర్య మెట్టిది? ప్రేమ కోపమున నాతని ముఖకమల
మెంత కమనీయమైనది! నూతనవధువు దీపమును వెలిగించుచు నా
రూప మాధురిలో నిమగ్నమయ్యెను. ఆమె కనురెప్పలు వ్రాలుట
లేదు. అనిమేషభావముతో నామె దామోదరునివైపు చూచు
చుండెను. ఆ సౌందర్యసుధయందు గల్గిన తన్మయత్వమున
దీపముతోఁ గూడ వ్రేళ్ళుకూడ మండుచున్నను ఆమె కా స్పృహ
లేదు. వ్రేళ్లు కాలుచుఁ జేయివఱకు వచ్చునప్పటికి యశోదమ్మ
దృష్టి యటుపడెను. వెంటనే ఆమె పరువిడి ఆమెను బయటకు
లాగుకొనివచ్చెను. అగ్ని నార్పి దుఃఖితయై యిట్లనెను:—"అయ్యో:
పిచ్చిపిల్లా! నీ విట్లు చేసినా వేమి? చేయి కాల్చుకొంటివేమి?
ఎక్కడైన దీపమిట్లు వెలిఁగించుకొందురా? నేడు నీవు మత్తు ద్రావి
రాలేదుకదా! నీ చేతిని కాల్చుకొంటివి. అది నీకు తెలియనే తెలి
యదాయెను."

ఆమె దృష్టి శ్యామసుందర ముఖారవిందము నుండి తొలఁ
గఁగానే ఆమెకు స్పృహ కలిగెను. అప్పుడామెకు బాహ్యజగత్తు
భాసించుచుండెను. గోపిక లజ్జితయై, అవశముగనే "హా! శ్యామ
సుందరా! హా! మదనమోహనా!" యనెను.

ఇట్టులే సింతకు పూర్వము ఈ రోగముచేతనే గ్రసింపఁ బడిన యొకానొక గోపసఖి యిదియంతయుఁ దెలిసికొని ప్రేమ రోషమున నిట్లనెను :— "ఏమమ్మా! ఈ పిల్లవాఁ డేమను కొన్నావు? ఇంద్రజాలికుఁడు. ఈతని ముఖమున నీవేమి పూత పూసినావో తెలియదుగాని, యితనిని జూచినవారందఱకు నిట్టి స్థితియే కలుగుచుండును."

అంతఁ దల్లి యిట్లనెను :— "ఓసీ పిల్లా! మా పిల్లవానికి దృష్టి పెట్టవలదు. అభము శుభము యెఱుఁగని బాలుఁడు."

గోపిక యిట్లనెను :— "అమ్మా! మేము మీ పిల్లవానికేమి దృష్టి పెట్టగలము? నీ పిల్లవాఁడే అందఱకును దృష్టి పెట్ట గఁలడు. ఆతని దృష్టిమహాత్మ్యమువలననే యీ పిల్లకు పాపము చేయియంతయు కాలిపోయినది."

ఇంతలోననే శ్యామసుందరుఁడు చకితుఁడై వచ్చి యిట్ల నెను :— "అయ్యో! ఏమైనది? ఎక్కడ కాలినదో చూతును." అని యిట్లనుచు నాతని అమృతమయమగు హస్తముతో నా మహా భాగ్యశాలి హస్తమును బట్టుకొనెను. ఆతని స్పర్శ తగులఁగానే అది యెప్పటియట్లు సుందరముగను, నిరామయముగను నయ్యెను. ఆతఁడు మాటిమాటికి చేతి నటునిటుఁ దిరుగవైచి చూచి యిట్ల నెను :— "ఏదమ్మా! చేయి ఎక్కడను కాలనేలేదే! కొంచెము కంది ఎఱ్ఱఁబడినది. కొంచెముగ సెగలాఁకియుండవచ్చును. 'అమ్మా! మంచి వెన్న నిట్లు కొంచెము తెమ్ము. నవనీతమును బూసిన నయము కాఁగలదు."

రెండవ సఖి యిట్లనెను :— "శ్యామసుందరా! నీ శ్రీహస్త మునకున్న స్నిగ్ధత, యీ వెన్న కెక్కడనుండి రాఁగలదు? నీ

స్పర్శయే కోటియౌషధముల కౌషధము. నందనందనా! నీ దృష్టియే మధుమయము, అమృతమయమును. ఆ దృష్టి పడఁగానే బడబానలమైనను శాంతింపఁగలదు."

కాబట్టి విదురా! ఏమాధుర్యమును గాంచుటచే వ్రజాంగనలకు కాలుచున్న స్పృహయైనను లేకపోయెనో, ఎవనిఁ జూచుటచేతనే సజీవ శరీరములుకూడ నిర్జీవములవలె నగుచుండునో, నేఁడాతఁడే మనలను విరహసాగరమున ముంచి స్వధామమునకుఁ బోయెను."

---

# అజన్మునికి జన్మ

శ్లో॥ స్వశాంతరూపేష్వితరైః స్వరూపై
రభ్యర్ద్యమానే ష్వనుకంపితాత్మా,
పరావరేశో మహదంశయుక్తో
హ్యజోఽపి జాతో భగవాన్యథాగ్నిః.॥

—శ్రీభాగ. ౩ స్కం. ౨ అ. ౧౫ శ్లో.

వ. మఱియు శాంతోగ్రరూపధరుండైన సర్వేశ్వరుండు శాంతరూపుండు గావునఁ బరకృతాపరాధ నిపీడ్యమాన మాన సుండయ్యు ననుకంపాయత్తచిత్తుండై వర్తించు పరావరుండును బ్రకృతికార్యంబైన మహత్తత్త్వరూపుండును జనన విరహితుండ య్యును దారువులవలన ననలంబు వోఁచు చందంబున జననంబు నొందుచుండు.........

—శ్రీమదాంధ్రభాగవతము.



జన్మ కర్మలవలనఁ గలుగును. శుభకర్మ లొనర్చుచో దేవతాది పుణ్యయోనులందు జన్మింపవలసి వచ్చును. అశుభకర్మ ఫల స్వరూపముగ పశు పక్షి నారకీయ పాపయోనులందు దుఃఖ మనుభవింపవలసి వచ్చును. శుభాశుభ మిశ్ర కర్మలవలన మను ష్యాదియోనులు లభించును. భోగింపక కర్మక్షయము కాదు. దేహములేక భోగింప వీలులేదు. కావున వివిధ జీవసృష్టి శుభా శుభ కర్మ భోగనిమిత్తమే. భగవంతుఁడు కర్మబంధనములకుఁ బరుఁడు కదా! అట్టియెడ నాతనికేల జన్మ కలుగవలయును ?

ఆతఁ డవతారముల నేల ధరింపవలయును ? అజన్మునకు జన్మ యెక్కడిది ? అచ్యుతున కవతారము లేకారణముచే నెత్త వలసి వచ్చినది ? నీటికి నిప్పెట్లు అంటుకొనినది ? ఇవన్నియు విపరీత ములుగ నున్నవి. అందువలనఁ గొందఱు భగవంతున కవతారమే యుండదని వాదింతురు. భగవంతుఁడు ఘటఘటవ్యాపి. వాంఛా కల్పతరువు. ఎవనికెట్టి భావన కలుగునో వానికట్టి ఫలమొసం గును. ఆతనిని నిర్గుణుఁడని భజించిన నిర్గుణుఁడే యగును. సగుణమని యారాధించుచో మనోహర రూపమును ధరించును. శూన్యమని ఆతనిని నిరాకరించుచో వానికి శూన్యమే కాఁగలఁడు. కర్మిష్ఠులకుఁ గర్మయై ఫలమొసంగును; కాని మనము మధురో పాసకులము. మనము వానిని మనవలెనే చూడఁగోరు చుందుము. మనము జన్మించితిమి కావున మనము శ్యామసుందరుఁడు కూడ జన్మించుటను గాంచగోరుచున్నాము. మనము మన వర్షములను లెక్కపెట్టుకొను చున్నాము. అందువలననే మనము భగవానుని జన్మోత్సవమును మహావైభవముతోఁ జేయుచున్నాము. మనము దేనిని జేయుదుమో, దేనిచే మనకానందము లభించునో ఆసంబంధ మునే శ్యామసుందరునితో గలుగఁజేసికొన నుత్సహించుచుందుము. ఆతఁడు సర్వజ్ఞుఁ డైనప్పుడు, సర్వసమర్థుఁడైనప్పుడు కర్మ బంధనము లాతనికి లేకున్నను గేవలము మన కోరికను బూర్ణ మొనర్చుటకై యాతఁ డజన్ముఁడయ్యు జన్మించుచుండును. అచ్యు తుఁడయ్యు నవనిపై నవతరింపవలసివచ్చును. కావుననే భగ వంతుఁ డవతరించు చుండును. అపరాధియైనవాఁడు బందిఖానాకు వెళ్లుట సమంజసమే. కారావాసము దండనము ననుభవించు స్థలము. కాని అప్పుడప్పుడు వినోదియగు రాజును గరుణా వశముననో, ఇంకేవశముననో వేషమునుమార్చుకొని, నిరపరాధి

యయ్యుఁ గారాగృహములోనికి వెళ్లిబందీవరె వేషము వైచికొని, ఆతనివలెఁ బనిచేయ మొదలిడును. గానుగ లాగును. మోట లాగును. జైలరు కంతయుఁ దెలియును. లోలోన నాతనికి భయపడును; కాని యేమియు మాటలాడఁడు. ఆయనను పని చేయ మనఁడు. అయితే ఆతఁడు నవ్వుచుఁ పనిచేయుచుండును. ఆతఁడున్నంతసేపు విషణ్ణుఁడైన బందీకూడ ఆనందమును బొందును. ఆతఁ డెవరినైనను విడుదలఁ గావింపఁ గలఁడు; ఎవరికైనను శిక్షను తగ్గింపఁగలఁడు. ఆతని యీ రూపము దండ స్వరూపము కాదు, కౌతుకవశమైనది. ఇది తెలిసియే ఉద్ధవుఁ డాశ్చర్యాతిశయమున నిట్లనెను :— "విదురా! భగవంతున కవతరింపవలసిన పని యేమున్నది? ధర్మాత్ములలో ధర్మబలము నాతఁడే యిచ్చుచుండును. దానవులలోఁ బరాక్రమ సాహసము లాతనివలననే లభించుచుండును. ఆతఁడనుకొనిన దానవులను బుట్టింపకుండెడువాఁడే. ఎల్లప్పుడును సాధువులనే సృష్టించెడు వాఁడు; కాని యాతఁ డట్లు చేయక దుష్టుల కత్యధిక బలసాహస ముల నొసంగుచుండును, వారివలన సాధువులకు బాధ కలుగఁ గానే తాను దేవతలపక్షమున నుండి పోరాడుచుండును! ఎట్టి క్రీడ? పోరాడును. సదా అపరాజితుఁడయ్యు నొక్కొక్కప్పుడు స్వయముగ వారిచే నోడిపోవుచుండును. మధు కైటభులను దానవు లిరువురు అసురసృష్టి ప్రారంభమున నాతని శరీరము నుండియే పుట్టిరి. ఏల పుట్టిరి? ఏలననఁగా నట్లు పుట్టవలసి యుండెను. కన్నులలోఁ బుసి యేల పేరుకొనుచున్నది? శరీర మందును వెంట్రుకలందును పేలేల పడుచున్నవి? ఇదియే భగ వంతునిలోఁ గల విశేషము. వారు పుట్టఁగానే భగవంతునిమీఁదకు యుద్ధమునకుఁ బోయిరి, ఆయన యోగనిద్రలో శయనించి

యుండెను. అయినను వారితోఁ బోరాడెను. కాని, సర్వసమర్థుఁడయ్యు దైత్యులను జయింపలేకపోయెను. దైత్యులు; అదియునుగాక ఆతని తనయులు. ఇప్పుడేమి చేయవలయును? అచ్యుతుఁడును హడలి పోయెను. ఇంతలో సహంకారులగు నా దైత్యు లిట్లనిరి:— "విష్ణూ! మేము నీ మీఁద బ్రసన్నులమైతిమి, మమ్ముల నేదైన వరమడుగుము." ఇది విని, దైత్యులును వరదాన మొసఁగు సాహసము చేయుచుండిరేయని నవ్వుకొనవలదు. ఆతని కృపవలననే ఇది అంతయును. సాహస సామర్థ్యములన్నియు నాయనవియే. భగవానుఁడును బ్రసన్నుఁడై యిట్లనెను:— "ఓరీ! మీరు నాచేతఁ జచ్చునట్లు వరదాన మడుగుచున్నాను." దైత్యు లదరిపోయిరి. బాగుగా మోస పడిరి. కాని యేమిచేయుదురు? లీలాధారి నెట్లు జయింపఁగలరు? భగవానుఁడు వారిని జంపివేసెను. వారి మేదస్సుచే నీ పృథివి యేర్పడెను. అందువలన దీనికి మేదిని యను పేరువచ్చెను. అచ్యుతుఁ డపరాజితుఁడయ్యు దైత్యులకు భయపడఁగా నాతఁ డజన్ముఁడయ్యు జన్మించుటలో విదురా! ఇందాశ్చర్య మేమున్నది?

'మాకు శ్రీకృష్ణలీలలను వినిపించుము. భగవచ్చర్చ చేయుదము' అని పలుకుచుందువు. భగవచ్చరిత్ర నడిగెదవేల? నీ విది వఱ కనేకసారులు వినియుంటివికదా!"

విదురుఁ డిట్లనెను:— ఉద్ధవా! ఏమి చెప్పుదును? ఎన్నిసారులు విన్నను తృప్తికలుగనంతటి రస మా చరిత్రలో గలదు. ఎన్ని సారులు వినిన నంత తృష్ణ యధికమగుచుండును. తృష్ణారోగములో నెంత నీరు త్రాగిన నంత దాహ మధికమగుచుండును."

ఇది విని ఉద్ధవుఁడు నవ్వి యిట్లనెను:— "అందుకనియే భగవంతుఁడవనిపై నవతరించి, నానాయోనుల జన్మించి, వివిధ

క్రీడ లొనర్చుట భక్తులకు సుఖము లభింపవలయుననియే. ఇప్పు డిక నీవు క్రమముగ నాతని లీలల వైపు ధ్యానముంచుము."

భగవంతుఁ డపరిచ్ఛిన్నుఁడు. దేశకాల రహితుఁడు. అయినను నాతఁడు పరిచ్ఛిన్నునివలెఁ గనబడుచున్నాఁడు. ఇరువదెనిమిదవ కలియుగాంతమున వ్రజమండలమందు బుట్టినట్లు తోఁచెను. అజన్ముఁడయ్యు శ్రావణ బహుళ అష్టమినాఁడు అర్ధరాత్రమున నాతఁడు జన్మించినట్లయ్యెను. జన్మించినది మథురలో; పారిపోయినది గోకులమునకు ఎందులకు పారిపోయినాఁడు ? ఎక్కడనైన మామకు జూడచిక్కి చంపునేమోనని భయపడి పారిపోయినాఁడు. భగవంతునకుఁగూడ భయము కలుగునా? జన్మించినవానికి భయము కూడ ఉండును. అజన్ముఁడు నిర్భయముగ నుండును. జన్మించిన వానికి ప్రబల భయముండును, పుట్టఁగానే వసుదేవునితో నిట్లనెను:— 'గుట్టుగానున్న గోకులమునకుఁ గొనిపొమ్ము.' ఆతఁ డిట్లనెను:— 'కాళ్ళకు సంకెళ్లున్నవి యెట్లు? వెంటనే ఆతఁడు తన యోగ మాయను బిలిచెను. ఆమెయు భయపడెను. ఆమె వెంటనే సంకెళ్ళను వదలించెను. కావలివాండ్రను నిద్రపుచ్చెను. అంత తండ్రి నెత్తిపై కూర్చుండి చోరచూడామణి దొంగతనముగ వెళ్లిపోయెను.

విదురా! ఆ శ్రీకృష్ణుని విషయముల నేమిచెప్పుదును? ఆతని లీలలు ఒకదానికంటె వేఱొకటి అత్యద్భుతములు. లోకములో పిరికివానిని గాంచి యందఱు నెగతాళి చేయుదురు. దొంగ కందఱు భయపడుదురు. ఈ విషయము లాతని సంబంధమున వచ్చెనా ఏమి మాయయోగాని హృదయము కఱిగించివేయును. భగవంతుఁడైనవాఁడు కంసునికి భయపడ నేల! అక్కడనుండియే వానిని జంపరాదా? అనంతపరాక్రమశాలి యయ్యు నాతఁడు కాలయవనుని

కేల భయపడి పారిపోవ నెను? వానితోఁ బోరాడి చంపరాదా? యని మూఢులు పలుకుచుందురు. దీనికేమి ప్రత్యుత్తర మీయవలెను? వారిని జంపుట కాతని రుద్రరూప మున్నదికదా! మూఁడవ కన్నుచేఁ జూచుటతోడనే ఈ చరాచర విశ్వమంతయు భస్మము చేయవచ్చును. అట్టియెడ నాతఁడెవరినో చంపుట కేల యవతరింపవలయును? చంపుట కవతరింపఁడు. తరింపఁజేయుట కవతరించును. ఆతఁడు మృత్యువొసంగక పోవుటయే కాదు, అమృతత్వమును ప్రసాదించును. ఆతఁ డేడిపింపఁడు, నవ్వించును. తాను స్వయముగ యశోదాదేవి చేతిలోని కొరడాను గాంచి యేడ్చినవాఁడు ఇతరుల నెట్లు నవ్వింపగలఁడని నీవనవచ్చును. తాను గన్నుల నీరు గార్చుచు నితరుల ముఖకమలము నెట్లు వికసింపఁ జేయఁగలఁడు? అయ్యా! ఆతని అశ్రువులు, మృషలు వట్టివే. అది అంతయు నాటకములోని యొక యభినయము. నాటకములోని పాత్రధారి మృషారోదన మెట్లు చేయునో, ఎట్లు వానిని గాంచిన దర్శకుల కానందము, సుఖము కలుగునో, ఆ యభినయనమును గాంచి వారెట్లు ప్రశంసింతురో, అట్లే తల్లి హృదయమును గఱగించుట కాతఁడు కన్నీనులుముకొనియుఁ, గొంచెముగ నుమ్మి రాచుకొనియుఁ, గొంచెముగఁ గాటుకను కపోలములవఱకు రుద్దుకొనియు నెట్లో రెండు మూఁడు బొట్లను కంటినీరు గార్చెను. దానివలనఁ దల్లియొక్క నవనీతసమాన హృదయము ద్రవీభూతమయ్యెను. వెంటనే చేతిని బట్టుకొని, కొఱడాను విసరిపాఱవైచి ప్రేమస్రావిత స్వరముతో నిట్లనెను:—
"సరే, ఇఁక నిన్ను గొట్టనులే, నిన్ను గట్టెదను:"

తల్లి యిట్లనుకొనెను:— "కన్నా! నీ వందఱను గట్టెదవు. నేటివఱకు నిన్ను గట్టువారు దొరకలేదు. నేటితో నన్నియు మఱచి

పోవుదువు." భగవంతుఁడు భక్తవశ్యుఁడు. 'అమ్మా! నీకు బంధించుటవలననే సుఖము కలుగుచున్నది. అట్లు కట్టుటవలననే నీకు సంతోషమైనఁ గట్టుము. హద్దులేని వానిని హద్దులో బంధించుము" అని కృష్ణుఁడనెను. కాలయవనునికి నిందే సుఖముకలదు. "కృష్ణుఁడు గొప్ప బలవంతుఁడని వినియున్నాను. వీఁడు పాఱుబోతే. రణమునువదలి పాఱిపోయినవాఁడే. వీనికి రణఛోడుఁడను బిరుదు సార్థకమైనది." అనెడువాఁడు. ఈ విధముగ విదురా! అతని లీలలన్నియు నత్యద్భుతములు."

శుకమహర్షి పరీక్షిత్తుతో నిట్లనెను:— రాజా! కృష్ణచరిత్రను నేను ముందుముందు చెప్పఁగలను. ఇచ్చట ప్రసంగానుసారము విహంగమదృష్టితో నేనీ ప్రసంగమును బూర్తి కావించుచున్నాను."

—*—

# దీనులందు దుష్టులందు దయామయుని అపార దయ

శ్లో॥ అహో బకీయం స్తన కాలకూటం
జిఘాంసయా పాయ యదప్యసాధ్వీ,
లేభే గతిం ధాత్ర్యుచితాం తతోఽన్యమ్
కం వా దయాలుం శరణం వ్రజేమ॥

— శ్రీభాగ. ౩ స్కం. ౨ అ. ౨౩ శ్లో.

"వ.........తన్ను హరియింపం దలంచి కుచంబుల విషంబు ధరియించి స్తన్యపానంబు సేయించిన దుష్టచేతనయైన పూతనకుం జన్నిచ్చి పెంచిన యశోదాదేవికినైన నందరాని పదం బుఁ గారుణ్యాయత్తచిత్తుండై యొసంగెననిన నిజపద ధ్యాన పరా యణులగువారల ననుసరించి సేవించుట సెప్పనేల?"

— శ్రీమదాంధ్రభాగవతము.

ప్రియతమునితో నేకాంతమున నుండఁగా రసాస్వాదనము స్వస్థచిత్తమునఁ గలుగును. ఇతరుల భయమున్నను, సంకోచము న్నను, చింతయున్నను, ఇద్దరలో నొకరైన నన్యమనస్కులై యున్నను, వాని మనస్సు అన్యవిషయమం దనురక్తమైనను, రస విపర్యయము కలుగును. కృష్ణకథాలంపటుఁడగు విదురుఁడు మెద లక యేకాగ్రమున భగవచ్చరిత్రలను వినుచున్నంత సేపు ఉద్ధవుఁడు హరి గుణగణములను గానము చేయుచుండెను. లీలాగానము గౌణము. లీలల నుదాహరణ రూపముతో నాతఁడు చెప్పుచుండెను. ఇప్పుడాతఁడు భగవానుని దయాళుత్వమును వర్ణించుచున్నాఁడు.

ఉద్ధవుఁ డిట్లనెను:— "విదురా! కమలాక్షునకుఁ గర్మబంధమే లేకున్న నింకఁ గర్తవ్యమేమున్నది? అక్రూరుఁడాతని గంసని యోగంబు మధురాపురికిఁ గొనిపోయెను. అచ్చటికి వెళ్ళి యాతఁడు యదువంశ కంటకుఁడగు గంసుని జంపి, కారాగారములో క్రుగ్గుచున్న తల్లిదండ్రులగు దేవకీ వసుదేవులను సమీపించి. చేతులు జోడించి వినయభావముతో నిట్లనెను:— "పూజ్యుఁడవగు నోజనకా! మమతామయమగు జననీ! మమ్ముల దయజూడుఁడు. మా యపరాధముల వైపు దృష్టి సారింపకుఁడు. మేము చాల యపరాధము లొనర్చితిమి బాల్య, పౌగండ, కైశోర, యువావస్థలు తల్లిదండ్రుల యధీనములో నుండును. యువకుఁడు కాఁగానే స్వతంత్రుఁడగును. అప్పుఁడిక నింటిలో నుండక బయటనుండి వచ్చినవారి యధీనమగుచుండును. అప్పుడు వారు తల్లిదండ్రుల యధీనముగాక భార్యాధీనుఁడగును. ఆతఁడే తండ్రియగును. బాల్యకాలమున నైదువత్సరములవఱకు గల సుఖ మాపైన నుండదు. పౌగండము (అయిదు మొదలు పదిసంవత్సరముల వఱకు)లో నుండు సుఖము, కిశోరావస్థ (పది మొదలు పదునైదు వత్సరముల కాలము)లో నుండదు. పదునైదు వత్సరముల తర్వాత యువావస్థ వచ్చును. తల్లిదండ్రులకు పరమసుఖమును గలిగించు మా బాల్య, పౌగండావస్థలు వ్రజములోననే గడిచినవి. మీ కేమియును సేవ చేయఁజాలక పోతిమి. ఇందుకు మా వశమున నేమియును లేదు. మేము కంసునకు భయపడితిమి. కావున మేము స్వయముగ సేవావంచితులమైతిమి. మిమ్ముల నానందింపఁ జేయఁజాలక పోతిమి."

విదురా! భగవానుని యీ మాట లింకను జ్ఞాపకమున్నవి. అవి జ్ఞాపకమునకు వచ్చినప్పుడు నా హృదయము ద్రవించుచుం

షును, ఎవని భ్రుకుటి విలాసముచేతనే సమస్త సూఢారము నిమి
షములో నశించిపోయెడిదో అట్టి యాతని లోకోత్తర పరాక్రమ
మెట్టిది? ఆతని చరణారవింద పావన పరాగ గంధ సేవనము చేసి
నవాఁ డెవఁడు త్రిలోకములందాతని మఱువఁగలఁడు ?

ఆతఁడు మాకు స్వామి, సేవ్యుఁడు, ఆరాధ్యదేవుఁడు. మే
మాతని నిత్యకింకరులము. శరణాగతులము. భక్తులము. దాసులము.
సాధారణముగ నందఱును దమ్ము సేవించువారి యం దనురాగ
ముంచుచుందురు. కాని యీతఁడో తన సమీపమునకు వచ్చు విరా
గులు, రాగులు, ద్వేషులు, అభిమానులు అందఱియందును గృపఁ
జూపును. మీతో నేమి చెప్పుదును? ధర్మరాజ రాజసూయ యజ్ఞ
మందు చేదిరాజగు శిశుపాలుఁడు నిండు సభలో శ్రీకృష్ణమూర్తి
నెన్నెన్ని తిట్లు తిట్టినాఁడో, ఎన్నెన్ని కఠినవాక్కులు పలికినాఁడో
నీ వెఱిఁగినదియే కదా! దానికి బదులుగ వానికి యోగు లెన్నో
జన్మములలో నిరంతరము యోగాభ్యాసమొనర్చి పొందు పదవి
నాతనికిఁ బ్రసాదించినాఁడు. ఇట్టి కృపాలుని, ఇట్టి శరణాగతవత్స
లుని వియోగము మన మెట్లు భరింపఁగలుగుదుమో నీవే చెప్పుము.

మహాభారత యుద్ధమం దీతఁడు అర్జునునకు సారథి
యయ్యెను. తన్నుఁ జూచుచు నర్జును బాణవిద్ధులై మరణించువారినిఁ
గృపాకటాక్షమునఁ జూచుచు వారికి దేవదుర్లభమగు ముక్తిని బ్రసా
దించు చుండెడువాఁడు. ఏ భావముతో నాతని సమీపించినను సం
సార సాగరమునుండి బయటపడవలసినదే.

వాసుదేవుఁడు తన భక్తుల ననుగ్రహించుటకై నీచాతి నీచ
కార్యముల నైనఁ జేసి అదియే గౌరవమని భావించుచుండును. ఆతని

మైశ్వర్యముతో నింకొకని మైశ్వర్యమును బోల్ప వీలులేదు. ఆతని ప్రబలపరాక్రమమున కీడైన పరాక్రమము కలవాఁడు లేఁడు. ఆతఁడు పరమానందస్వరూపుఁడు. స్వతః సిద్ధ త్రిగుణాతీత సాత్త్వికసంపత్తి సంపన్నుఁడగుటచేఁ బూర్ణకాముఁడు. సమస్త బ్రహ్మాది దేవతలును, ఇంద్రాది లోకపాలురును, మన్వాది ప్రజాపతులును, శూరాది శూరవీరులును, సమస్తనృపతులును శ్రద్ధాభక్తులతో, నానాప్రకారములగు బూజాసామగ్రులతోఁ బూజలు చేయుచు, తమ దివ్య మకుట మణికాంతులచే నాతని యరుణారుణ చరణములను సదా ప్రకాశింపఁజేయుచుండెడువారు. వారు ఉగ్రసేన మహారాజ సమ్ముఖమున చేతులు జోడించి నిలుచుండుటను గాంచి మా బుద్ధులు తికమకలయ్యెడివి. భగవంతుఁ డెట్టిలీలలను జేయుచున్నాఁడనియు, నరనాట్యమును జేయుచున్నాఁడనియు మేమనుకొనెడివారము. భక్తవశుఁడై ఆతఁడేమి చేయఁడు? ప్రత్యక్షాదర్శముగ నుండెడువాఁడు. ఉగ్రసేనుఁ డుచ్చ సింహాసనమునఁ గూర్చుండఁ దాను భృత్యునివలె నన్యసేవకులవలె శిష్టాచారమున నిట్లు నివేదించెడివాఁడు;— "దేవా! మా యీ ప్రార్థన నాలకింపుడు, ఈ విషయమును విచారింపుఁడు." ఇట్లు పలుకుచుండ మేము లజ్జించెడువారము. దాసదాసులమను లజ్జ కాదు మాకు. మా స్వామి ఆదర్శముగ సేవాభావమును బ్రదర్శించుచున్నాఁడే, అందులో శతాంశమైన మాకు లేక పోయెననియే మాకు లజ్జ. మేము నామమాత్రపు సేవకులము.

విదురా! శిశుపాలుఁడు మేనత్త కొడుకని నీవనవచ్చును. అత్తకు వాని నూఱపరాధములను మన్నింతునని మాట నిచ్చియుండెను. ఉగ్రసేనుఁడు తాతయేగదా! సంబంధములోఁ బెద్ద,

గురువు. వీరి నందఱ ననుగ్రహించిన నేమి గొప్పకార్యము ? గ్రుడ్డివాఁడు జీళ్లు పంచిన దన యింటివారికే పెట్టును. కావున వీరినందఱ నుద్ధరించుటలో భగవానుని విలక్షణత యేమియును లేదు. శత్రువు ననుగ్రహించినచో గొప్పగాఁ జెప్పవలయును. విదురా ! ఇట్టి దృష్టాంతము లెక్కకు మిక్కిలిగఁ గలవు. తాను తన చక్రధారచే సంహరించిన అసురు లందఱకును ముక్తినిఁ బ్రసాదించెను. వారికి హృదయములో భక్తి కలదని నీ వన వచ్చును. అదియును లేదు. భగవంతుఁడు భక్తుని యపరాధ ముల వైపు చూడనే చూడఁడు. ఆతని కెప్పుడు నాతని భక్త వత్సలతా బిరుదమే జ్ఞాపకముండును. ఆ బిరుదుకు వ్యతిరేకముగఁ గార్యముండరాదని యాతని యాశయము. చూడుఁడు, పూతన చేసిన పనియేమో ? అది పుట్టిన దినముల లోపలనే పిల్లల నంద ఱను బొట్టను బెట్టుకొనుచుండెను. ఒకరిని గాదు. ఇద్దరను గాదు వేలకొలఁదిమందిని. అసంఖ్యాకులను బొట్టను బెట్టుకొన్నది. పోనిండు, దాని జాతి గొప్పదందుమా అదియును గాదు. జాతికి అది రాక్షసి. రాక్షసులలో భక్తులుండరాయని మీరనవచ్చును. ప్రహ్లాద, విభీషణ, బలి, బాణాసురాదులు రాక్షసులు కారా ? రాక్షసులైనను సదాచారులా ? భోజనమేమైన విశుద్ధమైనదా ? భోజనమా పసిపిల్లల లేత రక్తము. అందఱకును స్వాభావికముగఁ బ్రేమపాత్రులైన యా పసికూనల హృదయమునఁ గూర్చుండి రక్త పానము చేయును. దయాహీనయై పసిబిడ్డలను తల్లినుండి వేఱు చేయును.

రాక్షసియు, నమేధ్యభక్షణము చేయునది యైనను శుభ సంకల్పమున శ్రీపతి సమీపమునకు వచ్చియుండవచ్చునని మీరన

వచ్చును. అట్లు గాదు. చన్నులకుఁ గాలకూట విషమును బూసికొని కృష్ణునిఁ జంపుటకు వచ్చినది. అయినను దానిని నరకమునకుఁ బంపలేదు. దుర్గతి కలిగింపలేదు. ఆతఁడు తన ప్రతిజ్ఞను దలఁచుకొనెను. ఇది సమీపమునకు వచ్చినది కావున దీనికి ముక్తి నిత్తు ననెను. సాంసారికవ్యక్తులను వీడి తన సమీపమునకు వచ్చినవారిని దనలోఁ గలుపుకొనును. వేషము దాది వేషము. దాని మనస్సులోఁ గపట మున్నప్పటికిని, కపటియే కపటమును గుర్తించును. భగవంతునకుఁ గపటము లేదు. కావున నాపని కా కపటమువైపు దృష్టియేలేదు. రాఁగానే ఆమె చనుగుడిపినది. పాలర్పించినది. ఈవిధముగ నామె పూజకూడ కావించెను. ఆమె పాలలో విషము కూడ కలిపి యిచ్చినదని పాపమనస్కులు తలఁపవచ్చును గాని భగవానుఁడు పుణ్యపాపముల కతీతుఁడు. కావున నాతని సమీపమునకు వచ్చుటయు, దాదిరూపమును ధరించుటయు, పాలిచ్చుటయు అనునీ కారణముల వలనఁ దన సవతి తల్లికిఁ బుణ్యగతి నొసంగెను. ఆమె కింక జన్మ లేకుండఁ బోయినది. పవిత్రతాహీనను పూతను గావించెను. తాను బుత్రుఁడై, ఆమె మరణించిన తర్వాత వ్రజవాసులచే దహనము కూడ చేయించెను. ఆకాశచారులగు రాక్షసులు గుప్తముగ నుందురు. తనకు విషముపెట్టిన తల్లి శ్రాద్ధముకొఱకు రాక్షసులకు భోజన మిడుటకు శ్రీకృష్ణుఁడు శకటభంజనము కూడ కావించెను. అట్లు రాక్షసులను దృప్తులఁ గావించెను. ఇట్టి దయాళుని వీడి యెవ్వని శరణు వేఁడవలయును ?"

---

# ఆత్మారాముని రమణీయక్రీడలు

శ్లో॥ కౌమారీం దర్శయన్ చేష్టాం ప్రేక్షణీయాం వ్రజౌకసామ్,
రుదన్నివ హసన్ముగ్ధబాల సింహావలోకనః॥
స ఏవ గోధనం లక్ష్మ్యా నికేతం సితగోవృషమ్,
చారయన్ననుగాన్ గోపాన్ రణద్వేణు లరీమత్॥

— శ్రీభాగ. ౩ స్కం. ౨ అ. ౨౮, ౨౯ శ్లో.

ఉ. శ్రీరమణీ మనోవిభుఁడు సింహకిశోరముఁబోలి లీలఁ గౌ
మారదశన్ రమావిమల మందిరముం బురుడించు గోతతిన్
వారక మేపుచుండెఁ దన వంశ రవస్ఫుట మాధురీ సుధా
సారముచేత గోపజనసంఘములన్ ముదమందఁజేయుచున్.

— శ్రీమదాంధ్రమహాభాగవతము.

—•(.)•—

స్వభావము విడువరానిదని చెప్పఁబడినది. సచ్చిదానంద స్వరూపముగల ప్రభువు నిత్యానందములో మగ్నుఁడగుటయే స్వభావము. ఆతఁ డే వేషమందు దాగినప్పటికిని, ఏ ప్రదేశములో విశిష్టమూర్తిధారణ గావించినప్పటికిని ఆ సహజ స్వభావము పోదు. ఆతని చేష్టలన్నియు సుఖమయములును, ఆనందమయములును. వాని నితరులు చూచిన నపారసుఖము కలుగును. ఆతఁడును క్రీడవలన ముగ్ధుఁడగును. ఉద్ధవుఁ డిట్లనెను :— "విదురా! మథురలోని కారావాసమునుండి దొంగయై భయపడి పాఱిపోయి వచ్చిన తర్వాత పదునొకండు వత్సరములాతఁడు అడవిగొల్లలఁ గూడి వ్రజమండలమందలి వనోపవనములందుఁ

దిరుగుచుండెను. బలరాముఁడు కూడ వెంటనుండెను. అసంఖ్యా కులగు చిన్న చిన్న గోపకుమారు లాతనికి సఖులు. చాలమంది వ్రజబాలికలు, వ్రజాంగనలు ఆతని సహచారిణులు. అక్కడ నీతఁడు తన బాలలీలా సుషమను వ్యాపింపఁజేసెను. అప్రా కృతిక దివ్యబాలకునియొక్క మనోహరమును జిత్తాకర్షకము నగు లీలలన్నియు నాతఁడు వ్రజవనములోఁ బ్రదర్శించెను. ఆ వ్రజ గోపబాలకులు ధన్యులు, వందనీయులు, పూజనీయులు; ఏల ననఁగా వారితోడనేగదా శ్యామసుందరుఁడు అతి మనోహరమగు బాల్యక్రీడ లొనర్చినది! గోప, గోపీ, గోపాలబాల, గోగణము లన్నియు నాతని సహచరులగుటచే వందనీయులు. మనము చక్రాయుధునిచే మడిసిన దైత్యదానవులకు గూడ వందనము చేయ వలెను. ఏలయనఁగా వారు గరుడారూఢుఁడైన జగద్వంద్యుఁడగు విష్ణుమూర్తిని దర్శించిరి. ఎట్లైన నుండనిండు, వారును భగవ ద్భక్తులే. భేదమేమి యనఁగా వారు ద్వేషభావముతో భగవంతుని భజించిరి. గోప గోపీగణ మాతని స్నేహ ప్రేమ భావముతో నర్చించిరి.

వసుదేవుఁడు ఈతనిని నందభవనమున విడిచివచ్చినది మొదలు నిత్యము 'నందానంద ప్రదాతయగు కృష్ణునకు జయ' యను జయజయ శబ్దములు మారుమ్రోగెను. అచట కంటక వృక్షములు గల వనములోఁ జరించుటయు, వ్రజరజమును దన శరీరమునకుఁ బూసికొని దిగంబదావధూత చర్యను బ్రదర్శిం చెడువాఁడు. కొంచెము పెద్దవాఁడైన తర్వాత తల్లిదండ్రుల చేతులను బట్టుకొని తప్పటడుగులు వేయుచుఁ జిందులు ద్రొక్కుచు నడచెడువాఁడు. ఇంకను గొంచెము పెద్దవాఁడైన తర్వాత గొల్ల పిల్లలతో యమునాతరంగిణీ పుణ్యపులినములందు వ్రజమండలము

లోని వందనీయవనములందు అవుదూడలను మేపఁబోవుచుండువాఁడు. వత్సములెట్లు శుభ్ర స్వచ్ఛములో శోభాయుక్తములో నీతఁడును నట్లే మనోహరముగ నుండెడువాఁడు. అవి తెలుపు, ఈతఁడు నలుపు. అవి చతుష్పాత్తులు, ఈతఁడు ద్విపాదుఁడు. అవి యీతనిని ప్రేమించుచుండును, ఈతఁడు వానిని బంధువుగా నెంచుకొనును. ఈతఁడు వాని శరీరములను గోఁకుచు, నిమురుచు, తట్టుచు పచ్చిక మేపుచు, మెడను గౌగిలించుకొనును. అవి యాతనిని నాకుచు తమ బుల్లి కొమ్ములతోఁ బ్రేమతోఁ గుమ్ముచుండును. నిత్యవసంతవిహారమగు బృందావనమున నీ బృందావన విహారి గోవత్సముల మధ్యను, గోపవత్సముల మధ్యను బెరిగెను.

ఇఁకఁ గొంచెము పెద్దవాఁడైన తర్వాత గోవులను, కోడెలను దీసికొని మేపఁబోయెడివాఁడు. ఆతని యాకృతి యెట్టి యమాయకమైనది! ఆతని శరీరము సుందరమైనది, బలిష్ఠమైనది. ఆతని అంగ ప్రత్యంగములన్నియు నిమ్నోన్నతములు. తీరుగ నున్నవి. సింహకిశోరమువలె నిక్కి నడుచును. రాజహంసవలె చరణ నూపుర ధ్వనులు కావించును. అతఁడటునిటు నందఅను ముగ్ధులఁ గావించుచు పదత్రాణములు లేకయే భూమిమీఁద సంచరించును. ఆతని పాదము లతి సుకుమారములు. అవి నొచ్చునని పృథివి లజ్జితయై, కరగిపోయి ఆతని చరణచిహ్నములను దన హృదయములో దాఁచుకొనును. ఆతడు బాలవినోదములో దప్పటడుగులు వేయుచు నాడును. చెవులమీఁదఁ జేయియుంచుకొని యుచ్చైస్స్వరమున బాడును. ఒక్కొక్కసారి కఱ్ఱ త్రిప్పును. ఒక్కొక్కప్పుడు చెట్ల నెక్కును. వేఱొకప్పుడు ఇంకొకని భుజములపై నెగిరియెక్కును. ఇంకొకరితోఁ బోరాడును. ఒక్కొక్కప్పుడు విచిత్ర వేషమును వేసికొని వివిధక్రీడ లొనర్చును.

ఆతని మామ కంసుడు ఆడుకొనుట కెన్నో ఆటవస్తువులను బంపెను. ఆ యాటవస్తువులు భయంకరములు - వానివైపు ఆతఁడు చూడనైనఁ జూడలేదు. ఆతఁడు పంపినది ఆడుకొనుటకుఁ గాదు, అనిష్టమునకనియైనఁ దలఁపలేదు. ఆతఁడే భావముతోఁ బంపినదియు విచారించుట వ్యర్థమనుకొనెను. పంపినాఁడు. అంతే చాలును. స్వార్థులమగు మనము మన సౌకర్యముకొఱకు మంచి చెడ్డలని యేర్పఱచుకొంటిమి. లోకములో మంచివారును లేరు, చెడ్డవారును లేరు. ఇవన్నియు శ్యామసుందరునివే. ఆతఁడు మంచివాఁడు కావున నాతని వస్తువులన్నియు మంచివియే. తాను శివస్వరూపుఁ డైనప్పుడు ఆతఁ డశుభసృష్టి నేల కావించును? మన మెవరిని జెడ్డవారందుమో, వారివలనఁ బ్రయోజనమును బొందువారు వారిని మంచివారందురు. శ్రీకృష్ణుని శిశుపాలుఁడు చీవాట్లు పెట్టెను. ఆతఁ డా తిట్లనే అంగీకరించెను. పూతన విష మొసంగెను. దానినే త్రాగినాఁడు. సుదాము డటుకులు పెట్టినాఁడు. ఆతఁడు వానినే నమలెను. దుర్యోధనుఁ డాతని సమ్ముఖమున గౌరవమును బ్రదర్శించెను. ఆతఁ డాతని గౌరవమును వమ్ముచేసి ఆతనిని గ్రహించినాఁడు. కంసుడు చంపుటకే అనుకొనుడు రాక్షసులను బంపెను. మామపంపిన వస్తువులను మరలఁ ద్రిప్పి పంపుటెట్లు? ఇది శిష్టాచార విరుద్ధము. ఇచ్చిన వస్తువును ద్రిప్పి పంపరాదు. మామ పంపిన కానుకలను గ్రహించుట మేనల్లుని కర్తవ్యము. మామ పంపిన రాక్షసు లెంత మంది మాధవునిదగ్గఱకు వచ్చినప్పటికిని మరల తిరిగి పోనీయలేదు. కొంచెముసేపు వారితో నాడి చివరకు చావఁజిదుగఁగొట్టి వ్రజములో వదలిపోయెను.

కాళియుఁడు కమలాక్షునిఁ గలిచి కాయమంతటను విషమును నింపఁదలఁచెను. ఆతఁడు విషహారి. విష మాతని నేమి చేయఁగ లదు? గాళియదమనము గావించి ఆతనితో నిట్లనెను:– "నీ వీ యమునానుండి లేచి వెళ్ళిపోవలయును. ఇక్కడనుండి రమణకద్వీపమునకుఁ బోవలయును. గోవుల యొక్కయు, గోపకులయొక్కయు విషమును దింపవలెను. కాళియ హ్రదములోని నీరు పరమస్వాదువుగనై గోవుల గోపికలు త్రాగఁదగినట్లుండవలయును."

విదురా! వాసుదేవుఁడు బాఁలుడైనను తనకంటెఁ పెద్దవారలకు చక్కని నీతులను గఱపినాఁడు. ఇంటిలో ధన మధికమైనను, నౌకలో నీరు నిండినను బుద్ధిమంతుఁడగువాఁడు వానిని తోడి పారఁబోసి తేలిక చేయవలయును. అట్లుకాక యీ వస్తువులను లోభవశమున నిలువయుంచినచో బరువెక్కువై నౌక మునిగిపోఁగలదు. మన మావలకు దాఁటలేక పోవుదుము. కావున ధనమున్నందులకు ముఖ్యముగఁ జేయవలసినది శ్యామసుందరుని భజించుటయును, ఆతని కభిన్న విగ్రహులగు సర్వశ్రేష్ఠులగు బ్రాహ్మణులకు సమ్మానములను గావించి దానధర్మములద్వారా సంతుష్టి చెందింపవలయును. వివిధ యజ్ఞములద్వారా పురాణపురుషుని బూజింప వలయును. ఇట్లు చేసిన నిహలోక పరలోకములు లభించును.

భగవంతుఁడు వ్రజములోఁ బుట్టినదిమొదలు సమస్త వ్రజమండలము లక్ష్మికి క్రీడాస్థలమైనది. అచ్చటికివచ్చి లక్ష్మీదేవి బహిరంగముగ నాడసాగెను. లక్షలకొలఁది గోవుల వెన్నను దాఁచుటకే స్థలము దొరకలేదు. అప్పుడు భగవానుఁడు ఇంద్రపూజను మాన్పించి గోవర్ధనపూజను జేయించెను. ఇంద్రపూజ నేల మాన్పింపవలసివచ్చినదని మీరడుగ వచ్చును. ఇంద్రుఁడు దేవతల

కథపతికాఁడా? ఆతఁడు పూజార్హుఁడు కాఁడా యేమి? యనియు నడుగవచ్చును. కా కేమి? అవశ్యము పూజార్హుఁడే, ఆతఁడు దేవతలకు రాజు. వర్ణాశ్రమాచారపరు లాతనిఁ బూజింపతీరవలెను; కాని ఆతని లాత యెదురుగఁ గూర్చుండినప్పుడు ఆతని పూజ జరుగకున్నను బాధలేదు. ఇఁక రెండవలీల ఆతనిగర్వము సణఁచుటయును, ఆతని దండించుటయును, ఆతనికి పై నింకొక డున్నాఁడని యాతనికిఁ దెలుపుటయు జరగవలసి వచ్చినిది. ఇంద్రుని పొరపాటేమి యనఁగా భగవంతునిగూడ సామాన్య గోప బాలకుఁడని తలఁచుటయును వానే సర్వశ్రేష్ఠుఁడనను గర్వమును కలిగి యుండుటయునే. కావున గర్వహారియగు భగవంతుఁడు వాని గర్వమును ఖర్వమొనర్చుటకే యిట్టి క్రీడను వినోదమును రచించెను. గోపకులు భగవదాజ్ఞను శిరసావహించి యింద్రస్థానమునఁ బ్రత్యక్షదేవుఁడగు హరిదాసవర్యుని గోవర్ధనునిఁ బూజింపఁగా నింద్రుని కోపమునకు మేర లేకుండెను. ఆఁకలిగొన్న పులి తనకుఁ గోపము దెప్పించినవానిని సర్వనాశము గావించి మ్రింగఁదలఁచినట్లు ఇంద్రుఁడు సమస్త వ్రజమండలముతో నందనందనుని నాశనము చేయ నిశ్చయించి ప్రళయవర్షమువలె కుండపోఁతగా వర్షమును గురియించెను. భగవానుఁడు నవ్వుకొనెను. ఆతఁడు గొడుగు కొఱకై వెదకుచుండెను. వ్రజవాసులయొద్ద గొడుగులున్నవి. కాని గోగోప గోపీ గోపకుమారుల నందఱకును గప్పుటకు వీలైన ఛత్రము లేకుండెను. మూర్తిమంతమైన గోవర్ధనము తిండి మెక్కి మెక్కి బలిసియుండి భగవానుని యభిప్రాయమును గ్రహించి యెగిరి, శ్రీకృష్ణుని చేతిలోనికి వచ్చెను. ఆతఁడు వానిని తన చిటికెనవ్రేలిమీఁద నిలుపుకొని వర్షమునుండి కాపాడి కరుణావశమున నందఱను రక్షించెను. తన శ్రీహస్తముతో ఛత్రచ్ఛాయను

# మ థు రా పు ర లీ ల లు

శ్లో॥ తతః స ఆగత్య పురం స్వపిత్రో
శ్చికీర్షయా శం బలదేవ సంయుతః,
నిపాత్య తుంగాద్రిపుయూథనాథమ్
హతం వ్యకర్షద్వ్యసుమోజసోర్వ్యామ్॥

— శ్రీభాగ. ౩ స్కం. ౩ అ. ౧శ్లో.

ఉ. రాముఁడు దానుగూడి మథురాపురికిం జని యందు వైభవోద్దా
మన్నృపాసనంబున ముదంబునున్న దురాత్ముఁ గంసు దుష్టామర
శత్రుదుంచి ముదమారఁగఁ దల్లిని దండ్రి నంచిత శ్రీమహిళా
త్ములై తనరఁజేసె సరోరుహనాభుఁ డున్నతిన్.

— శ్రీమదాంధ్రభాగవతము.

—(•*•)—

భూమి గోళము. సంసార చక్రము మాటిమాటికి పరిభ్ర మించు చుండును. నేఁడు మనము దేనిని వీడిపోయితిమో కాలాం తరమున మనము మరల నచ్చటికే చేరుకొందుము. నిన్నటివరకు మనము దేనికి భయపడితిమో నేఁడదియే మనకు భయపడును. నిన్నటివఱకు దేని భయము వలనఁ జక్రవర్తులును గంపించిరో నేఁ డదియే సాధారణ మానవులచేతనే యవమానమును జెందును. ఇది యంతయుఁ గాల మహిమ. కాలము భగవానుని క్రీడ. బలాబలము లొసంగువాఁడు కాలదేవుఁడు. అది ఆతని కుటిలగతి. దీనిని జూపించుటకే భగవంతుఁడు మానవోచిత క్రీడ లొనర్చుచుండును.

ఉద్ధవుఁ డిట్లనెను:– "పదునొకండు వర్షములవరకు భగవానుఁడు వ్రజమందుఁ బ్రకటమై లీలలచే వ్రజవాసులను, వ్రజాంగనలను దన సంయోగసుఖము నాస్వాదింపఁజేయు చుండెను. తర్వాతఁ దన ప్రకటలీలలను వ్రజమునుండి యుపసంహరించెను. వ్రజవాసుల హృదయములనుండి యవి యెట్లు పోఁగలవు ? వారి హృదయములలో నవి సదా నివసించుచుండును. వారితో నాతని నిత్యలీలలు జరుగుచునే యుండును. కాని లోకమునకుఁ జూపుట కాతని మామ పిలుపు నాదరించి అక్రూరునితో మథురాపురికి బోయెను.

కంసమామను జంపుటకుఁగదా యాతఁడు వెళ్ళినదని మీర డుగవచ్చును. ఆతఁడు కసి దీర్చుకొనవలసిన యావశ్యకత యే మున్నది ? మానావమానదృష్టి గలవారును క్రోధము గలవారును కసిదీర్చుకొనవలయును. శ్రీకృష్ణుఁడు దేవకీ వసుదేవుల కానందము గలిగించుటకు వెళ్ళినాఁడు. వారి కోర్కెను దీర్చుటకు వెళ్ళినాఁడు; ఆతని కార్యము లన్నిటికిని తన భక్తులకు సుఖము లభించుటయే పరమోద్దేశ్యముగ నుండును. మథురాపురవాసినులగు నారీమణులు బృందావన విషయములను వినుచుండినను, వ్రజాంగనల యనుపమ ప్రేమచర్చలు వారి కర్ణకుహరముల బడినప్పుడు "అయ్యో ! మన మా సౌందర్య మాధుర్య సజీవ సాకారమూర్తిని జూడఁజాలక పోతిమే, ఎన్నటికైన నీ చర్మచక్షువులతో శ్యామసుందరుని జూచు భాగ్యము లభించునా" యని పరితాపబడుచుందురు. మథురానగరనివాసులగు పురుషులు గోపకుల సౌభాగ్య సమాచారము విని యిట్లనుకొనుచుండెడివారు :– "ఎన్నటికైన నా నటసాగర వ్రజ నవచంద్ర ఘనశ్యాముని సౌందర్యమును గాంచు

సౌభాగ్యము కలుగునా ? మల్లులు శ్రీకృష్ణుని మల్లయుద్ధ కౌశల్యము నుగూర్చి వినినప్పుడు వారి భుజము లదురుచుండెడివి. వారును శ్రీకృష్ణునితో నెప్పుడైన నాతని శరీరము మా శరీరము తాకునట్లు మల్లయుద్ధము చేయుదుమా యని యనుకొనుచుండెడివారు. పశుబలమునఁ బడియుండిన మనము ద్విపదపశువులకుఁ గృపాసాగరుఁడగు శ్యామసుందరుఁడు వచ్చి మనల నుద్ధరింపఁగలఁడా?" యని యనుకొనుచుండెడువారు. కంసమామ నిద్రించుచు, మేల్కొనుచు, లేచుచుఁ, గూర్చుండుచు, తినుచుఁ, దిరుగుచు, త్రాగుచు, నిద్రించుచు వేయేల సర్వకాల సర్వావస్థలయందు నాతనినే ధ్యానించుచుండెడు వాఁడు. "ఇంకను రాలేదుగదా ! శ్యాముఁడు నాకు గాలుఁడు. కృష్ణుఁడు నన్నెప్పుడు చంపును ? నా కాతనివలననే చావు" యని యనుకొనుచుండెడువాఁడు. భయవ్యాకులుఁడగు మామ మేనల్లునే ధ్యానించుచుండెడువాఁడు. తన కొడుకు పెద్దవాఁడైనాఁడనియు, అసురులను ముష్టిప్రహారములచేఁ జంపు చున్నాఁడనియు దానవులను లీలగఁ జంపఁగలఁడనియు వసుదేవుఁడు వినఁగానే యాతని యానందమునకు మేఱలేకుండెను. నిరుడు శ్రావణ బహుళ అష్టమికి మా బిడ్డకు పదివత్సరములు. ఈ అష్టమికి పదునొకండవ సంవత్సరము పూర్తికాఁగలదు. నేను నా బిడ్డను హృదయమున గౌఁగిలించుకొని, ప్రేమించు శుభదినము, ఆ మంగళముహూర్తమెప్పుడు రాఁగలదు ?

ఇచ్చట తల్లి రాత్రింబవళ్లు తన నూతన జలధర శ్యామాభుఁడగు బుత్రుని స్మరించుచుండెడిది. ప్రేమచే నామెకు చేఁపు వచ్చెడిది. విహ్వల యగుచుండెడిది. ఆమెకు క్షణక్షణము భారముగఁ దోఁచుచుండెడిది. రేపుప్రొద్దున తన తనయుని జూడఁగలుగుదునను

నాశతోఁ బ్రతీక్షతో నిద్రించెడిది. నిద్ర లేవఁగానే ఆమె బృందా వనము వైపునకుఁ జూచుచుండెడిది. ప్రొద్దెక్కినకొలఁది ఆమె ముఖము మ్లానమగు చుండెడిది. భువనభాస్కరుఁడు అస్తాచలమునకుఁ బ్రస్థానము కాఁగానే ఆమె నేఁటి కింక యేమిరాగలఁడని నిరాశ చెందెడిది. ఇఁక రేపు వచ్చుననుకొనుచుండెడిది. ఈ విధముగ దిన రాత్రులు, సప్తాహములు, పక్షములు, మాసములు, ఋతువులు, అయనములు, వర్షములు గడచిపోయినవి. ఇట్లు రోజులు లెక్కించుకొనుచు పదు నొకండు వత్సరము లీ చింతలోనే గడిపెను.

"పూర్వకాలమున దేవతలు సాందీపునితో 'స్వయముగ పరబ్రహ్మ నీకు శిష్యుఁడగును. నీ దగ్గరకు అవంతీ పురమునకుఁ జదువ వచ్చు"నని చెప్పిరి. ఆతఁడు కాశీబ్రాహ్మణుఁడు. అక్కడే పుట్టి, అక్కడే చదివెను. ఇప్పు డవంతీపురమునకు వచ్చుననఁ గానే అవంతీపురమునకు వెళ్ళి కాపుర ముండెను. అవంతీపురము వ్రజమునకు దగ్గఱనే కలదు. ఆ బ్రాహ్మణుఁడు కాశీనుండి వచ్చి భార్యతోఁగూడ అవంతీపురములోఁ గాపురముండెను. దూరదూర ములనుండి శిష్యు లాతనిదగ్గఱకు వచ్చుచుండిరి. కాని భగవానుఁ డింకను రాలేదు. రాత్రింబవళ్ళాతని కిదియే చింత. వీరందఱు భగ వానున కనేక జన్మలలో భక్తులు. చాతకము స్వాతిబిందువుల కొఱకై ప్రతీక్షించుచున్నట్లు వారందఱును భగవంతుని కొఱకు ప్రతీక్షించు చుండిరి, ఘటఘటవాసియగు భగవంతుఁడు వారి యుత్సుకతను బెంచుటకు వ్రజములో నాడుచుండెను. వీరి యుత్కంఠత పరాకాష్ఠను బొందినపుడు తన యన్నయగు బల రామునిఁ గూడుకొని, రథము నెక్కి అక్రూరునితో మూట ముల్లె కట్టుకొని మథురాపురికి వచ్చెను. మథురావాసులగు నరనారీమణులు ఆతని యనుపమ సౌందర్య మాధుర్యరూప సుధను అతృప్తులై

ఉత్సాహముతోఁ బానము గావించిరి. సభలో నాసీను లైనవారు సజీవ సౌందర్యమునకు స్వాగత మొసంగిరి. చిరాభిలషితవస్తువు నేత్ర సమ్ముఖమున నుండుటచే వారి హర్షమునకు మేఱలేకుండెను. మల్లులు శ్యామసుందరునితోఁ జేతులు కలిపి నవనీతసమానమగు నాతని కోమలశరీరమును స్పర్శించి, దానిని గట్టిగా బిగించి పట్టుకొని కౌఁగిలించుకొని వత్తిరి. ఆ మహాభాగులగు మల్లుల భాగ్యము నేమని వర్ణింపగలము ! ఒక్కసారి యాతని శరీరమును స్పర్శించుటకు వ్రజాంగన లెన్నెన్నియో వ్రతములు, ఉపవాసములు, జపములు, తపములు కావించిరి. అట్టి శ్యామసుందరుని శరీరమునం తను గౌఁగిలిలో నింపుకొని బలపూర్వకముగఁ బీడించిరి. శ్యామసుందరుఁడు వారిపై నెక్కి తన కోమల కరకమలములతో వారిపిఁ బ్రహారము కావించెనుఁ శ్యామసుందరుఁ డెవనిఁ దనవానిగాఁ జేసికొనెనో ఆతఁడీ శోక మోహపూర్ణమగు సంసారమున నుండి యేమి చేయఁగలఁడు ? భగవానుడు వారిని సుఖమయ ఆనందమయ ధామమునకుఁ జేర్చెను.

మామకు మాత్రము 'కొట్టు, కొట్టు' అను నీ రెండు శబ్దములే జ్ఞాపకము. 'పట్టుకో, కొట్టు, చిత్తుచేయుము' అనియే మాటి మాటికి పలుకుచుండెను' 'వీఁడు నన్ను జంపును. వీఁడు నాకు కాలుఁడు. ఇదియే ఆతని దృఢధారణ. భగవానుఁ డందఱి హృదయము నెఱుఁగును. కావున నెత్తైన మంచెపైఁ గూర్చుండిన మామను క్రిందకీడ్చి యాతని భావనానుసారముగ జంపెను. ఆతఁ డిట్లనుకొనెను ;— 'మామ అభిమాని. ఆతఁ డెన్నఁడును సాష్టాంగము చేసియుండఁడు. సాష్టాంగ నమస్కారము చేయక శరీరమునకు వ్రజ రజ మంటదు. వ్రజ రజము శరీరమున కంటకున్న

నుద్ధారమే లేదు. ఈతనికి ప్రజ రజాభిషేకము కాకున్న దుర్గతి కలుగు'నని చంపగానే రెండుకాళ్ళను బట్టుకొని మథురాపురములోని సందుగొందులలో పిల్లలు ఆటబండి నీడ్చినట్లీడ్చెను.

బందీగృహములోఁ బడియుండిన తల్లిదండ్రులను సంతుష్టులఁ గావించెను. బృందావనములో వీథిబడి లేదు. అచ్చట పగలంతయు గోవులను గాయుటయును రాత్రులందు నిద్రించుటే గాని చదువు పనియే లేదు. అక్కడ ఆవులను లెక్కపెట్టవలసి వచ్చెడిది. అయితే మాలయొక్క గింజలతో లెక్కించుట మాత్రమే నేర్చుకొనెను. అందువలన నాతఁడు నిరక్షరాస్యుఁడుగనే యుండెను. పిల్లలకు చదువు లేకుండిన పెండ్లికాదు. చదువని వారికి పిల్ల నెవరిచ్చెదరని తమకిష్టము లేకున్నను నవంతీపురమునకు తల్లిదండ్రు లిద్దరిని చదువుటకుఁ బంపిరి.

వీరిద్దరును భగవంతులని సాందీపుఁడు చూచుటతోడనే గ్రహించెను. ఒక్కసారి చదువఁగానే పాఠమంతయుఁ గంఠస్థమయ్యెడిది. దీనిని బట్టి వీరిద్దరు పురాణపురుషులని యాతఁడు గ్రహించెను. చదువుట వ్రాయుట లోకసంగ్రహము కొఱకే. వీరన్నియుఁ జదివినవారే. వీరు చదువవలసినది లేనేలేదు. అన్నిటికంటె తాను గురువుకావలెననుకొను లోభము లోభములన్నిటిలో గొప్పది. మూర్ఖాతిమూరుని వద్దకైన వెళ్ళుఁడు, వాని నడిగినవాడును గురువు కాగలఁడు. ఎవడైన శిష్యుఁడై మన వలలోఁ బడిన బాగుండునని అందఱు ననుకొనుచుందురు. ఉపదేశముచేయు యోగ్యత లేకున్నను తనదగ్గఱకు వచ్చెనా బ్రహ్మకంటె నింక నాల్గుచేతు లెక్కువ చూపించును. ఈ దేవదుర్లభ

పదవిని నేల పీడవలయునని సాందీపుఁ డనుకొనెను, అరువదినాల్గు విద్యలు అఱువదినాల్గు దినములలో వినుటచేతనే నేర్చి గురుదక్షిణను గోరుమనఁగా వృద్ధబ్రాహ్మణుఁడు తికమకపడి సర్వసమర్థుఁడగు నీశ్వరునేమడు గుదునని యాలోచించి యింటిలోనివారిని సలహా అడిగెను. స్త్రీలకు అన్నిటికంటె సుఖపస్తువు సుతసంయోగము. అన్నిటికంటె దుఃఖము పుత్రవియోగము. గురుపత్ని చచ్చిన పుత్రుని మరల నొసంగుమని కోరెను. భగవంతుడు చచ్చిన పుత్రుని దెచ్చియిచ్చి మథురాపురమునకు వచ్చెను.

చిన్నతనములో పడిన యలవాటు చివరవఱకును బోదు. పుట్టుకతోడనే పిఱికివాఁడయ్యెను. మథురను వదలి గోకులమునకుఁ బాఱిపోయెను. ఇప్పు డిక్కడనుండియుఁ బాఱిపోయి సముద్ర మధ్యమున ద్వారావతియందు కాపురముండెను."

ఉద్ధవుఁ డిట్లనెను ;— "విదురా! భగవల్లీలకు కారణము లేదు, హేతువు లేదు. ఆతఁ డానందరాశి. ఆ రాశినుండి బయలుదేరినవన్నియు సుఖదములే కాఁగలవు. కావున నాతని ప్రతిలీలయు నానందదాయకముగనే యుండును."

సూతుఁ డిట్లనెను :— "మునులారా! విదురుఁడు బృందావన మథురాలీలలను జెప్పి యిప్పుడు ద్వారకాలీలలను గూర్చి జెప్పుటకు సిద్ధపడెను."

—•—

# ద్వారావతి యందలి లీలలు

శ్లో॥ కాలమాగధ శాల్వాదీ ననీకై రుంధతః పురమ్ ।
అజీఘనత్ స్వయం దివ్యం స్వపుంసాం తేజ ఆదిశత్ ॥
శంబరం ద్వివిదం బాణ మురం పల్వలమేవ చ ।
అన్యాంశ్చ దంతవక్త్రాదీనవధీత్కాంశ్చ ఘాతయత్ ॥

—శ్రీభాగ. ౩ స్కం. ౩ అ. ౧౦, ౧౧ శ్లో.

సీ. మధురాపురముఁ జతుర్విధ బలౌఘములతో
నావరించిన కాలయవన సాల్వ
మగధ భూపాలాది మనుజేంద్రలోకంబు
సైన్యయుక్తముగాఁగ సంహరించి
తన బాహుశక్తిఁ జిత్తముల నర్థించిన
భీమపార్థులకు నుద్దామ విజయ
మొసఁగి తద్వైరుల నుక్కడంగఁగఁ ద్రుంచి
బాణ శంబర ముర పల్వలాది

తే. దనుజనాయక సేనావితానములను
హలధరాది సమేతుఁడై హతులఁజేసె
దంతవక్త్రాది దైత్యులు దన్ను నెదుర
ఖండనములోనఁ ద్రుంచె దోర్బలము మెఱసి.

—శ్రీమదాంధ్రమహాభాగవతము.

—•—

ఎవఁ డేనక్షత్రమునఁబుట్టిన వానిని జీవితకాలమంతయుఁ దదనుగుణ సంఘటనలే యెదుర్కొనుచుండును. పుట్టుకనుబట్టి బ్రదుకంతయుఁ దెలియును. జన్మకుచెందిన శుభాశుభములు పుట్టినప్పుడే తెలియును. ప్రభాక్షీరముల ప్రభావములు ప్రారంభములోనే ప్రకటమగును. కృష్ణపక్షములో జన్మించుటచే నల్లనివాఁడగుట స్వాభావికమే. రాత్రియందు జన్మించుటచే నెవరును నాతని చేష్టలను గ్రహింపఁజాలరు. పుట్టఁగానే యోగమాయను బిలిచెను. కావున నెదురుగా రాఁగానే లోకుల బుద్ధులపై మాయాజవనిక పడును. అంతఃకరణము మనలోపలనే ఉన్నప్పటికిని మాయామోహితమగుటచే నెవ్వరును స్థిరముగా నుండఁజాలరు. పుట్టఁగానే పాఱిపోవుటచే నాతనికిల్లువాఁకిలి నిశ్చయమైన దెచ్చటను లేకుండెను. ఎప్పు డవసరమైన నప్పుడు పాఱిపోవుచుండును. జననియు, జన్మభూమియు స్వర్గమునకంటె గొప్పవి; కాని యీతఁడు పాఱిపోవలసివచ్చిన జననిని జన్మభూమిని మఱచి పాఱిపోవుచుండును. తిరుగమఱిగిన కాలు ఒక్కచోట నిలువదు. పురిటిపాపడే పూతనను జంపినాఁడు. అందువలన జీవితకాలమంతయుఁ బాపులను బాదుట బాధించుట ఇవే పనులు:

ఉద్ధవుఁ డిట్లనెను :— "విదురా! వాసుదేవుని వార్తలన్నియు విచిత్రములు. ఇంకొక రిట్టిలీల లొనర్చిన మనకుఁ జెప్పసిగ్గగును: కాని ఆతని విషయములో నట్లుకాదు. మానావమానములందును, జయ పరాజయములందును నీతఁ డానందస్రోతమును బ్రవహింపఁజేయుచుండును. చూడుడు, యవన జరాసంధులకు భయపడి మథురను వదలి పదత్రాణములు లేకయే పిక్కబలము చూపించి పాఱిపోయి సముద్ర మధ్యమున ద్వారకాపురిలో నివ

విదురా! భగవంతునకు వివాహమవసర మేమున్నది? తక్కువేమి యున్నది? కాని లోకవల్లీల యొనర్చుటకును, అతులైశ్వర్యమును, అప్రతిమ ప్రభావమును జూపుటకును బెండ్లి కావలసి వచ్చెను. అందఱును జూచుచుండఁగానే భవానీ మందిరమునఁ బూజచేసికొని తిరిగివచ్చునపుడు, రుక్మిణిని బెండ్లి చేసికొనుటకు వచ్చిన పెండ్లికొడుకు గడపలో నుండఁగనే వాడేద్చుచుండ రథము మీఁద గూర్చుండబెట్టుకొని పాఱిపోయెను. అందఱు నెవరు తీసికొని పోయెను, ఎచ్చటికి తీసికొని పోయెనని యనుకొనుచుండిరి. ఎవరి మాటైన వింటేగా? హఠాత్తుగ నెత్తుకొని అందఱును జూచుచుండఁగనే తీసికొని పోయెను. అందఱు నిర్ఘాంతపోయి చూచుచుండిరి. ఇప్పుడింకను సాహస మెక్కువయ్యెను. ఇట్లు ఒకటిగాదు, రెండు, నాలుగు, ఆఱు, పది, ఇరువది, నూరు, రెండువందలు, అయిదు వందలు, వేయి యీ విధముగ పదునాఱువేల నూటయెనిమిది వివాహములను జేసికొనెను. ఆతని లీల యెట్టిదో చూడుఁడు.

నాగ్నజితిని వరించునపుడు ఏడుయెద్దులను నేడు రూపములు ధరించి ముక్కుత్రాళ్లు పొడిచెను. ఒకతెను వరించుటకు మత్స్యయంత్రభేదనము గావించెను. ఒక్కొక్కచోటకుఁబోయి కన్య నీయవలసినదని యాచించెను. ఈ విధముగ భార్యలకు వేఱుగా నొక పట్టణమునే కట్టించెను. విదురా! నీవు భక్తుఁడవు. నీ భార్యయు భక్తురాలు. కాఁబట్టి నీ కేమి తెలియును పురుషులు, అలిగిన అతివల నోదార్చుట యెంత కష్టమో? వారికొఱ కెన్నియో అకర్తవ్యకార్యములు చేయవలసి వచ్చును. శ్రీ కృష్ణుఁడు ఈ పనులన్నిటిలో దక్షుఁడు. ఆమె పట్టపురాణులలో నొకర్తు సత్యభామ. ఆమె మానవతి, మాటిమాటికి కోపముచెంది బిగించుకొని నోరు

తెలిచి మాటలాడుటే మానివేయుచుండెను. చివరకు భగవానుని గూడ నానామాట లనెడిది. ఆతఁ డీశ్వరుఁడు, సర్వజ్ఞుఁడు సర్వ సమర్థుఁడు కాఁబట్టి తన ప్రియురాలికి ప్రియమొనర్చుట కన్నియు జేయుచుండెడువాఁడు. ఆమె యడుగుటయే తడవుగా బలపూర్వక ముగ నింద్రుని నందనవనములోని కల్పవృక్షమును బెఱికి తెచ్చెను. దానికి ఇంద్రుఁ డాతని ప్రభావమును మఱచి క్రోధాంధుఁడై పోరాటమునకు వచ్చెను. ఆతని భార్యకూడ ఆతనిని రెచ్చగొట్టి నది; కాని బలవంతు నెవఁడేమి చేయఁగలడు ? తోక ముడుచుకొని వెడలిపోయెను. ఎనిమిదిమంది పట్టపురాణులు అటునుండి ఇటు నుండి వచ్చిరి. పదునాఱువేల నూరుగు రొక్కచోటనే లభించిరి. అదృష్టవశమున నొక్కచోటనే నిధి లభించినది. నరకాసురుని వధించి బంధనమునఁ బడిన కన్యల నుద్ధరించెను. ఆతని భార్య సత్యభామ పృథివి యంశమునఁ బుట్టినది. ఆమె ప్రార్థనముచే నా భౌమా (నరకా) సురుని కుమారుఁడగు భగదత్తునకు తండ్రి రాజ్యమొసంగి, కన్యల నందఱను నన్నిరూపులను దాల్చి యప్పుడే వివాహమాడెను. ఇఁక పోట్లాటలు లేకుండుటకు భేదభావము లేక తనతో సమానమగు సుందరపుత్రులను ఒక్కొక్క దానికి పదిమంది చొప్పునఁ బుట్టించెను.

వ్రజములో ననేకులగు నసురులను శస్త్రముతోఁగాక దెబ్బల తోడను, గ్రుద్దులతోడను, పిడికిలిపోట్లతోడను జంపెను. అంత నసురరూపధారులగు సింహాసనాసీనులగు రాజులను, బరాక్రమ వంతులను గొందఱను స్వయముగఁ జంపెను. కొందఱ నితరుల చేత జంపించెను. వారిలోఁ గాలయవనుఁడు, జరాసంధుఁడు, శాల్వుఁడు, శంబరుఁడు, ద్వివిదుఁడు, బాణాసురుఁడు, మురుఁడు.

దంతవక్త్రుఁడు, దుశ్శాసనుఁడు, శకుని, దుర్యోధనుని నూర్గురు పుత్రులు ముఖ్యులు.

విదురా! ఈతఁ డూరకుండువాఁడు కాదని నేనిది వఱకే చెప్పితిని. కూర్చుండువాఁడైనచో క్షీరసాగరముకంటె చక్కఁగఁ బ్రశాంతిగనుండు నేకాంతస్థల మెచ్చట నున్నది? అచ్చట ఈఁగలు, దోమలు, నల్లులు, పేలుకూడ లేవే. అత్యంత కోమలము, మృదువైన శరీరము కలిగిన ఆది శేషునిపై శయ్య, లక్ష్మీదేవి సుఖస్పర్శనొసంగు తనయూరువులపైఁ గోమల కరకమలములతో పాదము లొత్తుచుండ నింతకన్న నాతని విశ్రాంతికి సుఖసాధన మెచ్చట లభింపఁగలదు? విశ్రాంతిఁ గొనఁదలిచిన నచ్చటనే నిద్రించెడువాఁడే. తిరుగ నపేక్ష కలిగినది కనుకనే అవనిపై నవతరింపవలసి వచ్చినది వానినిఁ గొట్టుట, వీనినిఁ గొట్టుట, వానితోఁ బోరాడుట, వీనితోఁ బోరాడుట ఇట్టి కౌతుక కార్యములే చేయుచుండును. ఆతనితో రణము చేయువాఁడు లేకున్న నెవరి పక్షమునో జేరుచుండును. ఒకరొకరికి పోట్లాటపెట్టి పోరించుచుఁ దటస్థుఁడై విచిత్రమంతయుఁ గనిపెట్టుచుండును. సమయానుసారముగ నొక్కొక్కప్పు డొకని బలమును బెంచుటయును, మఱి యొకప్పుడింకొకని బలమును తగ్గించుటయును నిదియే ఆతనికి పని.

ధృతరాష్ట్రుఁడును, ఆతని పుత్రులును ఈతఁ డచ్చటకు రాఁగా చాలవైభవముగ స్వాగతమొసంగెను. వారెల్లప్పుడు 'నీవు పాండవుల కెట్టులో మాకును నట్టులే బంధుఁడవు' అని అనుచుండెడువారు. కాని దాని నీతఁ డంగీకరించెడువాఁడు కాఁడు. ఈతని కొక పట్టుదల కలదు. తనకు భక్తులైనవారిని విరోధించు

చుండువా రెంతవైభవముగఁ దనకుఁ బూజ గావించినను వారు తనకును శత్రుకోటివారనియే ఆతని భావము. వీరికి ఆనంద కోలహల మనినను, అడంబర మనిన నిష్టము. వీరి వలన పృథ్వీదేవి కేర్పడిన భారమును దీర్పవలయునని అన్నదమ్ములకు పరస్పరము పోట్లాటపెట్టి, తాను నిఃశస్త్రుఁడై చూచుచుండెను. దుర్యోధనునికి సంబంధించిన వీరుల నందఱను మొట్టమొదట జంపి చివర కాతనినిగూడ భీమసేనునిచేఁ జంపించెను. అప్పుడందఱ కానందము కలిగెను. పృథ్వీభారమంతయు పోయినదని యందఱు ననుకొనిరి. పదునెనిమిదక్షౌహిణీల సేన నాశనమైనది. దీనితో భూమండలములోని గర్విష్ఠులు, దేవకంటకులై మానవశరీరమున నుత్పన్నమైన దైత్యులు మడసిరి. కాని భగవానుని కింకను తృప్తి కాలేదు. బాహ్యశత్రువు లందఱు మడసిరి గాని నా యింటిలో నున్న యీ శత్రువు లుండనేయున్నారు. వీరును భూమికి భారమే. మదిరాపాన మత్తులైయున్న నీ యాదవు లన్యులను లెక్కచేయుట లేదు. నా యండనుండుటచే వీరినెవరును జంపఁజాలకున్నారు. ఇతరులకు వీరజేయులు. వీరు బ్రదికియున్నంత వఱకు భూభారము పోయినట్లు లెక్కగాదు. వీరెట్లు చత్తురనునదియే ఆతని మనస్సులోఁ గల చింత.

విదురా! ఆతనికి స్వపర భేదమే లేదు. ఆతని దగ్గఱ ప్రేమకు స్థానము కలదుగాని మోహమునకు లేదు. దుష్టత్వ మెవరు అవలంభించినను వారి నణఁచును. భక్తుఁడగువాఁడే వర్ణము వాఁడైనను, నే యాశ్రమము వాడైనను వానిని సమస్తవిధముల రక్షించును. ఇప్పుడాతనికి యాదవ సంహారమెట్టులా యను చింత పట్టుకొనెను. భగవానుఁ డిట్లనుకొనెను :– 'ఏవిధముగనైన వీరు

పరస్పరము పోట్లాడుకొనవలయును. మదిరాపానమదమున నున్మత్తులై మోహమమతలను వీడి పరస్పరము చంపుకొనినఁగాని వీరు చావరు. అట్లుకాకున్న నా యంశమునఁ బుట్టిన వీరిని జంప నింకెవరికిని శక్యముకాదు. దీనికి నా ప్రయత్నముకూడ తోడైనఁగాని వీరు చావరు.'

భగవంతుఁడు సత్యసంకల్పుఁడు. ఆతనికి సంకల్పము కలుగఁగానే యాదవులు గతాయుష్కులైరి. వారి కాంతి నశించెను. వారి వివేకము నశింపసాగెను. వారు మృత్యుద్వారమునఁ బ్రవేశించిరి. విదురా! "వినాశకాలే విపరీతబుద్ధిః" వినాశకాలమున విపరీత బుద్ధి కలుగును. అందువలన యాదవులకు గర్వమధిక మయ్యెను. ఇదంతయుఁ బ్రభుప్రేరణచేతనే జరిగినది. ధర్మరాజును సమస్త భూమండలమునకు రాజు గావించెను. ఆతనిచేత మూఁడశ్వమేధ యజ్ఞములను జేయించెను. వంశపరంపర జరుగుటకు నష్టమైన యుత్తరా గర్భమును బ్రహ్మాస్త్రమునుండి రక్షించి పరీక్షిత్తును జీవితుని గావించెను. ఇప్పుడిఁక ద్వారకలోనుండి యాదవనాశనమునకు నిరీక్షించు చుండెను."

—•✱•—

# యదువంశ వినాశనం

శ్లో॥ పుర్యాం కదాచిత్క్రీడద్భి ర్యదుభోజ కుమారకైః,
కోపితా మునయః శేపు ర్భగవన్మత కోవిదాః॥

— శ్రీమద్భాగ. ३ స్కం. ३ అ. ౨౪ శ్లో.

చ. మునివరు లేఁగుదేర యదుభోజవ రేణ్యులుగూడి ముట్టఁ బ
లిక్రీనఁ గనలొంది వారు దమకించి శపించినఁ గొన్నిమాసముల్
సనునెడ దైవయోగ్రమున జాతరఁబో సముకట్టి వేడుకల్
మునములఁ దొంగిలింప గరిమన్ నిజయానముకెక్కి యాదవుల్.

— శ్రీమదాంధ్రభాగవతము.

—•(.)•—

వర్ష మెచ్చట కురిసినను నెప్పటికైన సముద్రమునఁ జేర వలసినదే. గ్రామములోని నీరు చెఱువునఁ జేరును. చెఱువునుండి నదికిని, నదినుండి మహానదికిని, మహానదినుండి సముద్రమునకును జేరును అది యెచ్చటనైన నెండినచో నావిరియై సూర్యుని జేరి, మేఘమై మరల వర్షించును. సముద్రములో గురిసిన జలము వెంటనే దానిలోఁ గలిసిపోవును. మహానదిలో వర్షించిన నది సముద్రములోఁ జేరుటకుఁ గొంచ మాలస్యము కాఁగలదు. క్షుద్రనదిలోఁ గురిసిన నీరింకను నాలస్యమగును. మరుప్రదేశములోఁ గురిసిన నీరు సముద్రములోఁ జేరుటకు మిక్కిలి ఆలస్యమగును. ముందు వెనుకలు భేదమే కాని చివర కన్నియును నబ్ధిఁ జేరవలసినదే, భగవంతునకు దూరమై వేతైన నీ జీవు లేనాఁటికైన నవశ్యము

ముక్తి చెందవలసినదే. కొంద ఱాలస్యముగను, గొందఱు తొంద రగను ముక్తి చెందుదురు. భగవంతుని కృప యెప్పు డేవిధ ముగఁ గలుగునో యెవఁడును దెలిసికొనఁజాలఁడు. ఏకర్మచే నాతఁడు సంతోషించునో యెవఁడు జెప్పఁజాలఁడు. ఆతఁ డెట్టయెదుట నున్నను మఱచిపోవుచుండును. కొందఱొక్కసారి మాత్రమే దర్శిం చినను ముక్తిఁ బొందుదురు. గజరాజు జీవితమంతయు మఱచి యేయుండి మరణసమయమున "హరి" యని పలికి ముక్తిని బొందెను. గృధ్రరాజగు జటాయువు జీవితమంతయు నమేధ్య భక్షణ మొనర్చి, హింసచేసినది కాని నయనాభిరాముఁడును, దూర్వాదళశ్యాముఁడు నగు శ్రీరామచంద్రుని యంకమందు శిరస్సు నుంచి ప్రాణములను విడిచినది. దీనికి విపరీతముగ శ్రీకృష్ణుని పదునాఱువేల భార్యలు సర్వదా ఆతని సేవయందే నిమగ్నలై యుండిరి. వారు శ్యామసుందరుని మధుర మందహాసమును, ప్రేమ మయస్వరూపమును నిత్యమును జూచుచుండెడివారు. ఆతని యనుపమ శోభాసంపన్నమగు శరీరమును సేవించుచుండెడువారు. మరీచిమాలియగు సూర్యభగవానుఁ డస్తమింపఁగానే తమ ప్రియ సఖియును, తమ ప్రాణవల్లభుని సంయోగసుఖావసరమును బ్రసా దించునదియు నగు నిశాసుందరి యాగమనమునకు అనురాగో త్కంఠతతోఁ బ్రతీక్షించుచుండెడువారు. లోకాభిరాముఁడును, కోటికందర్ప శోభాయుక్త శ్రీఘనశ్యాముఁడగు శ్రీకృష్ణుఁడును వారి నత్యధికముగ నాదరించెడువాఁడు. వారికి సమస్తసుఖములను బ్రసాదించెను. వారి కోర్కెలన్నిటిని దీర్చెను; కాని చివరకు వనాభీరులవలన నెత్తుకొనిపోఁబడిరి. విశ్వాత్మునికి భోగ్యలయ్యును అభీరులభోగ్యలు కావలసివచ్చెను. గోపికల యాకర్షణయు మొదటమొదట నిట్లే యుండెను. కాని వారు వారిస్వరూపమును

గుర్తించిరి. "ఈతఁడు మాకధీనుఁడు. మన మెట్లాడించిన నట్లాడును. ఈతఁడు మాకు పతి" యను గర్వమున వారు మునిఁగి యుండిరి. వారికా సుఖమే దక్కెను. యాదవులతనిని తమ బంధువనుకొనిరి. కాని యాతని యథార్థరూపమును వారు గ్రహింపలేకపోయిరి. అందువలన వారికి పరమప్రయోజనము లభింపలేదు."

ఉద్ధవుఁ డిట్లనెను :— "విదురా! భగవానుఁడు ద్వారకా పురిలో నుండి లోక వేదకార్యము లొనర్చు చున్నప్పటికిని సమస్త సాంసారిక విషయభోగములనుగూడ యనుభవించు చుండెడువాఁడు; కాని యాతఁడు స్వాత్మారాముఁ డగుటచే వాటియం దాతని కాసక్తి లేదు. అనేకవత్సరములు దివ్యాదివ్య భోగములను భోగించెను; భార్యలను సుఖపెట్టు చుండెను. కూఁతుండ్రతోఁ గొడుకులతో నాడు చుండెను. గృహస్థ వ్యవహారములు చేయుచుండెడు వాడు. ఉపనయనము, చౌలము, కర్ణ వేధము మొదలగు సంస్కారములను జేయించుచు, ఆడపిల్లలకును, మగపిల్లలకును బెండ్లిండ్లు సేయుచు, వారి నత్తవారిండ్లకుఁ బంపుచుఁ గోడండ్రను దన యింటికి తెచ్చుకొనుచు, జివర కీకార్యములం దాతనికి విరక్తి కలిగినది.

'ఎక్కడనైన శ్రీహరికి రాగముండునా? రాగము లేకున్న విరాగ మెచ్చటనుండి రాఁగలదు? అని నీ వడుగ వచ్చును. విదురా! నేనొక యుపచారముగఁ జెప్పుచున్నాను. ఆతని కేమి విరాగము? ఇప్పుడాతఁడు తన ధామమునకు వెడల నుద్యుక్తుఁ డయ్యెను, విషయలోలురకు శిక్షణగఅపుటకు ఉదాసీనతను గ్రహించెను. ఏమనియనఁగా :— "నేను సర్వస్వతంత్రుఁడ నగు

నీశ్వరుఁడనె అను విషయములను జివరకు వదలి తీరవలసినదే. దైవాధీనముననను, దైవవశముననను నేభోగములు ప్రాప్తించిన నవి విషయాసక్తములు కాఁజాలవు?"

తాను నాటిన విషవృక్షమునైనను బుద్ధిమంతుఁడగు వాఁడు నఱకఁడు. పరులకు దుఃఖమును కలిగించు తేళ్లు, పాములనుగూడ దయాళువులు స్వయముగఁ జంపరు. అదేవిధముగఁ దన యంశ మునఁ బుట్టిన యాదవులను దన చేతిమీఁదుగఁ జంపుట భగవానుఁ డుచితమనుకొనలేదు. మునులను నిమిత్తము గావించి, యిద్దరు ముగ్గురు యాదవుల ధృష్టతా నెపమున యదువంశనాశన మగునట్లు శాపమిప్పించెను. మునుల శాపమన్యథా యగునట్లు చేయుటకు యాదవులు చాల ప్రయత్నించిరి; కాని మునులు స్వతః శాప మీయలేదు. వారు భగవద్భావము నెఱిఁగినవారు. ఆతని యంత్ర ములు. వారి నాతఁ డెట్లాడించిన నట్లాడుదురు. ఏపని చేయించిన నాపని చేయుదురు. శ్రీహరియే వారి హృదయమునఁ బ్రవేశించి యిట్టి ప్రేరణ యొనర్చెను. శాపమును బోగొట్టుకొనుట కమోఘో పాయమును గనిపెట్టితిమని యాదవులు నిశ్చింతగ నుండిరి. అందు వలనఁ బ్రమత్తులై విహరించుచుండిరి; కాని కాల మప్రమత్తభావ ముచే భగవానుని సంకేతమున వారి నందఱను గ్రసించుటకు వేచి యుండెను. దానిత్రేళ్లు తీవ్రముగ నడుచు చుండెను. అది సమ యమును లెక్కించుచుండెను. లెక్క పూర్తికావచ్చుచున్నదనఁగా చివర గణపును లెక్కింపవలయును. అనఁగా అంగుష్ఠముమీఁదకు లెక్క పోవలెనను సమయమున భగవంతుని యాజ్ఞచే యాదవులం దఱును బ్రభాస క్షేత్రమునకుఁ బుణ్యార్జనమునకు దీర్ఘయాత్రకుఁ బోయిరి. అచ్చటకు వెళ్ళి అందఱును స్నానము కావించిరి. గోవు

లను, గుఱ్ఱములను, రథములను, ఏనుఁగులను, స్వర్ణ, రజిత. వస్త్రాభూషణ, వ్యాఘ్రచర్మ, పీతాంబర, కంబళ, మృగచర్మ, భూ, క్షీర, దధి, ఘృత, మధు, కన్యాదిశ్రేష్ఠములగు దానములను విధిపూర్వకముగ వేదజ్ఞులగు బ్రాహ్మణుల కొసంగిరి. అందఱను సంతుష్టులఁగావించెను. దానములొనర్చి కృష్ణార్పణమని సంకల్పించిరి. దేవర్షి పితృ తర్పణము లొసంగిరి. అందఱకును భోజనము లిడి, దక్షిణ లొసంగి, తాంబూలము లిచ్చిరి. భక్తితో బ్రాహ్మణులకును, దేవతలకును, గోవులకును బ్రణమిల్లిరి.

ఇవన్నియు నైన తర్వాత వారు బ్రాహ్మణులను "మేమును బ్రసాదమును గైకొందు" మని యనుజ్ఞ నడుగఁగా సమస్త విధముల సంతుష్టులగు నా బ్రాహ్మణులు ప్రసన్న చిత్తములతో నుల్లాసముగ "సరియే, ఇఁక మీ రానందమున, నుల్లాసముతోఁ బ్రసాదమును గైకొనవచ్చు" ననిరి.

యాదవు లందఱును సోదరులే. ఒక్క వంశములోని వారే. ఆనందముతో వారందఱును భోజనముచేయఁ గూర్చుండిరి. విదురా! అది వారి చివరి భోజనమని వారికి తెలియదు. కాలుని చెక్కించుచున్న వ్రేళ్ళాగిపోయెను. లెక్క పూర్తియయ్యెను. భగవానుఁ డూరక కూర్చుండి వారివైపు జూచుచుండెను. భోజనము మధ్యనొకరు "ఇచ్చట తీర్థములోఁ గొంచెము వారుణికూడ కలుపుఁ" డనెను. మఱియొకఁడు "ఓరీ! ఈ తీర్థస్థలమునందు ఇట్టి పిచ్చి పనులు చేయవల" దనెను. ఇంకొకఁడు "ఆనంద మిచ్చుటనే రావలయు"ననెను. ఇంకేమున్నది, వారుణిని గిన్నెపైగిన్నెలు పందెములు వేచుకొని త్రాగఁ బ్రారంభించిరి. కన్ను లెఱ్ఱఁబడెను.

ఇఁక నాట యారంభమయ్యెను. మూ ర్తిమంతమగు వారుణి వారిని లొంగదీసికొనినది. అందఱకు వివేకము భ్రష్టమయ్యెను. బుద్ధి బుగ్గిలోఁ గలసెను! ఒకరొకరు తిట్టుకొన మొదలిడిరి. కోపము పెరిగెను. ఇంక నొండొరులు బోరాడ బ్రారంభించిరి. ఒకేసారి పుట్టిన వెదురుపొదలు పరస్పరము రాచుకొని, దానిలోనుండి పుట్టిన అగ్నివలనఁ దగులబడినట్లు యాదవులు కలహమను నగ్ని యుత్పన్నమగుటచే నందఱు నశించిరి. సూర్యాస్తమయ మగు నప్పటి కందఱు న స్తమించిరి. భగవానుఁడు రచించిన నాటకమున నీ యంతిమ జవనిక అత్యంత కరుణమైనది. ఈ యంతిమదృశ్యము మిక్కిలి కరుణగ నాడబడినది. అందఱును జచ్చిన తర్వాత శ్యామసుందరుఁడు స్వస్థచిత్తుఁడై సముద్ర తటమున నొక యశ్వత్థవృక్షము క్రిందఁ గూర్చుండెను. ఆతఁడు స్వధామమునకు వెళ్ళదలఁచునంతలో నే నచ్చటకు వెళ్లితిని."

విదురుఁ డిట్లనెను:— "ఉద్ధవా! నీవచ్చట కెచ్చటనుండి వచ్చితివి? నీవు ప్రభాసయాత్రలో పరమేశ్వరుని వెంటలేవా యేమి? నిన్ను వదలి శ్యామసుందరుఁ డెచ్చటికిని వెళ్లఁడే, ఆ యాత్రకు నిన్నేలఁ గొనిపోలేదు? ఈ యాదవ వినాశము నీ కన్నులతో నీవు చూడలేదా? నీవు వారి యుద్ధములోఁ గలియలేదా?"

విదురుని ప్రశ్నములను విని యుద్ధవుఁ డిట్లనెను:— "మహా భాగా! భగవానుఁడు ద్వారావతిలోనుండి తన కుల సంహారము విషయమై ఆలోచించు చుండఁగా నాతఁడు నన్నేకాంతమునఁ బిలిచి నాతో నిట్లనెను :— "ఉద్ధవా! ఇఁక నేను నా లీలాసంవరణము చేయఁదలచుచున్నాను. నీ వింకఁ గొన్నాళ్లీ భూమిపై నుండ

వలయునని నాకోరెక." నేను భగవదాజ్ఞోల్లంఘనము చేయుట నేర్చుకొనలేదు. నన్ను బదరీవనమునకు వెళ్లవలయునని యాజ్ఞాపించుటచే శ్రీచరణములకు మ్రొక్కి నేను బయలుదేఱి వచ్చితిని. కాని నాకు కాళ్లాడలేదు. నేను మోయజాలనంతటి హృదయభార మధికమయ్యెను. నేను వెళ్లుటకుఁ బ్రయత్నించుతును కాని యడుగు పడదు. నేను ముందుకు పోవలెనని కాలెత్తగానే పరవశమున వెనుకకే పడుచుండినది. ఇట్టిస్థితిలో నే నెక్కడెక్కడ సంచరించితినో నాకే తెలియదు. స్వామి నన్ను బదరికాశ్రమము వెళ్లుమని యాజ్ఞాపించినే యని మాటిమాటికి జ్ఞాపకము చేసికొనుచుందును. ద్వారకను వదలి విశాలాపురివైపునకు వెళ్ళవలసి యుండెను. కాని నేను బయలుదేరినది మొదలు నాకా ద్వారకలోని సువర్ణ భవనము నాకన్నులకుఁ గట్టినట్లున్నది. నా వెనువెంటనే ద్వారకకూడ బదరికాశ్రమమునకు వచ్చుచున్నట్లున్నది.

ఇంతలోనే నేను భగవంతుఁడు దివ్యరథముపైఁ గూర్చుండి ప్రభాసక్షేత్రమునకు వెళ్ళుచుండుటను గాంచితిని, దారకుఁడు రథమును తోలుచుండెను. నేను భగవానుని దర్శించితిని. భగవంతుఁడు నన్నుఁ జూడలేదని నేనెట్లందును? ఆతఁడు సర్వులను సర్వదా గాంచుచునే యుండును. ఆతని దృష్టికి తప్పించుకొనిన వారు లేరు. అయినను భగవానుఁ డెఱుఁగనట్లే నటించెను. నేనొక చెట్టుచాటున నుండి యంతయును జూచుచుంటిని. రథము సాగిపోయినది. కాళ్లావైపునకే నడిచెను. నేను ప్రభాసమునకుఁ జేరుకొనునప్పటికి యాదవ సంహార మైపోయినది. నా దుఃఖమునకు మేఱలేకుండెను. నే నటునిటుఁ బిచ్చివానివలెఁ దిరుగుచుఁ బెద్దగ నేడ్వసాగితిని. ఈ మహాయుద్ధములో మాధవుఁడును నీ మానవ

శరీరమును బరిత్యజించెననుకొని, సర్వస్వమును గోల్పోయిన వ్యాపారి వలెను, నీటిబయట పడిన చేఁపవలెను, మణిని గోల్పోయిన ఫణివలెను దటతటఁ గొట్టుకొంటిని. నాకు నల్దిశలను గాఢాంధకారమే తోఁచుచుండెను. యాదవు లందఱును జచ్చిరి. ప్రద్యుమ్న, సాంబ, గద, సారణానిరుద్ధులు నిర్జీవులై నేలపైఁ బడియుండిరి. ఒక్కొక్కని శిరము పగిలినది. హృదయము నొగిలినది, ఒకరొకరి శరీరములు తగిలినవి. మొండెమునుండి శిరస్సు పిగిలినది; ఇఁక శ్యామసుందరుని శరీర మొక్కటే మిగిలినది. ఆ యనంత నిర్జీవశరీరములందు నేను నా ప్రాణధనుని శ్రీవిగ్రహమును వెదుకుచుంటిని. కాని యెంత వెదకినను నాకు త్రైలోక్య మోహన విశ్వవందిత విగ్రహము కనఁబడలేదు. నేను పెద్దకేక వైచి యేడ్చుచు మూర్ఛితుఁడనై యచ్చటనే క్రిందఁ బడిపోయితిని."

శుకుఁ డిట్లనెను :— మహారాజా! ఈ విధముగఁ బరమ భాగవతోత్తముఁడగు నుద్ధవుఁడు శ్రీకృష్ణ వియోగ విషయములను జెప్పుచు చెప్పుచు, నా సంఘటనమునే స్మరించుచు నిజముగ మూర్ఛ చెందెను. ఆతనికి బాహ్యజ్ఞానము లుప్తమయ్యెను. ఇఁక ముందేమియుఁ బలుకఁజాలకుండెను."

—*—

# ఉద్ధవునకు భగవదుపదేశము

శ్లో॥ పురా మయా ప్రోక్త మజాయ నాభ్యే
పద్మే నిషణ్ణాయ మమాది సర్గే,
జ్ఞానం పరం మన్మహిమావభాసమ్
యత్సూరయో భాగవతం వదంతి॥

— శ్రీమద్భాగ. ౩ స్కం. ౪ అ. ౧౩ శ్లో.

"వ॥............పద్మకల్పంబునందు మన్నాభి పద్మమధ్య నిషణ్ణుండయిన పద్మసంభవునకు జన్మమరణాది సంసృతి నివర్తకంబును నవిరళానశ్వర సౌఖ్యప్రవర్తకంబును నగు మన్మహత్వంబుఁ దెలియఁజేయు నద్దివ్యజ్ఞానంబు నీకు నెఱిగింతు."

— శ్రీమదాంధ్రభాగవతము.

—(•*•)—

ఒక్కొక్కప్పుడు గురువులు తమ కర్తవ్యతావశమున వాత్సల్యభావముతో మనము శ్రీచరణములనుండి దూరమగు నట్లాజ్ఞాపింతురు. ఆ యాజ్ఞలు ఉచితములు కానింకు, అనుచితములు కానిండు. పాలించుట చిన్నవారియొక్క విధి. కాని ప్రేమ వశమున వివశులమై ఒక్కొక్కప్పుడు దాని నుల్లంఘించు చుందుము. అయినను గురుజనులు మనలను గృపతోడనే చూచుచుందురు. మన ఆజ్ఞోల్లంఘనాపరాధమును వారవహేళనము కావింతురు. యదుకుల సంహారమయము దాపురింపఁగానే శ్యామసుందరుఁడు తన సచివులకును, సఖులకును, స్నేహితులకును, సుహృదుఁ

డగు నుద్ధవునకును నిప్పుడు యాదవ కులనాశము కాఁబోవు చున్నది కావున బదరికాశ్రమమునకుఁ బోవలసినదనియు, అచ్చటనే తననుగూర్చి తపో ధ్యానాదులొనర్చిన హృదయములోఁ బ్రత్యక్షమగుదుననియు నాజ్ఞాపించెను. భగవదాజ్ఞ నుల్లంఘించు టెట్లు? ఉద్ధవుఁ డాసమయమున వెళ్లెను. కాని కాళ్ళు ముందుకు సాగలేదు. కృష్ణుఁడు యాదవు లందఱితోఁ బ్రభాసమునకు బయలుదేరినప్పుడు అలక్షితభావముతో నుద్ధవుఁడును నాతని వెను వెంటనే బయలుదేరి వెళ్ళెను. యాదవసంహార మయ్యెను. ఆతఁడు హరి నన్వేషించుచుండెను. ఈ ప్రసంగమునే ఉద్ధవుఁడు తన బాల్యసఖుఁడగు విదురునకు జెప్పుచుండెను.

ఉద్ధవుఁ డిట్లనెను :— "విదురా! మృతకళేబరములలో నా ఆరాధ్యదేవుని చిన్మయవిగ్రహము కనఁబడకపోఁగా నేనేడ్చుచు సరస్వతీనదీతీరముననే పోయితిని. దూరమున నుండియే నాకు తులసీమంజరీ సుగంధము వచ్చెను. అప్పుడు నా హృదయమున నానందతరంగము లుప్పతిల్లెను. ప్రతిదినమును మాకు ప్రసాదరూపమున లభింపఁగా, మా కంఠముల ధరించి ధన్యులముగాఁ దలఁచుకొను వనమాలాసుగంధమే యిది యని నేను గ్రహించితిని. నా యిష్టదైవ మీ దగ్గఱలోనే యుండి యుండవలయును. నల్దిక్కుల కలియఁజూచితిని. దూరమున నొక దట్టమగు నశ్వత్థవృక్షముక్రింద గాలికి కొట్టుకొనుచున్న పీతాంబరము, నీలమణివలె శరీరకాంతి కనఁబడెను. నా యానందమునకు మేఱలేకుండెను. నేనా దిక్కులకు విచారింపకయే వెళ్ళితిని. సమస్తశోభాధాముఁడును, శ్రీనివాసుఁడును, ఆశ్రయశూన్యుఁడును, నా ప్రియతమ ప్రభువు నగు హరి యొక యశ్వత్థవృక్షము

నానుకొని సరస్వతీనదీతీరమున శాంతభావముతో నుండెను. ఆహా! ఆ సమయమున నాతనిశోభ కమనీయమైనది. మోహక ముద్రతో విరాజిల్లుచుండెను. ఆతని శ్రీవిగ్రహము సజలజలదమువలెను, దుర్వాదళశ్యామముగ, నీలకమలమువలె, మయూర కంఠమువలె, అతసీపుష్పసంకాశమై నీలవర్ణముగ నుండెను. ఆతఁడు త్రిగుణాతీతమగు విశుద్ధసత్త్వ స్థితిలో నుండెను. ఆతఁడు సదా గుణాతీతుఁడే. ఆ సమయమున నాతఁడు తురీయావస్థ నాశ్రయించెను. కమలదళములవలె సుందరములై, అరుణవర్ణము కలిగి, అర్ధనిమీలితములైయున్న నాతని నయనద్వయము చంద్రకిరణములవలె శీతలత్వమును వర్షింపుచు నా ప్రదేశమును సుఖమయము, శాంతిమయము గావించుచుండెను. ఆతఁ డాసమయమున శంఖ, చక్ర, గదా, పద్మములను ధరించి చతుర్భుజములతో విరాజిల్లు చుండెను. ఆతని శ్రీయంగముపై విరాజిల్లుచున్న పీతాంబరము శ్రావణ భాద్రపదములందు జలభరితములగు మేఘములందు విద్యుల్లత మెఱసినట్లు మెఱయుచుండెను. అశ్వత్థవృక్షము నానుకొని సగము పరుండి, సగము కూర్చుండినట్లుండెను. ఆతని సుందర బలయుతమగు యెడమపిక్కపై యాతని కుడి శ్రీచరణకమలము నుంచెను. ఆత్మానందపరిపూర్ణుఁడై యాతఁడు ప్రపంచము నెడల నుదాసీనుఁడుగ నుండెను.

ఒకానొక పరమవిరక్తుఁడగు సాధువు తిరిగితిరిగి యాతని దగ్గఱకు వచ్చెను. నేను బాగుగాఁ జూడఁగా నీతఁడు వ్యాస భగవానుని సుహృదుఁడును, బరమజ్ఞానియు, నాకు పూర్వ పరిచితుఁడు నగు మైత్రేయమహాముని, నేను భూమిమీఁదఁ బడి

ముందుగా భగవానునకును తర్వాత మైత్రేయమహామునికినిఁ బ్రణమిల్లితిని. 'నీవు బదరికాశ్రమమునకు వెళ్ళక యిచ్చటకేల వచ్చితి' వని గోపాలుఁడు గోపపడునని నేను మొదట చాల భయపడితినిగాని చివరకది భ్రమయని తెలసికొంటిని. ప్రభువు నన్నుఁ జూడఁగానే నవ్వి, అత్యంతానందమును బ్రకటించుచు నిట్లనె :— "ఉద్ధవా! నీవు వచ్చితివి. మంచిపని చేసినావు. నేను నిన్నే స్మరించుచున్నాను. నేనిప్పుడీ మర్త్యలోకమును వదలి పోఁబోవు చున్నాను. నాయంతిమ సందేశము నెవనికి చెప్పుదునా? యని యోచించుచున్నాను. 'దీనికి ఉద్ధవుఁడే అధికారి. ఆతఁ డుండినచో నా యంతిమ సందేశమును లోకమునకు బ్రసాదించి యుండును. ఆతనినిఁ బదరికాశ్రమమునకుఁ బంపితి' నని చింతించుచున్నాను. ఇంతలో నీవు సమయమునకు వచ్చితివి."

భగవానుని కృపాభారమునకు నేనణఁగిపోవుచున్నాను. ప్రభువాతని సేవకులపై నెంత ధ్యాన ముంచునో గదా! ఎంతో కృపఁజూపును. ఆతని అకించన కింకరులపైని. మరల నేను భూమిమీఁదఁబడి సాష్టాంగప్రణామము కావించితిని. అంత భగవత్సమ్ముఖమున వినయమున శిరస్సును వంచి, సమ్ముఖమున అనురక్తచిత్తముతోఁ జేతులు జోడించిన మైత్రేయ మహామునికి వినఁబడునట్లు నాతో నిట్లనెను. ఆ సమయమున నచ్యుతుఁడు మందహాసము చేయుచు నత్యంత ప్రేమతో నన్నుఁ జూచుచు నాతో నిట్లనెను:— ఉద్ధవా! నీ యభిప్రాయమును నేను గ్రహించితిని. నేను చెప్పినప్పటికి నీవు బదరికాశ్రమమునకు వెళ్లని సంగతి నాకు తెలియును' ఇందులోఁగూడ నా ప్రేరణ కలదని తెలిసికొనుము.'

నేను చేతులు జోడించి వినయముతో నిట్లంటిని :– "ప్రభూ ! నేను నీ శ్రీచరణములను వదలియుండఁజాలను. అరుణముగను, పైన నీలముగ నున్న నీ పాదపద్మములే నా మనోమధుపమునకు రసాలయములు, నివాస నికేతనములు. స్వామి యాజ్ఞ నుల్లంఘించితిని. అపరాధినయ్యు నాకు వేఱాశ్రయము లేకపోవుటచే నెక్కడికి వెళ్ళుదమను కొన్నను వెళ్లఁజాలకపోవుచున్నాను."

మాధవుఁడు మందహాసము చేయుచు నిట్లనెను:– ఉద్ధవా ! నీవు నిన్ను మఱచితివా? నీవు సాధారణజీవివి కావు. పూర్వమున నీవు అష్టవసువుల లోనివాడవు. ఒకసారి సృష్టిని వృద్ధిచేయు ప్రజాపతులును, వసువులును గలిసి గొప్ప యజ్ఞమును గావించిరి. వారిలో మిగిలిన వసువులును, ప్రజాపతులును తమ కామనానుసారముగ వరమడిగిరి. నే నప్పుడు నీకు ప్రత్యక్షముకాఁగా యిట్లు కోరితివి :– "నాకు నీ సాన్నిధ్యము ప్రాప్తింపవలయును. నీ మహామహిమను ప్రకాశింపఁజేయు సర్వశ్రేష్ఠమగు జ్ఞానము నాకు ప్రాప్తింపవలయును. నీ చరణములందు నాకు నిరంతరము అహైతుకభక్తి యుండవలెను.' దానికి ఫలస్వరూపమగు నీకు నా కృపవలన నా సాన్నిధ్యము, నాయందు ప్రగాఢమగు భక్తి ప్రాప్తించినది. ఇప్పుడు నేను నీకు నన్నుఁ బ్రాప్తించుటకుఁ గావలసిన సాధన స్వరూపమగు జ్ఞానము నొసంగెదను. ఇది మిక్కిలి గోపనీయమైనది, చాల రహస్యవిషయము. ఇతరులకీ జ్ఞాన మత్యంత దుష్ప్రాప్యము,"

నేనిట్లంటిని :— "ప్రభూ ! నాకు జ్ఞానము వద్దు. నేను నిరంతరము భవదీయ చరణసరోజముల సమీపమున నుందును. ఇదియే నాకు జపము, తపము, సాధనము."

శ్రీకృష్ణుఁ డిట్లనెను :— "ఉద్ధవా ! నే నిప్పు డీ నరలోకమును వదలి స్వధామమునకుఁ బోవుచున్నాను. నా యాజ్ఞ ప్రకారము లోకకళ్యాణార్థమై నేను జెప్పిన జ్ఞానమును ప్రచార ప్రసారము లొనర్చుటకు భూమిమీఁదఁ గొన్నాళ్ళు నీ వుండవలయును. నీవు భయపడవలదు. ఇఁక నీకు సంసారభయము లేదు. నీవు యెనుబదినాల్గులక్షల జీవరాసులలోఁ బడవు. ఇదియే నీ కంతిమ జన్మము. ఈ శరీరమును వదలిన తర్వాత కర్మలచే బంధింపఁబడి మరల సంసారములోఁ బడవు. ఏకాంతమున స్వధామమునకుఁ బోవు సమయమున నా దర్శనము నీకైనది, యది అదృష్టము. పాద్మకల్పములో బ్రహ్మకు చేసిన భాగవత తత్త్వోపదేశమును నీకు నే నిప్పుడు చేసెదను. దీనినే లోకులు "భాగవత తత్త్వ" మందురు. ఈ తత్త్వమును శ్రవణము చేయుటచేతను, మననము చేయుటచేతను జీవి సంసారబంధము నుండి విడివడి నిత్యభగవద్ధామమును జేరుట కధికారి యగును.

"ఆహా ! నేనెంత భాగ్యశాలిని ! భగవానుఁ డీ దాసునిపై నెంత కృపఁజూపినాఁడు. నేను భగవంతున కింతటి ప్రేమ భాజనుఁడ నగుదునని స్వప్నములోనైనఁ దలఁపలేదు. ప్రభువు నాపైఁ బ్రతిక్షణమును గృప చూపుచున్నప్పటికి, నాకు దన యుచ్ఛిష్టప్రసాదమును ధరించుటకు విడిచిన గుడ్డలను, మాలల నొసంగినప్పటికిని అంతిమ సమయములోఁ దన గూఢ రహస్యము

నుపదేశించుట కధికారినని తలంచునని నేనూహింపనైన లేదు. ఈకృపను స్మరింపఁగానే నా శరీరమంతయు రోమాంచమైనది. నేత్రములనుండి అశ్రుజలములు ప్రవహించినవి. నా వాక్కు ఆగిపోవుచుండెను. ఎట్లో నేను ప్రయత్నపూర్వకముగ సంబా ళించుకొని, చేతులు జోడించి యిట్లు నివేదించితిని :— "ప్రభూ ! నీ చరణకమలముల నాశ్రయించిన వానికి ధర్మార్థ కామమోక్ష ములనో నేవి దుర్లభములు ? అవి నీ కింకరులకు అడుగకున్నను లభించును."

ఇది విని భగవానుఁడు నవ్వి యిట్లనెను :— "నీవీ నాల్గిం టిని అడుగుము. నేను మోక్షము వలకుఁ ప్రసాదించెదను."

అంత నేను శీఘ్రముగ నిట్లంటిని :— "వలదు. ప్రభూ ! నాకు మోక్షము వలదు. నాకు నీచరణకమలములందు భక్తిని ప్రసాదింపుము. నేను దానికొఱకే నిరంతరము ఉత్కంఠతతో నున్నాను. బంధములనుండి బయటపడవలయునని కోరిక గల వారలకు నీవు మోక్ష మీయవచ్చును. నేనెల్లప్పుడు నీచరణ ములందు బంధింపఁబడిన సంసారమునుండి స్వతః బయట పడుదును."

శ్రీకృష్ణుఁ డిట్లనెను :— "నాయనా ! నేనును గర్మలలోఁ జిక్కుకొంటిని గదా ?"

నేను వినీతభావముతో నిట్లంటిని :— "నీవు చిక్కుకొన్నను చిక్కుకొనకున్నను, నేను మాత్రము నీ సేవాకర్మలలోఁ జిక్కు కొనవలయుననియే కోరుచున్నాను. నీవెట్లు చిక్కుకొన్నది

నాకు బాగుగాఁ దెలియును. అజన్ముఁడవయ్యు జన్మించుట యును, నిరీహుఁడవయ్యుఁ గర్మలొనర్చుటయును, భయమును గూడ భయపెట్టు నీవు కాలస్వరూపుఁడవయ్యు శత్రువులకు భయ పడి రణరంగమునుండి పాఱి పోవుటయును, సముద్రమధ్యమున దాఁగి కోటఁగట్టుకొని నిర్భయుఁడవయ్యు భయముపడినవానివలె నుండుటయు, సదా ఆత్మారాముఁడవయ్యు వేలకొలఁది స్త్రీలతో రమించుటయును ఇవన్నియు నీ విచిత్రలీలలు. వీటినిగాంచి యజ్ఞానులు నీ యథార్థస్వరూపమును గనఁజాలకున్నారు; కాని నీదాసులమగు మేము నిరంతరము మా హృదయములందు నీ మాయాతీత రూపమునే చూచుచున్నాము.

నామీఁద ననుగ్రహముంచి నన్ను మంత్రిగాఁ జేసికొంటిరి. ఏదైన నొక కార్యమందు సలహా కావలెనని నబోధ బాలకునివలె మిక్కిలి సరళముగ గంభీరభావముతోఁ చింతను బ్రకటించుచు నన్ను సలహా నడుగుచు నిట్లనెడువాఁడవు :— "ఉద్ధవా ! సోదరా ! ఈ విషయము చాల చిక్కైనది. ఈ చిక్కు నీవు తీయవలసినదే. నీవే ఉచితమగు సలహా నొసంగగలవు." ఆ నీవాక్యములు నరలీల కనురూపముగనే యున్నవి. ఇప్పుడు వానినిఁ దలఁచుకొనిన నామనస్సు మోహిత మగుచున్నది. నీ క్రీడలలో నెంతకుతూహలము, ప్రేమ యిమిడియున్నది !"

భగవానుఁడు నా మాటలను విని నవ్వుచు నిట్లనెను :— "బుద్ధిమంతుఁడవగు నో యుద్ధవా ! ఇప్పుడు నీ కేమి కావల యును ?"

పిచ్చి యెత్తినట్లున్నది. ఇప్పుడు నాకీ లోకములో నేవియు నచ్చుట లేదు. ఇఁక నేను కేవలము భగవదాజ్ఞా పరిపాలనము కొఱకై బదరికాశ్రమము వెళ్ళుచున్నాను."

శ్రీ శుక మహర్షి యిట్లనెను :– "రాజా ! ఇట్లు చెప్పుచుఁ జెప్పుచు నుద్ధవుఁడు భగవద్ధ్యానమున మరల నిమగ్నుఁడయ్యెను."

—•♦•—

# విదురునివద్ద సెలవు తీసికొని
# ఉద్ధవుఁడు బదరీవనమున కరుగుట

శ్లో॥ ఇతి సహ విదురేణ విశ్వమూర్తే
ర్గుణకథయా సుధయా ప్లావితోరుతాపః,
క్షణమివ పులినే యమ స్వసుస్తామ్
సముషిత ఔపగవిర్నిశాం తతోఽగాత్॥

— శ్రీమద్భాగ. ౩ స్కం. ౪ అ. ౨౩ శ్లో.

క. కని డాయ నేఁగి మోదం
బునఁ దత్సరిదమల పులిన భూములఁ దగ నా
దిన శేషము నివసించెను
వనజోదర పాదపద్మ వశమానసుఁడై.

—శ్రీమదాంధ్రమహాభాగవతము.

—⬥✻⬥—

ఒక యజమానియొద్ద చాలమంది సేవకులుండి, అందులో నొకఁడు స్వామికి కృపాపాత్రుఁ డగుచో మిగిలినవారు అసూయను జెందుట మానవ స్వభావము. "మేము మాత్ర మట్టి వారము కామా? వీనియం దింత కృప యెందులకు? మే మట్టి కృపకేల పాత్రులము కారా" దని పలుకుచుందురు. ఈ సవతి మాత్స ర్యము సృష్ట్యాదినుండి వచ్చుచున్నది. సృష్ట్యంతము వఱకు నుండఁగలదు. దీనిని బూర్తిగాఁ బోఁగొట్టఁగలవారు లేరు. సాం సారికులలో నసూయ యెట్లుండునో భగవద్భక్తులలోను నంతే.

తమకంటె శ్రేష్ఠమగు భక్తుని ప్రేమదశను గాంచి, వాని ఏక నిష్ఠను, తన్మయతను, ప్రేమావస్థలను గాంచి భక్తుఁ డిట్లను కొనును :— "నాకిట్టి దశ యెప్పుడు కలుగును ? నే నెప్పు డీరీతి ప్రేమోన్మత్తుఁడనై లోకలజ్జనువీడి, యున్మత్తుఁడనై ప్రేమనృత్య మొనర్చెదను? ఈతని కెట్టి భగవత్కృప ప్రాప్తించినది ? కృపాసాగరుఁ డీతనిపై నెట్టి యనుగ్రహమును జూపినాఁడు?" ఈ విధముగ భక్తులు పరస్పరము అన్యభక్తుల దశను గాంచి ప్రేమపూర్వకమగు నీర్ష్యను జెందుదురు. తమ్ము తామే నిరసించు కొను చుందురు. సాంసారికుల ఈర్ష్య ద్వేషమును గలహమును బెంపొందించును. భగవద్భక్తుల ఈర్ష్య ప్రేమను వృద్ధిపొందిం చును. భగవంతుని నిమిత్తముగాఁ జేసికొని చేయుకార్యము లనంతఫలప్రదములు. ఏలననఁగా నాతఁడనంతుఁడు. కారణము యొక్క గుణము కార్యములోనికి వచ్చితీరును.

శ్రీశుకమహర్షి పరీక్షిన్మహారాజుతో నిట్లనెను :— "రాజా! ఉద్ధవునివలన మహాభాగవతుఁడగు విదురుఁడు వంశ వినాశన వృత్తాంతమును విని మిక్కిలి దుఃఖించెను గాని తన వివేకాతి శయముచే నాతఁడు తన యసహ్య బంధవియోగ జనిత శోక మును శాంతింపఁజేసికొనెను. ఆతఁడు సంసారమసారమైనదని తెలిసికొని, ఇది ఆవశ్యం భావి యగు భగవద్వినోదముగఁ దలం చెను. శ్యామసుందరుఁ డెవనిచే నేమి చేయఁదలచునో అప్పు డాతఁడు దానినే చేసితీరును. ఇందు యాదవుల దోషమును లేదు, శాపమొసంగిన బ్రాహ్మణుల దోషమును లేదు. యదుకుల సంహార విషయమును నాతఁడు మఱచెను. ఇప్పుడాతని మనస్సు లోనికి ఒక్కటే విషయము మాటిమాటికివచ్చుచుండెను. ఈ

యుద్ధవుఁ డెంతటి భాగ్యశాలి ! భగవానుని సమస్త బంధు, బాంధవ, మిత్ర, సుహృదులలో నీతఁడే సర్వశ్రేష్ఠుఁడు, మహా భాగవతుఁడు. భక్తాగ్ర గణ్యుఁడు. అంతిమ సమయమున భగవానుఁ డీతనినే తన కృపాపాత్రుఁడుగ నెంచెను. ఈతఁడు కల్పించి చెప్పువాఁడు కాఁడు. పరమవిశ్వసనీయుఁడు. ఈతని నోటివెంట నొక్క యసత్యమైనను రాదు. ఆహా ! ఈతని భాగ్యమును గుఱించి యెంతగాఁ బ్రశంసించినను నల్పమే కాగలదు. ఇప్పు డీతఁడు బదరికాశ్రమమునకు వెళ్లుచున్నాఁడు. సమస్తమును వదలి తపస్సు చేయుటకు బదరికాశ్రమమునకు వెళ్ళువారు మరల తిరిగి రారు. ఇప్పుడింక నీతని దర్శనము ఈ జీవితములో నెవరి కగును? ఈతనికి భగవద్దత్తమగు గుహ్యాతిగుహ్య భాగవత జ్ఞానము ప్రాప్తించినది. ఎవరో ఋషులు మునులు కారు. తత్త్వబోధకులు. స్వయముగ వాసుదేవుఁడే ఆచార్యరూపమున నీతని కుపదేశించెను. ఆ జ్ఞానమును నే నీతనివలన నేల పొందరాదు? నే నీతనికి శిష్యుడ నేల కాఁగూడదు? స్వయముగ శ్రీహరి శ్రీముఖమునుండి యా యమోఘజ్ఞానమును బొందు భాగ్యము నా కెక్కడిది ? ఇట్లు కృపా పాత్రుఁడ నగుట నే సాధనము వలననుగాదు, ఆతఁ డెవరిని వరించునో, ఎవనిపై నాతని కృప కలుగునో ఆతనికే అట్టిది లభించును. ఈ విధముగఁ బరంపరాగత జ్ఞానమును బొందిన నాకు నుద్ధారము గలుగఁ గలదు. ఇట్లాలోచించుకొని విదురుఁడు ఉద్ధవునితో నిట్లనెను.

"ఉద్ధవా ! భగవంతునివలన నాతని స్వరూప గూఢ రహస్యమును దెలుపు గుహ్యాతిగుహ్య జ్ఞానమును దెలిసికొంటివే. దానిని దయతో నాకుగూడ దీక్షనొసంగుఁడు. నేనధికారినని

తోఁచినచో నాజ్ఞానమును నాకుగూడ నొసంగుడు. లోభవశ మున సంసారికులు పరులకీయ వెనుకంజవేయుట కిది భోగ్య సామగ్రికాదు. ఇది పరమార్థజ్ఞానము. మీవంటి పరమ భాగవత భగవద్భక్తులు తమ సేవకుల ప్రయోజనము కొఱకు భూమిపైఁ దిరుగుచుందురు, అధికారి లభించిన వారు గూఢాతి గూఢజ్ఞాన మునుగూడ ప్రసాదించుచుందురు. నేను మీకు సేవకుఁడను. మీయందనురక్తి గలవాఁడను. మీవలెఁ గాదుకాని శ్రీకృష్ణుఁడు నాపైనను యతిక్రించి తత్కృపను జూపుచుండెడువాఁడు. ఆ సంబంధమున నేనును మీ కృపకుఁ బాత్రుఁడనగుట కధికారినే."

ఈ విధముగ విదురుఁ డుద్ధవుని బ్రార్థింపఁగా నత్యంత సంకోచముతో గద్గదకంఠముతో ప్రేమాశ్రువులను బ్రవహింపఁ జేయుచు నుద్ధవుఁ డిట్లనెను:— "విదురా! నీవిట్లు మాటాడు చుంటివేల? నిన్ను గూర్చి నీవేమిగా దలఁచుచున్నావు? నీ వీవిధ ముగ హీనముగ నేల భావించుచున్నావు? నా యభిప్రాయమున నీలోకములో నీకు మించిన భాగ్యశాలి కలడా? యనియే. భగ వంతునికి నీపైనున్న కృప యింకెవరిపైనైనఁ గలదా యనియే నా సందేహము. నాయెఱుకలో నట్టివాఁడు లేఁడు. అట్లు గాకున్న హస్తినాపురములో రాజభవనమును వదలి మీయింటికేల రావల యును? దుర్యోధనుఁ డభిమాని. భగవంతుఁ డాతని యాతి థ్యము నందుకనియే గ్రహింపలేదని నీవనవచ్చును. ఆతని బంధువులలో నితరభక్తులు లేరా? భీష్మపితామహు నింటికేల వెళ్లలేదు? ఆతఁడును నాతని కనన్యోపాసకుఁడే గదా! ద్రోణా చార్యు నింటికి వెళ్ళవచ్చును. కృపాచార్యుని యాతిథ్యమును గ్రహింపవచ్చును. వీరందఱను వదలిపెట్టి కేవలము మీ యింటికే

యేల రావలయును? ఆ మాట నాకు చెప్పుము. అంతిమసమయమున స్వధామమునకు బోవునపుడు భగవానుఁ డెవరిని స్మరింపలేదు. కేవలము నిన్నొక్కనినే స్మరించెను."

"ఆహా! అంతిమ కాలమున దీనబాంధవుఁడు నన్ను స్మరించెనా" యనుకొనఁగానే విదురునికి రోమాంచమయ్యెను. ఆతని నేత్రములనుండి ప్రేమాశ్రువులు ప్రవహించెను. మిక్కిలి యుత్సుకతచేతను, అత్యంతోల్లాసమునను నదరిపడి విదురుఁ డిట్లనెను:— "ఉద్ధవా! ఏమంటివి? శ్యామసుందరుఁడు నన్ను స్మరించెనా? నిజముగఁ జెప్పుము. ముఖప్రీతికి చెప్పఁబోకుము. భగవానుఁ డేమనెను? ఏ ప్రసంగమున నన్నుఁ దలఁచెను? నీవు సరిగా విన్నావా?"

విదురునియొక్క యీ ఉత్కంఠతను, ఇట్టి సందిగ్ధతను విని ఉద్ధవుఁడు లోలోన నిట్లనుకొనెను:— "భగవద్భక్తు లెంతటి యమాయకులు, ఎంతటి నిష్కపటులు. ఎంతటి యభిమాన శూన్యులుగ నుందురు? తాము భక్తులమనియు, తమ హృదయములలో ననురాగ మున్నదను భావమే వారి కుండదు. విదురుని మీఁద భగవానున కెంతటి మమత్వమున్నదియు, భగవానుఁడు తన నామమును బేర్కొన్నాఁడనియుఁ దెలిసికొని యెంతో ఆశ్చర్య పడుచున్నాఁడు." అని యనుకొని నవ్వుచు నిట్లనెను:— "మహా భాగా! నీవెట్టి మాటలు పలుకు చున్నావు? నేను బాగుగా విని యుంటిని. నేను నిద్రపోవుటయునులేదు, కలగాంచుటయును లేదు. నీ నామము నొక్కసారి మాత్రము పలుకుటయే కాదు. నీ సంబంధమున శ్యామసుందరుఁ డెన్నో విషయములు చెప్పెను."

విదురుని హృదయము భారముగఁ దోఁచెను. గద్గద కంఠముతో నాతఁ డిట్లడిగెను :— "ఏప్రసంగమున నా నామమును స్మరించెను?"

ఉద్ధవుఁ డిట్లనెను :— "విషయమిది-భగవానుఁ డీ భాగవత తత్త్వమును నాకుఁ జెప్పుచు మైత్రేయ మహామునితోఁ జెప్పెను. భాగవత సారమునంతను ఉపదేశించిన తర్వాత నాతఁడు మునివరునితో నాసమ్ముఖముననే స్పష్టశబ్దములతో నిట్లనెను :— "మునిశ్రేష్ఠా ! మీ రీజ్ఞానోపదేశమును నాకు పరమ భక్తుఁడగు విదురున కవశ్యము చేయవలయును. ఆతఁడే దీని కధికారి. ఆతఁడు హరిద్వారమునకు మీ సేవ చేయుటకు రాగలఁడు. ఆ సమయమున మీ రాతనికి వినిపింపుఁడు." విదురా ! నే నుపదేశముచేయుట కనర్హుఁడను. నేను నీ కేమి యుపదేశింపఁగలను ? నీవు హరిద్వారమునకుఁబోయి మైత్రేయ మహామునిని భక్తితో సేవించినచో నాతఁడు నీకీజ్ఞానోపదేశము చేయఁగలఁడు."

ఉద్ధవునినోట నీ మాటలను విని, భగవానుని భక్తవత్సలతను స్మరించి విదురుఁడు రోదనము చేయుచు మాటిమాటికి తన భాగ్యమునుగూర్చి పొగడుకొనెను. అప్పుడు ఉద్ధవుఁ డిట్లనెను :— "మహాభాగవతోత్తమా ! విదురా ! నీవు నిన్నింత అల్పునిగా నేలఁ దలఁతువు ? భగవచ్చరిత్రయందు నీకెంతో భక్తి గలదు. నీవెప్పటినుండియో మిక్కిలి భక్తితో శాంత చిత్తముతో శ్రవణము చేయుచున్నావు. ఇట్టి నిష్ఠ కలుగుట యెంతో అదృష్టవంతులకు లభించును."

శుకమహర్షి పరీక్షిన్మహారాజుతో నిట్లనెను :— "రాజా! ప్రేమోన్మత్తులిద్దరును రజతచూర్ణమువలె మెఱయు యమునాపులిన సైకతమందు కూర్చుండి సంభాషించుకొనుచుండిరి. ప్రకృతి స్తబ్ధముగ నున్నది. పక్షులు గూండ్లలో నిద్రించుచున్నవి. సంసారులు నిద్రాదేవి యంకమునఁ బరుండి సుఖనిద్రానుభవమును జేయుచుండిరి. గతులన్నియు నాగిపోయెను. కేవలము యముని చెల్లెలు, హనుమంతుని తండ్రి మందగతిని చరించుచుండిరి. యమునయుఁ దన ప్రియతముని విషయములను నిల్చి వినుచున్నదా యనునట్లుగ శాంతముగ నుండెను. వాయువు శీతలముగను, సుగంధముగ నుండి వ్రజాంగనలకుఁ బ్రతినిధియై వ్రజవల్లభ సఖుల కిద్దరకు స్వాగతమొసంగుచున్నట్లుండెను. ఇంతలోనే పక్షుల కలరవము వినఁబడెను. రసాల మంజరిపైఁ గూర్చుండి కోయిల కుహూ యనెను. పక్షుల పిల్లలు లేచెను. ఉద్ధవుఁ డదిరిపడెను. "ప్రాతఃకాల మైనది. రాత్రి ఒకక్షణములో గడచినది. కృష్ణవిరహమునఁ గాలము కూడ అల్పమైనది" అని విదురునితోఁ బలికి, కన్నుల నీరుగార్చుచు నుద్ధవుఁ డిట్లనెను :— "విదురా! నీ దర్శనముచే భగవద్వియోగ దుఃఖము తగ్గినది; కాని యిప్పుడు నూతన దుఃఖ ముత్పన్నమైనది. నేను భగవదాజ్ఞను బాలింపవలయును. నేను బదరీవనమునకు వెళ్ళవలెను; కాని మరల మీ దర్శన మెచ్చట ? ఇదియే ఆఖరు దర్శనమని తోఁచుచున్నది. కాలగతి యెంత కుటిలమైనది ? దైవభక్తుల నొక్కచోట సమావేశము కానీయదు. సంయోగము వియోగము కొఱకే. ఇఁక నేను వెళ్ళెదను. నాపై నిట్టికృపయే యుంచుఁడు. అప్పుడప్పుడు నన్ను సేవకునిఁగ భావించి స్మరించుచుండవలెను."

ఉద్ధవుని మాటలను విని విదురుఁడు వెక్కి వెక్కి యేడ్చెను. ఇన్నాళ్లనుండి కూడుకొనిన యశ్రువులు ఉద్ధవయోగమునఁ గరిగి ప్రవహించెను. ఆతఁ డుద్ధవుని పాదధూళిని గైకొన ముందుకు రాఁగా నుద్ధవుఁ డెగిరి యాతనిని గౌఁగిలించుకొనెను. చాల సేపటివఱ కట్లే యుండిరి. ఈ బృందావన భూమిలో నేఁడిద్దరు భక్తులు కలియుట గాంచి కాళింది స్తబ్ధయయ్యెను. ఆమెకు శ్యామసుందరుని గోపిక లేకాంతమునఁ గౌఁగిలించుకొనిన విషయము స్మరణకు వచ్చెను. ఇద్దరును శరీరములు మఱచిరి.

కొంచెము సేపటికి ప్రేమవేగము తగ్గెను. ఇద్దరును విడిపోయిరి. ఇద్దరును బరస్పరము ప్రణామము కావించుకొనిరి. ప్రదక్షిణము చేసికొనిరి. ఉద్ధవుఁడు విదురుని మాటిమాటికి నిమురుచు యమునాతీరముననే బదరికాశ్రమమునకుఁ బోయెను. ఆతఁడు కనుమఱుగు కాఁగానే నఱికిన వృక్షమువలె యమునా సైకతమున క్రిందఁ బడిపోయెను."

---

# విదురుని హరిద్వార ప్రయాణము

శ్లో॥ ఆత్మానం చ కురుశ్రేష్ఠ కృష్ణేన మనసేక్షితమ్।
ధ్యాయన్ గతే భాగవతే రురోద ప్రేమ విహ్వలః॥
కాలింద్యాః కతిభిః సిద్ధః అహోభి ర్భరతర్షభః।
ప్రాపద్యత స్వః సరితం యత్ర మిత్రాసుతో మునిః॥

— శ్రీమద్భాగ. ౩ స్కం. ౪ అ. ౩౫, ౩౬ శ్లో.

క. ఉద్ధవుఁ డరిగిన పిదప స
మిద్ధ పరిజ్ఞాను సుజనహితు మైత్రేయున్
వృద్ధజనసేవ్యుఁ దాపస
వృద్ధశ్రవుఁ జూడఁగోరి విదురుఁడు గడఁకన్॥

వ. యమునానది దాఁటి కతిపయ ప్రయాణంబులఁ బుణ్య నదులను హరిక్షేత్రంబులను దర్శించుచు నతి త్వరితగమనంబున.

— శ్రీమదాంధ్రభాగవతము.

---

లోకములో సర్వశ్రేష్ఠమగు సుఖమేది? అనురాగుల యొక్కయు, సత్పురుషుల యొక్కయు, నిజమగు సుహృదుల యొక్కయు సమాగమము. దుఃఖ మేది? వారి వియోగము. శ్రీకృష్ణవిముఖులనియే విదురుఁడు తన సంబంధులను వీడి వచ్చెను. శ్రీకృష్ణప్రియుఁడు కానివాఁడు సంబంధియైనను శత్రు సమానుడే. భగవద్భక్తుఁడును, ప్రేమించువాఁడును, అచ్యుతాను

రాగియు వాఁడెట్టివాఁడైన గానింతు, ఎచ్చటి వాఁడైనఁ గానిండు మనకు సహృదుఁడే, సఖుఁడే, సర్వస్వమును.

శ్రీ శుకుఁ డిట్లనెను :— "రాజా! ఉద్ధవుఁడు వెళ్ళిపోయిన తర్వాత నాతని వియోగముచే విదురుఁ డత్యంత దుఃఖితుఁ డయ్యెను. ఒక వైపున హరి అంతిమసమయమునఁ దనను స్మరించినాడని విని యాతని దయాళుతకును, రెండవది ఉద్ధవుని ప్రేమ, ఆతని యనురాగము, ఆతని యహైతుక భక్తిని స్మరించి యాతఁడు విహ్వలుఁడయ్యెను. ఉద్ధవునియెడల నాతనికి ప్రగాఢమగు ప్రేమ. అందువలననే యాతని వియోగమున విదురుఁడు వెక్కి-వెక్కి యేడ్వ నారంభించెను."

అంతఁ బరీక్షిన్మహారాజిట్లు ప్రశ్నించెను :— "స్వామీ! మీరు ఉద్ధవు నధికముగఁ బ్రశంసించుచున్నారు. ఆతనిలో నట్టి విశేషత యేమి కలదు? యదువంశమంతయు వినాశమైనది కదా, ఉద్ధవుఁ డెట్లు బ్రదికెను? బ్రాహ్మణుల శాపమున భోజ, వృష్ణి, అంధక, కుకుర, సాత్వతాది యదువంశములన్నియు నశించినవి కదా! ఇంతయేల? చివరకు బ్రహ్మాది దేవతలకు నధీశ్వరుఁడును భువనాధీశ్వరుఁ డగు శ్రీకృష్ణుఁడును తన భువన మోహన త్రైలోక్య సుందరస్వరూపమును దిరోహితము గావింపఁగా నా దెబ్బ ఉద్ధవునకుఁ దగులకుండ యేల రక్షించెను? ఇతనిలో నిట్టి విలక్షణత యేమున్నది?"

ఈ ప్రశ్నను విని శుకదేవుఁడు నవ్వి యిట్లనెను :— "రాజా! భగవంతుఁ డెన్నఁడు నే వస్తువును బీజనాశనము కావింపఁడు. బీజనాశనమైనఁ గ్రీడయే సమాప్తమైనదిగదా! క్రీడా

ప్రియుండగు నటనాగరుం డట్లు కోరడు. ఆతడే నిత్య నూతన క్రీడ యొనర్చుట కాది. రైతు పైరుకోసి, అక్కడేమియు మిగులక నన్నియు నింటికిం దెచ్చినప్పటికిని, మరల ముందుకు అదునుకు పైరువేయుటకు వీలుగా గొన్ని విత్తనములు నుంచుచుండును. బీజములు రెండు రకములు. నాదబీజము, బిందు బీజము. నాదబిందువుల వలననే సృష్టియును ముక్తియునుగూడ జరుగును. నాదము లేనిచోట బిందువు లేదు, అచ్చట సృష్టి యును లేదు ముక్తియును లేదు. కలియుగములో సధర్మము కారణమున సూర్యవంశ, చంద్రవంశములు నశించి పోంగలవు. వానిని రక్షించుటకు భగవంతుం డిప్పటినుండియే యేర్పాటు చేసియున్నాడు. నీ వంశమునకు దేవాపియను రాజును, సూర్య వంశమునకు మరుమహారాజును కలాపగ్రామములో గుప్తముగ యోగసమాధియందు మగ్నులై తపస్సు చేయుచున్నారు. కలి యుగము పూర్తికాంగానే వీరిద్దరును వివాహములు చేసికొని మరల చంద్రవంశ, సూర్యవంశముల పరంపరను అక్షుణ్ణమగునట్లు చేయుదురు. యదువంశ పరంపరకొఱకు భగవానుడు తన మనుమడగు వజ్రుని యీ సంహారమునుండి రక్షించెను.

భగవానుం డిట్లనుకొనెను:— "నేనీ యవనిపై నుండి తిరో హితము కాంగా నా పరమ రహస్యమయ తత్త్వజ్ఞానము కూడ లుప్తమై పోగలదు. తత్త్వజ్ఞానము లుప్తమగుచో నీ లోకము అమంగళయుక్తమై, తత్త్వజ్ఞాన శూన్యమై భౌతికవాదము బలిసి యుండును. జీవులకు స్వాభావికమగు రుచి విషయముల మీందనే, ఆచారహీనులై స్వేచ్ఛాచారమందు ప్రవృత్తులగుట మానవులకు స్వభావము. ఇష్టము వచ్చినచోట భోజనము

చేయుటయును, గమ్యాగమ్య విచారము చేయక స్వేచ్ఛాపూర్వకముగ వ్యవహార మొనర్చుట పాశవిక ప్రవృత్తి. పారలౌకిక కార్యములను నిరోధించుటయును, వానియెడల నుదాసీనత చూపించుటయును అసురీభావ మగును. నా తత్త్వజ్ఞానముకూడ నాతోఁ బాటుగాఁ బోవును. నందఱును బరమాత్మను, బరలోకమును, బరమార్థమును మఱచి పోవుదురు. సర్వత్ర భౌతికవాదము యొక్క వ్యవహారము జరుగఁగలదు. కలియుగ జీవుల స్వాభావిక ప్రవృత్తి పాపకర్మములలో నున్నప్పటికి, పారమార్థిక కార్యములను గపటనాటకమనియు, దంభమనియు, వ్యర్థవాదమనియు బలుకుచుందురు. కొందఱిలోనైన ధార్మికచర్చాబీజము లుండవలయును. నా జ్ఞానములో జాతి, కుల భేదభావములు లేవు. శ్రద్ధాయుక్తులగు స్త్రీలు, పురుషులు, బ్రాహ్మణులు, శూద్రులు మెవరైనఁ గావిండు. అందఱు నీ జ్ఞానమును శ్రవణముచేయ నధికారులే. కాని శ్రద్ధలేనివారికిని, అపాత్రులకును నీ జ్ఞానము నిలువదు. సింహినీదుగ్ధము సువర్ణపాత్రమందే యుండును. ఇంకొక పాత్రలోఁ బోసినచో నా పాత్ర పగిలిపోయి క్షీరములు చిందరవందర లగును. నా తర్వాత నా యీ జ్ఞానబీజమును ధారణ చేయుటకును, దాని పరంపరను గాపాడుటకును నుద్ధవుఁడే సమర్థుఁడు. కావున నాతనినే యీ బ్రాహ్మణశాపమను అగ్ని ప్రకోపమునుండి కాపాడి నా జ్ఞానమును జెప్పి బదరికాశ్రమమునకుఁ బంపెదను. అచ్చట ఈతఁడు భావన ద్వారా తపస్సు చేసికొనుచు సమస్తలోకమునకుఁ గల్యాణము కావించును. ఈతఁడిదివఱకు వ్రజములో గుల్మలతారూపమున నుండవలెనను కోరికను బ్రకటించెను. అదియు నెఱవేరఁగలదు. ఈతఁడు సిద్ధశరీరముతో రసమయమగు వ్రజభూమియందు లతారూపమున

నుండి మధురాతిమధుర రసాస్వాదనము చేయఁగలఁడు. ఈ విధముగ లోకకల్యాణమును గలుగును. ఆతని కోరికయును నెఱవేరఁగలదు. నాతర్వాత నుద్ధవుఁ డీజ్ఞానమును సురక్షితముగ నుంచగలఁడు. ఉద్ధవుఁడు తేజములోను, ప్రభావమందునను నాకుఁ దీసిపోఁడు. ఎట్టి పరిస్థితులలోనైనను సాంసారిక విషయభోగములు ఆతని చిత్తమును జంచలము గావింపలేవు. కావున నిప్పుడు విశ్వకల్యాణార్థమై, లోకోపకారము నిమిత్తము, పరోపకారభావనతో నీతఁడు మర్త్యలోకములో నుండవలయును."

రాజా! సర్వేశ్వరుఁడు సత్యసంకల్పుఁడు. ఆతనియిచ్ఛ యెన్నటికిని వ్యర్థముకాదు. ఆతఁడనుకొనుట ఒకటియును, నగుట ఒకటియును గాదు. దేనిని దలఁచెనో అది వెంటనే కావలసినదే. తన జ్ఞానము నొసంగి భగవానుఁడు ఉద్ధవుని బదరికాశ్రమమునకుఁ బంపెను. దారిలో నాతఁడు మహాభాగవతుఁడగు విదురుని గలిసికొనెను. ఇద్దరు ఆరాత్రియంతయు భగవత్సంబంధమైన చర్చయే కావించిరి. ప్రాతఃకాలము కాఁగానే యిద్దరు వేరైరి. ఉద్ధవుఁ డేడ్చుచు విదురుని మాటి మాటికి తిరిగిచూచుచు వెళ్ళెను.

ఉద్ధవుఁడు వెళ్ళఁగానే విదురునకు బృందావనకుంజము శూన్యముగఁ దోఁచెను. పక్షుల కలవరమందు ఆతనికి రోదన ధ్వని వినఁబడుచుండెను. మంథరగతిని పాఱుచున్న మాధవ ప్రియ కాళిందియొక్క ముఖము మ్లానమై యున్నట్లుండెను. భగవంతుఁడు తన శ్రీముఖమునుండి ఉద్ధవుఁడు తనకు సదృశుఁడని చెప్పియుండెను. అట్టివాని వియోగమునకు విదురునివంటి భక్తుని

కిట్టిస్థితి కలుగుటలో నాశ్చర్యములేదు. ఆతఁడు తన కుటుంబీకులనందఱను వీడెను. యాత్రలోనైనను నాతఁడెవరితోడను గలిసికొనఁ దలఁపలేదు; కాని నేఁడు అకాత్తుగ దన బాల్యసఖుఁడగు నుద్ధవుని గలిసికొని యానందము చెందెను. శోక సంతాపము లప్పటిని మఱచిపోయెను. కాని యాతఁడును నిర్మోహివలె వదలి వెళ్లిపోయెను. దీనివలన నాతని మనస్సునకుఁ గష్టము కలిగెను. ఆహా! ఈ సంయోగ వియోగవిధాన మెంత క్రూరముగ రచింపఁబడినది ? పరమ ప్రేమగల సుహృదులను గలిసికొని వియోగముచెందు టెంతటి బీభత్సకాండ ? కాని చేయున దేమున్నది ? ఎవరికర్మ వారిది. ప్రారబ్ధములు భేదించుటచే ననిచ్ఛాపూర్వకముగ నివి దుఃఖహృదయమున నొక బండ వైచికొని యనుభవించి తీరవలసినదే.

చాల సేపటివఱకు విదురుఁడు కన్నీళ్లు గార్చుకొనుటచే నేడ్చు హృదయము కొంచెము తేలిక యయ్యెను. ప్రేమ వేగము తగ్గెను. అంత నాతఁడు ధైర్యము వహించి లేచెను. ఆతఁడు ఉద్ధవుఁడు వెళ్ళిన ఉత్తరదిశకుఁ బ్రణామము కావించెను. అంత నాతఁడు వ్రజధూళిని మస్తకమున ధరించి బృందావనములోని గుల్మలతలకును, పశుపక్షులకును బ్రణామము కావించి, తదనంతరము నాతఁడు దుఃఖితచిత్తముతో నచ్చట నుండి వెడలెను.

లీలామనుష విగ్రహుఁడును, వేదోత్పత్తికి స్థానమైనవాఁడును, ఉద్ధవునకేకాదు సమస్త విశ్వమునకును గురువగు భగవానుఁడు స్వధామమును జేరినాఁడు. బంధువులు చచ్చిరి. ఇఁక విదురునకు బ్రదుకుమీద నాశలేదు; కాని ఒక్కదాని కొఱకే

ఆతఁడు జీవములు నిల్పుకొనినాఁడు. స్వధామము చేరునపుడు ప్రభువు నన్ను స్మరించినాఁడు. మునిశ్రేష్ఠుఁడగు మైత్రేయునకు నాకు భాగవత తత్త్వోపదేశము చేయవలయునని యాదేశించినాఁడు. కావున నెట్లైన హరిద్వారము చేరి, యా భగవదుచ్ఛిష్టజ్ఞానమును నేను బానము గావించి కృతార్థుఁడ నగుదును. ఉద్ధవుని సమ్ముఖమున నే నేజ్ఞానమున కధికారినని భగవానుఁ డనుకొనెనో దానిని బొంది నేఁడు నా జీవితమును సఫలమొనర్చుకొందును. ఇట్లనుకొని యాతఁడు యమునాతీరముననే కొంతదూరము పోయెను. అంత యమునానదిని దాఁటి కొంతకాలమునకు భాగీరథీతీరమునకు వచ్చి ఆ తీరముననే అత్యంతశీఘ్రముగ కుశావర్త క్షేత్రమును, మాయాపురియగు హరిద్వారమునకుఁ జేరెను."

సూతుఁ డిట్లనెను :– "మునులారా ! హరిద్వారములో విదుర మైత్రేయులకు జరిగిన సంవాదమును మీకు వినిపించెదను. మీరు దానిని సావధానముగా వినుఁడు."

---

# హరిద్వారములో మైత్రేయునియొద్ద విదురుడు

శ్లో॥ ద్వారి ద్యునద్యా ఋషభః కురూణామ్,
మైత్రేయ మాసీన మగాధబోధమ్,
క్షత్తోప సృత్యాచ్యుత భావశుద్ధః
పప్రచ్ఛ సౌశీల్య గుణాభి తృప్తః॥

— శ్రీమద్భాగ. ౩ స్కం. ౫ అ. ౧ శ్లో,

సీ. ఘనసార రుచి వాలుకా సముదంచిత
సైకత వేదికా స్థలమునందు
యమ నియమాది యోగాంగ క్రియానిష్ఠఁ
బూని పద్మాసనాసీనుఁడగుచు
హరిపాద సరసీరుహ న్యస్తచిత్తుఁడై
బాహ్యేంద్రియవ్యాప్తిఁ బాఱఁద్రోలి
సకల విద్వజ్జన స్తవనీయ సముచితా
చార వ్రతోపవాసములఁ గ్రుస్సి

తే. యున్న పుణ్యాత్ము విగత వయోవికారు
వినుత సంచారు భువన పావన విహారు
యోగిజనగేయు సత్తతి భాగధేయు
నాశ్రిత విధేయు మైత్రేయు నచటఁ గాంచె.

వ, ఇట్లు గనుంగొని యమ్మునీంద్రుని పాదంబులకుం బ్రణమిల్లి ముకుళితహస్తుండై యిట్లనియె.

— శ్రీమదాంధ్రభాగవతము.

—•(.)•—

శ్రద్ధయు తగ్గిపోవును. కారణ మేమియనఁగా వినఁగా మనకు ఆకర్షణ కలిగించినది యాతని కళయొక్క ఆకర్షణ. ఉత్తమ చిత్రకారుఁడు భక్తుడు కావలసిన పనిలేదు. లేఖకుఁడు సదాచారి కావలెనను నిశ్చయములేదు. ఉత్తమవక్త యొక్క వ్యవహారము పటువుగా నుండ నవసరము లేదు. ఏదే నొక కళలో నిపుణుఁడ గుటయు, జీవనసంయమ మను మూసలో పోతపోసి బాహ్యాభ్యంతర జీవనము నొక్కటిగ సరళము కావించుకొనుట ఈ రెండును భిన్న భిన్న వస్తువులు. సరళ సదాచారియగు సాధువు విశేషకళాకో విదుఁడుగఁగూడ నుండవచ్చును. కళాకారుఁడు శిష్టాచార సదాచార హీనుఁడుగఁగూడ నుండవచ్చును. ఇట్టి కళాకారుని కళలయెడల మనకు గౌరవభావము లున్నప్పటికిని, కళాకారుని నిజజీవనము యెడల మన కగౌరవభావమే యుండును.

మైత్రేయుని గూర్చి విదురుఁడు ఉద్ధవుని వలన వినియుం డెను. వినఁగానే ఆతని హృదయమున మైత్రేయుని దర్శింప వలయునను నుత్కంఠత కలిగినది. 'ఆహా! భగవానుఁడు నాకు జ్ఞానోపదేశమును జేయవలసినదని మైత్రేయు నాజ్ఞాపించెను. ఆ తపోధనుఁ డెట్లుండునో? ఆతఁడు నామీఁదఁ గృప చూపునో లేదో? నేనా శూద్రస్త్రీ గర్భమునఁ బుట్టితిని. నేఁడు బంధు పరిత్యక్తుఁడను, ధనహీనుఁడను, అకించనుఁడను. ఇల్లు వాఁకిలి లేక అలక్షితభావముతోఁ దిరుగుచున్నాను. మహాముని గొప్ప వాఁడు కావచ్చును. నన్నాతనిదగ్గఱకు వెళ్ళనిత్తురో, వెళ్ళ నీయరో? దీనుఁడ నగు నాసేవచే నాతఁడు సంతుష్టుఁడగునో లేదో? మునుముం దాయనను నేనెట్లు దర్శింతును? నాపరిచయ మెట్లు చేయుదును?' ఈ విధముగ ననేకోహాపోహాలు చేసి

కొనుచు నాతఁడు మహాముని దర్శనాభిలాషతో వెళ్లుచుండెను. హరిద్వారమునకు వెళ్ళి అచ్చట మైత్రేయ మహాముని యాశ్రమము నకు మార్గమడిగెను. వారు చెప్పిన మార్గముననుసరించి మహాముని సమీపమునకుఁ బోయెను. గంగాతటము మిక్కిలి శాంతముగను, నేకాంతముగను, నిర్జనముగనున్న స్థలమున మహాముని ఆశ్రమము బాగుగా నలికి ముగ్గులు పెట్టియుండెను. అచ్చట జనులసందడిలేదు. ఒకరిద్దరు సాధారణ శిష్యులు మాత్రముండిరి. నలువైపులను బచ్చనిచెట్లు కలవు. కూపసమీపమున బాగుఁగా గాచిన అరఁటిచెట్లు కలవు. ముందు రామతులసి కృష్ణతులసీ వనమున్నది. అందులో వందలకొలఁది వృక్షములు మంజరీ యుక్తములై యున్నవి. ఆ సమీపమున వివిధములగు ఫల పుష్ప వృక్షములు చాల కలవు. నలువైపులను శాంతి సామ్రాజ్యము విరాజిల్లుచుండెను. ఆశ్రమము నానుకొని కలకల నినాదిని యగు భాగీరథి ప్రవహించుచుండెను. తీరమున నెఱుపు, నలుపు, తెలుపు మొదలగు ననేకవర్ణములుగల రాళ్లు గుండ్రనివి చిన్నవి పెద్దవి కలవు. హిమాలయమునుండి బాలికయగు నలకనంద ప్రవహించునప్పుడు ప్రేమవశమున నామె తండ్రి చాల పాషాణ ఖండములను సేవకులుగ నామె వెంటఁ బంపెను. చిన్నపిల్ల ఒంటరిగా పతియగు సముద్రునికడకు పోవుటకు భయపడునని యట్లొనర్చెను. గంగకుఁ దన పతిని గలియుటకు తొందరె క్కువ. ఆమె అక్కడనుండి మిక్కిలి వేగముగఁ బరువిడు చుండును. పాషాణఖండరూపమగు సేవకులును ఆమె ప్రవాహ మునెంటఁ బరువిడుచుందురు. కాని లావుపాటివారు చంచల బాలికతో నెంతని పరువిడఁగలరు? చాలదీర్ఘకాయము గల

పాషాణఖండముల నచ్చటనే విడిచిపోవుచుండును. గంగ వారి కొఱకుఁ బ్రతీక్షింపదు. ఆమెకు పాఱిపోవుటయే పని. వెంట రాఁగలవారిని వెంటఁ గొనిపోవును. రాలేనివారి నక్కడనే విడిచి పోవును. హరిద్వారమునకు వచ్చుచుఁ బెద్ద పెద్దవి హృషీకేశములోనే ఆగిపోవును. కాని చిన్నచిన్నవి వేగముగ వచ్చెడివి హరిద్వారమువఱకు వచ్చును. ఇక్కడకు రాఁగానే గంగ యువతియగును. తండ్రి వడినుండి దుముకును. తండ్రికూడ యిట్లనుకొనును :— ఇఁక ముందు భయము లేదు. నిమ్నోన్నత మార్గము సమాప్తమైనది. ఇఁక సమభూమియే. అందువలన నాతఁ డక్కడనే ఆగిపోవును. ఆతని యింటి తల వాఁకిలి అదియే. సరిహద్దులోనుండు సేనాసమూహములోని పెద్దలు చిన్నలు కొంతదూర మామెవెంట వత్తురు. చాల మంది గంగను వీడెదరు. వానికి కాళ్లు లేవు. అవి ఱాళ్లు. గిరి సంతానము. అవి గంగసహాయమున దొర్లుటచే గుండ్రాళ్లైనవి. హరిద్వారములో నిట్టి గుండ్రాళ్లు పెద్దవి చిన్నవి చాల గలవు. అవి హిమాలయమునుండి గంగతోపాటుగా వచ్చినవి. గంగ వాని నెచ్చటెచ్చటనో వదలి పాఱిపోవును. అందువలన నవి హరిద్వారములో ననాథలవలె, నసంఖ్యాకములుగ నక్కడక్కడ పడియుండును. అవి గంగామార్గములోఁ బడి వర్షాకాలములో పితృవాత్సల్యమున మనలను గంగ కొనిపోవునని నిరీక్షించుచుండును. శ్రావణ భాద్రపదములలోఁ గొన్నిటిని గంగ కొనిపోవును. కాని పది, యిరువది క్రోసులు గొనిపోయి విడుచును. దారిలో నామెకు చాలమంది చెల్లెండ్రు కలియుదురు. ప్రయాగలో నామె పెద్దచెల్లెలగు యమునను గూడ కొనిపోవును. కావున ప్రయాగ

వఱకు నెవ్వరును రారు. హరిద్వారములో మైత్రేయమహాముని యాశ్రమసమీపమున నిట్టి గుంద్రాక్ష్యుండుడను గాంచెను. ఆతఁ డిట్లనుకొనెను :- విష్ణుపాదాబ్జసంభూతయగు భగవతీ భాగీరథీ మార్గమందు పడియుండి ఈ ఱాళ్ళు ఋషిమునుల చరణ ధూళి శిర మునధరించుచున్నవి. గంగాస్నాన మొనర్చి ఈ ఋషిమునుల భక్తులు ఆశ్రమమునకు వచ్చునపుడు వీరిపై దమ చరణకమల ముల నుంచి కుటీరమునకుఁ బోవుచుందురు. యిట్లనేక విష యములను గలఁచుకొనుచు, గంగాతటముయొక్క శోభను గాంచుచు విదురుఁడు మైత్రేయమహాముని యాశ్రమమునకు జేరెను.

ఒక మృగచర్మముపై వస్త్రమును బఱచిన ఆసనముపై శాంతభావముతో మైత్రేయమహాముని కూర్చుండుటను గాంచెను. ఆతఁ డాత్మతృప్తుఁడై బ్రహ్మానందసుఖము ననుభవించు చుండెను. చూఁడగానే రోమాంచ మయ్యెను. భూమిమీఁదఁబడి మూర్తిమంత మగు తపఃపంజరమగు మహామునికి సాష్టాంగప్రణామము గావిం చెను. తనయెదుట భూమి మీఁదఁబడి ప్రణామము కావించు విదురుని గాంచఁగానే ముని ముఖకమలము శారదీయ జ్యోత్స్న వలె వికసించెను. ఆతఁడు వెంటనే శీఘ్రముగ లేచి బలపూర్వక ముగ విదురుని భూమినుండి లేవఁదీసి గాఢాలింగనము కావించు కొనెను. ఆతని శరీరముపై నంటిన ధూళిని తన కోమలకరము లచే దులిపి, మిక్కిలి స్నేహముతో నాతని సంపూర్ణ శరీరముపైఁ దన చేతిలో నిమురుచు నిట్లనెను:- "విదురా! నీవు వచ్చి మంచి పని చేసితివి. నేను నీ కొఱకే యెదురుచూచు చున్నాను. నీ శరీరము స్వస్థముగ నున్నదా? నీ వన్నివిధములను గుశలముగ

నున్నావా? శ్రీకృష్ణుఁడు స్వధామమునకు వేంచేసినపుడు నా కొసంగిన పరమతత్త్వభూతమగు భాగవత జ్ఞానమును నీకు చెప్ప వలసినదని యాదేశించినాఁడు. దానిని నీకుఁ జెప్పెదను. ఈ పాపపూర్ణమగు విశ్వమున నింక నుండవలెనను నిచ్ఛ నాకు లేదు. భగవానుఁడు వీడిన పృథివియందు కలి, అధర్మ సామ్రాజ్యమే వ్యాపించును. దీనియందింక నుంటుట వ్యర్థము. నాకొక్క టియే అభిలాష. భగవదాజ్ఞను బరిపాలించి నీకు జ్ఞానోపదేశము నొసంగి పరమపదమును బొందెదను. నీవును రానేవచ్చితివి. నన్ను పరమార్థసంబంధమగు ప్రశ్న లడుగుము. దానికి భగ వదుపదేశానుసారముగఁ బ్రత్యుత్తర మొసంగెదను."

శ్రీ శుకమహర్షి యిట్లనెను :— "రాజా! ఇట్లు పలికి మైత్రేయుఁడు విదురునకు స్వాగత సత్కారము లొనర్చెను. ఆతనికి జలమును, దినుటకు కందమూలఫలాదుల నొసంగెను. ప్రసాదమునుగొని, విశ్రమించి విదురుఁడు మైత్రేయునిఁ బ్రశ్నించుట కుద్యుక్తుఁ డయ్యెను."

—(•*•)—

# మైత్రేయునితో విదురుని పారమార్థిక ప్రశ్న

శ్లో॥ సుఖాయ కర్మాణి కరోతి లోకో
న తైః సుఖం వాన్యదుపారమం వా
విందేత భూయస్తత ఏవ దుఃఖం
యదత్ర యుక్తం భగవాన్ వదేన్నః॥

— శ్రీమద్భాగ. ౩ స్కం. ౫ అ. ౨ శ్లో.

"ఓ.........మునీంద్రా! లోకంబున సకలజనంబులు మనంబుల ఘనంబులగు సౌఖ్యంబు లందం దలంచి తత్ఫలప్రాప్తి హేతువులైన కర్మంబు లాచరించి దైవోపహతులై తత్కార్మంబుల చేత నిష్ఫలారంభు లగుదురు."

— శ్రీమదాంధ్రభాగవతము.

—*—

లోకములోని సమస్త సంప్రదాయ గ్రంథములలోను సమస్త శాస్త్రములందును ప్రధానముగ నొక్కటే ప్రశ్న కలదు— అది—"దుఃఖ నివృత్తి యెట్లగును, సుఖప్రాప్తి యెట్లు కలుగును?" అందఱును దీనినే క్రిందుమీఁదు లొనర్చి నానాహేతు ప్రమాణముల నొసంగి యీ ప్రశ్ననే వేసికొని దీని సమాధానము కొఱకు సమస్త పాండిత్యమును ఖర్చుచేసిరి. ఈ ప్రశ్నవలన నీప్రపంచములో ముఖ్యముగ దుఃఖమే కలదు. కాని సుఖము లేదని తెలినది. జీవుఁడు కోరునది సుఖము. వాని ప్రయత్నము లన్నియు సుఖము కొఱకే. దుఃఖము

నెవ్వఁడును గోరఁడు. మనము కోరక పోయినను దుఃఖము మన నెత్తిమీఁదనెక్కి నాట్యమాడును. కావున నా దుఃఖము నుండి నివృత్తి చెందుటయును, శాశ్వత సుఖమును బొందుట యును ఇదియే ప్రధాన కర్తవ్యము. దానిని దెలిసికొని ప్రయ త్నింపవలెను.

ఈ ప్రపంచములోని జీవులందఱును రాత్రింబవళ్ళు కర్మలలో మునిఁగియుందురు. రాత్రింబవళ్ళు ఘోరపరిశ్రమ కావించుచుందురు. ఇదంతయు నెందులకని ఏకాగ్రచిత్తముతో గంభీరముగ విచారించవలయును. ఇదంతయును దుఃఖ నివృ త్తికిని, సుఖోపలబ్ధికిని గాదా ? దీనిని మనస్సులో నుంచు కొనియే విదురుఁడు వినీతభావముతో మైత్రేయమహామునిని ప్రశ్నించెను.

విదురుఁడు స్వస్థచిత్తుఁడై మునిసమ్ముఖమునఁ గూర్చుండి, యాతని విధ్యుక్తముగఁ బూజించి, ప్రణామము గావించి, చేతులు జోడించి యిట్లనెను :— "స్వామీ ! నాకొక ముఖ్య మగు శంక కలదు. ముందుగా దాని నడిగి తర్వాత మిగిలిన ప్రశ్నలడిగెదను."

ఆనందమును బ్రకటించుచు నవ్వి యా యగాధ జ్ఞాన నిధియగు ముని యిట్లనెను :— "విదురా ! నీవు సంతోష ముతో సంకోచమును వీడి ప్రశ్నింపుము. జనార్దనుఁడు చేసిన జ్ఞానోపదేశము ననుసరించి నీసమస్తప్రశ్నలకును సమాధాన మొసంగెదను."

ఇది విని వినీతభావముతో విదురుఁడిట్లనెను :— "ప్రభూ ! ఈ ప్రపంచములోని వారందఱును దుఃఖనివృత్తి కొఱకును సుఖప్రాప్తి కొఱకును బ్రయత్నించు చున్నారు; కాని యీ ప్రయత్నములవలన దుఃఖనివృత్తియు నగుటలేదు; శాశ్వత సుఖప్రాప్తియును లేదు. ఇంతేకాదు, సుఖము కొఱకని ప్రయత్నించుటయును, దానికి బదులుగ దుఃఖము లభించుటయును జరుగుచున్నది.

చూడుఁడు, రైతు రాత్రింబవళ్ళు పనిచేయుచుండును. చలి, ఎండ, వర్షమని చూడఁడు. వాని కడుపును నిండదు. పూర్తిగ నిద్రయును బోఁడు. ఎందుల కిట్లు కష్టపడుట ? తన పొలము బాగుగాఁ బండినచో దరిద్రమంతయును దీఱి కేవలము సుఖము లభించునని యాశ. కాని పైరీ మధ్యలోనే అతివర్షము చేతనో, వర్షము లేకనో, మూషకబాధచేతనో, మిడుతల పోటో, తెగులు పడుటో, అధికముగ మంచు పడుటో, దైవిక భౌతికోపద్రవములో ఏవియో వచ్చి పంట చెడిపోవుచుండును. ఒకవేళ బాగుగా పండి వచ్చినను రాజదండము, భూమిపన్ను, వడ్డీ వ్యాపారి ఋణబాధ, చోరోపద్రవము, యాచకుల పీడ మొదలగు ననేక కారణములచే తిండిగింజలు లాగివేయఁబడుచున్నవి. అట్లు లాగకున్నను ఆతని కెంతటి సుఖము లభింపవలయునో అంతయుఁ దృప్తికరముగ ఇచ్ఛానుసారముగ లభించుట లేదు.

మన మొక బండిని సుఖముకై కొనినచో, అది విఱిగిపోయినను, ప్రాతదై పోయినను, మాసిపోయినను, కొనువాఁడు బాధించును. దానికి కావలసిన సామగ్రి దొరకదు. సుఖస్థాన

మనమున దుఃఖమే కలుగును. మనకు సుఖము లభింపవలయునని గృహమును గట్టుదుము. కాని దానిని గట్టించుటకును, మరమ్మతు చేయుటకును, సామాను సేకరించుటకును దుఃఖమునే అనుభవింపవలసి వచ్చుచున్నది. అది పడిపోయినను, ఇతరులు లాగుకొన్నను, ద్రవ్యాభావమున విక్రయించినను, బలవంతుని మూలమున వదలవలసివచ్చినను, ఈ కారణముల వలన దుఃఖమే కలుగును. ఒకానొక మంచి వస్తువును దినవలెనను గోరిక కలుగును. దానిని దినిన సుఖముకలుగునని మన యూహ. కాని తినిన తర్వాత తృష్ణ యెక్కువై దుఃఖమే కలుగును. అధికముగఁ దినిన రోగము సంభవించును. క్షణ కాలము జిహ్వా సుఖమునకై నెలల పర్యంతము క్లేశ మనుభవింపవలయును. ఒకానొక సుందరరూపమును జూడఁ గోరిక కలుగును. దానినిఁ జూచినకొలఁది ఆకర్షణ యినుమడించును. దానినిఁ బొందుటకుఁ బ్రయత్నింతుము. దానికి నానాక్లేశములు పడవలయును. దానినిఁ బొందినను సుఖము లేదు, దుఃఖమే. నేఁటివఱ కెందఱో ప్రబల పరాక్రమవంతులగు నృపతులు గడచిపోయిరి. ఎందఱో శూరులు, యశస్వులు, తేజస్వులు, భోగపురుషులు గతించిరి. కాని యింతవఱ కెవరును నీ సాంసారిక పదార్థములవలన సర్వదా సుఖము లభించినదనినవారు లేరు. ఇంతేకాదు, విశ్వములో నెంత ధాన్యము, తిను పదార్థములు, సువర్ణాది ధనము, గోవులు, అశ్వములు, మానవోపభోగమునకై యేర్పడిన పశువులు, మానవులకుఁ బ్రియము కనఁబఱుచునట్టియు, విషయసుఖము నొసంగు వారాంగనలు వీని నన్నిటి నొక్క మానవునకే యిచ్చినను వీని అన్నిటిచే

నా మానవుఁడు తృప్తిపొందఁడు. భోగసామగ్రి పెరిగినకొలఁది తృష్ణయు దానికి నూఱురెట్లు పెరుగును. ఎవని కెంత తృష్ణ కలదో అంత దరిద్రుఁడు. తృష్ణ కంతములేదు. అది అనంతము. ఇట్లే దుఃఖము ననంతమే. ఈ దుఃఖములనుండి విడివడు టెట్లు? ఏ పని చేయుటచే నీ దుఃఖము నివర్తించి పరమ సుఖశాంతి లభింపఁగలదు ? మానవుఁ డీ సుఖము కొఱకే నిరంతర మన్వేషించుచుండును. గొప్పగొప్ప నగరములలోని చతుష్పథములోఁ గూర్చుండి చూడుఁడు. వేలకొలఁది, లక్షలకొలఁది మానవు లిటునటు వ్యగ్రులై తిరుగుచుండుటను గాంతుము. వారిని బ్రతివారిని 'నీవేల పోవుచున్నావు ?' అని యడిగినచో నందఱు 'దుఃఖ నివృత్తి కొఱకును, సుఖప్రాప్తి కొఱకు నని జవాబు చెప్పెదరు. ఒక్కొక్కప్పుడు తన తండ్రికో, సోదరునికో, పిల్లవానికో, తల్లికో, సోదరికో, స్త్రీకో, మిత్రునికో జబ్బుచేసినది. వాని కౌషధము, వైద్యునిఁ దేఁబోవుచున్నా ననును. ఇంకొకఁడు న్యాయాలయములో నభియోగమునకై వెళ్ళుచున్నాను దానిని వదలించుకొనవలయు ననును. ఇంకొకఁడు తనకు దిండి కేమియు లేదనియు, క్షుధాశాంతికి నౌకరి, చాకిరి, వ్యాపారము, కంట్రాక్టు, జూదము, దొంగతనము, మోసము, పూజా పారాయణము, దేవార్చనాదులలో నేదియో చేయఁబోవుచున్నా ననును. అబ్బ ! దినమంతయు బనిచేసి విసుగెత్తినది, కొంచెము మనో వినోదము చేసికొని, వ్యాహాళికి వెళ్ళుచున్నానని యింకొకఁడనును. మఱియొకఁడు మత్తులేకున్న మనస్సు చంచలముగ నుండును. కొంచెము భంగో, నల్లమందో, గంజాయో, తాంబూలమో, పొగాకో, మద్యమో, కల్లో త్రాగబోవుచున్నా ననును.

కామతప్తుఁడై కామినికడ కొకఁడును, కల్లంగడి కొకఁడును, మఱియొకఁడు మఱియొకని దగ్గరకు వెళ్ళుచున్నా' ననును. వీరిలో దుఃఖనివృత్తి, సుఖప్రాప్తి కావలెననువాఁడు తప్ప వేఱొకఁ డుండఁడు. వారి నందఱను 'మీకు అత్యంత దుఃఖ నివృత్తియు, సర్వదా సుఖప్రాప్తియుఁ గలిగినదా ?' యని యడిగినచో వారందఱు నొకే ప్రత్యుత్తర మొసంగెదరు— 'అత్యంత దుఃఖనివృత్తి కాలేదు, నా కిచ్చిన మందు కొంచెము పట్టినది, కాని బాగుగా నయము కాలేదనియు, నౌకరి దొరకినది గాని తగినంత జీతము దొరకలేదనియు, వ్యాపారములో లాభము వచ్చినది గాని రాఁదగినంత రాలేదు' అనుచుందురు. ఇట్లే అందఱు నీ లక్ష్యముతోడనే యిటునటుఁ దిరుగుచుందురు. అందఱును సుఖముకొఱకే గమనము చేయుచున్నారు గాని వారు దుఃఖులుగానే యున్నారు."

అంత మైత్రేయుఁ డిట్లనెను :— "మనమును నిటునటుఁ దిరుగుచున్నాము. పది పండ్రెండు వత్సరముల క్రిందట మనము ప్రభాసక్షేత్రములో నుంటిమి. తర్వాత నానాతీర్థముల సంచరించి హరిద్వారమునకు వచ్చితిమి. ఇఁక కొలఁది దినములలో నిచ్చటనుండియు వెళ్ళిపోవుదుము. అందఱును భ్రమించుచున్నారు, మేమును భ్రమించుచున్నాము."

అంత శీఘ్రముగ విదురుఁ డిట్లనెను :— "లేదు, స్వామీ ! మీరు తిరుగుటకును, సాంసారికులు తిరుగుటకును భేదమున్నది.

సాంసారికులు విషయప్రాప్తియందు, వాని ప్రచురతయందును సుఖమున్నదందురు. కావున వారు విషయములను బొందుట కభిలషించు చుందురు. కాని మీవంటి పరమోప కారులగు భగవద్భక్తులు దౌర్భాగ్యవశమున భగవద్విముఖులగు మూఢుల ననుగ్రహించు నిమిత్తమును, అధర్మ పరాయణులు, సంసార తాపతప్తులయొక్క దుఃఖమును బోగొట్టుటకును పరోపకారము కొఱకు లోకములోఁ దిరుగుచుందురు. మీబోటి సాధువులు పృథ్వియందుఁ బర్యటింపకున్న సాంసారికు లందఱును దుఃఖులు గానే యుందురు. ఏలయనఁగా సాధుపురుషుల ఉపదేశములేక యీ విషయాసక్తులు విషయమోహమును విడువఁజాలరు. విషయ మోహమును వీడకున్న సుఖమే లేదు. మీవంటి మహాత్ముల పరిభ్రమణము మీ దుఃఖ నివృత్తికొఱకు గాదు. సంసారములోఁ బడినవారి దుఃఖనివృత్తికొఱకు. కావున ఓ సాధువర్యా ! జ్ఞాన జ్యేష్ఠా ! మానవుల యంతఃకరణములో సాక్షిరూపముననున్న శ్రీహరి తన యథార్థరూపమును బ్రకటపఱచుటకుఁ దగిన యారా ధనమును గూర్చి నాకుఁ జెప్పుము. దేనిమూలమున నంతఃకర ణము అద్దమువలె స్వచ్ఛమగునో, దేనిచే సమస్త జగత్సాక్షి శ్యామసుందరుఁడు కనఁబడునో, ఏ యుపాసనచే హృదయ మందుఁ బ్రకటమై ఆతనిని బొందు బుద్ధియోగమును బ్రసా దించునో – ఆతనిని శాశ్వతముగఁ బొంది, సర్వదా సుఖశాం తులఁ బ్రసాదించు ఆ మార్గమును నా కుపదేశింపుము."

శ్రీ శుకుఁ డిట్లనెను :— "రాజా ! ఈ విధముగ ముఖ్య ప్రశ్నను గావించి విదురుఁడు మైత్రేయుని ముఖ మట్లే నిర్నిమేషముగఁ జూచుచుండెను."



# విదురుని అన్యప్రశ్నలు

శ్లో॥ శాః శోచ్యా శోచ్యా నవిదోఽను శోచే
హరేః కథాయాం విముఖానఘేన।
క్షిణోతి దేవోఽ నిమిషస్తు యేషాం
ఆయుర్వృథావాదగతి స్మృతీనామ్॥

— శ్రీమద్భాగ. ౩ స్కం. ౫ అ. ౧౪ శ్లో.

"క. శ్రీ వనితాధిప నామ క
థా విముఖుల కిహముఁ బరము దవ్వై పిదపం
బోవుదురు నరకమునకుఁ
వావిరి నే వారిఁజూచి వగతు మునీంద్రా.

క. ఏ నరుఁడే నొక నిమిషం
బైన వృథా వాద గతిని హరిపదకమల
ధ్యానానందుఁడు గాఁడే
నా నరునకు నాయు వల్పమగు మునినాథా!"

—శ్రీమదాంధ్రమహాభాగవతము.

—.•.—

భాగవత కథా శ్రోతల కిట్టియే ప్రశ్నలు తోఁచును. వారందఱును రహస్యవిషయము లడుగుచుందురు. అన్నిటి కంటె గొప్పరహస్యము ఈ దృశ్యమాన ప్రపంచమే. కావున భాగవత ముముక్షువులయొక్క ప్రథమప్రశ్న యీ ప్రపంచ

విషయముగనే యుండును. నానారూపములు కలిగి, నానా పదార్థములతోఁ గూడి, ప్రతిక్షణము పరిణామము చెందు ఈ ప్రపంచ మెట్లేర్పడినది? ఈ సృష్టి నెవరు చేయుచున్నారు? దీని నెవఁడు నియమించి సువ్యవస్థతో నుంచుచున్నాఁడు? దీని నెవఁడు పాలించి, యెవఁడు చివరకు సంహారము చేయుచున్నాఁడు? జీవుఁడు కర్మబంధములో నేల పడుచున్నాఁడు? ఈ బంధనము నుండి జీవునకు ముక్తి యెట్లు కలుగుచున్నది? ఈ జగత్తున కాశ్రయ మెవఁడు? ఆతఁడీ యవనిపై నవతరించి యేమేమి చేయును? ఏయే దివ్యక్రీడల ద్వారమున నాతఁడు ప్రాణులకు ప్రసన్నతను, ప్రేమను బ్రసాదించును? ఎవనిని జూచినను దిరిగి తిరిగి యీ ప్రశ్నలు వేయవలసినదే. తెలిసినను, దెలియకున్నను నందఱ బుద్ధులలో నీ ప్రశ్నలే తిరుగుచుండును. భగవత్ప్రాప్తి లభ్యము కానంతవఱకు తప్పనిసరిగ నెవనికైనను నీ ప్రశ్నలు తిరుగుచుండ వలసినదే. నాస్తికుడు భగవానుఁ డున్నాఁడనియే యొప్పుకొనఁడు. భగవంతుఁ డున్నాఁడనియే యొప్పుకొనకున్న వంధ్యాపుత్రునివలె నాతని సమ్ముఖమున భగవత్ప్రాప్తిని గుఱించిన ప్రశ్నలే బయలు దేరవని నీవనవచ్చును. అట్లు గాదు. మనము భూమిని లేదన్నను, పక్షులు ఆకాశము లేదన్నను జెల్లదు. భూమి లేదన్నను నివసించునది భూమిమీదనే. దానిని వదలి యొక్కక్షణమైన నుండఁజాలము గదా! పక్షి ఆకాశము నొప్పుకొనకున్న నది యెగురవలసినది ఆకాశము మీఁదనే కదా! నాస్తికుఁడు ఈశ్వరుఁడే లేఁడనుచున్నాఁడు గదా! వానికింత పోరాట మెందులకు? లేని వస్తువున కింత

దుమారము రేపనేల ? ఆస్తికులతో శాస్త్రార్థముచేయనేల ? వానిని వధించెదరా ? ఆతనిని నీటిలో ముంచెదరా ? ఆతని గ్రంథము లను నాశనము కావించెదరా ? దీనిని బట్టి వానినిగూడ నీ ప్రశ్నలే బాధించుచున్నవని తోఁచుచున్నది. వారీ చర్మ చక్షువులతో భగవంతుని జూడకున్నను ఆతని అస్తిత్వమును నాశనము చేయవలయుననియు, ఆతనినిగూర్చిన చర్చను ఆపివేయింపవలయుననియు నాతనియెడల వీరికి క్రోధము. అందులకే వారు ప్రయత్నించుచున్నారు. ఇసుక మైదానములలో నొక పెద్ద జంతువుండును. వ్యాధుఁడు దానిని వేటాడఁబోయినపుడది దాని తల నిసుకలో దాఁచుకొనును. శరీరము పైనే యుండును కాని అది తల నిసుకలోదూర్చి యెవ్వరిని జూడకున్న దాని నెవఁడును జూడఁజాలఁడని దాని యూహ. కాని వ్యాధుఁడు అప్రమత్తుఁడగుటచే బాణమును సంధించి దానిని జంపును. అది 'అస్తి' కానిండు 'నాస్తి' కానిండు. భయము మాత్ర మందఱ కున్నది. ఆస్తికులు, నాస్తికులు వారివారి దర్శనములలోఁ బ్రతిపాదించిన విషయము "ఈశ్వరుడే". ఒకఁ డున్నాఁడనును, రెండవవాఁడు లేఁడనును. భగవానుఁ డీ రెంటికి విలక్షణముగ నుండి నవ్వుకొనుచుండును. నాస్తికుని జిహ్వను గోయఁడు. వాని వాక్కును నిరోధింపఁడు. ఆస్తికునికి సహస్రజిహ్వ లొసంగఁడు. వాని నాకాశముపై కెత్తఁడు. ఇద్దరును వానినిగూర్చి విచారణసేయుచుందురు కాఁబట్టి వారి కిద్దరకును ఫలము సమానమే. ఇద్దర బుద్ధులును విచారణచే తీక్ష్ణమగుచుండును. భేదమేమియనఁగా ఆస్తికునకు 'రస' ప్రాప్తి కలదు. నాస్తికున కా

"రస" ప్రాప్తి లేదు. విదురుఁడు రసికుఁడు. ఆతఁడు రసలోలుపమధుపము. కావున నాతఁడు మైత్రేయునితో నిట్లనెను:—
"దీనబంధూ! గురుదేవా! మీరు నాకు జగత్కథలకంటె సారభూతములును. పరమసుఖదాయకములునగు వాసుదేవ భగవానుని కథల నేఱియేఱి సుందర సుగంధిత పుష్పముల నేఱి కూర్చినట్లును, మధుపము సమస్త సుగంధ పుష్పములలో సారభూతమగు మధువు నొక్కచోఁ జేర్చి దానిని గ్రహించినట్లును, హంస నీరు కలిసిన పాలలో నీటిని వదలి పాలనే త్రాగినట్లును, జఠరాగ్ని అన్నములో సారభూతమైన రసమును గ్రహించి పిప్పిని గ్రిందకు త్రోసివేసినట్లును, వడ్లదంపుమర బియ్యమును వేఱుపఱిచి పొట్టును తవుడును వేఱుగాఁ బోసినట్లు మీరును కథలన్నిటిలో సారభూతమగు కేవలము కృష్ణకథను నాకు చెప్పవలయును."

విదురుని ప్రశ్నలనువిని మైత్రేయుఁడు నవ్వి యిట్లనెను:—
"విదురా! నీ వడుగఁదలఁచినవి అడుగుము. ఏమడిగెదవో?"

విదురుఁ డిట్లనెను:— "స్వామీ! నాకు భక్తినిఁ బెంచునవియు, కర్ణపేయముగ నుండునవియు నగు భగవచ్చరిత్రములను వినిపింపవలయును. జగదుత్పత్తి స్థితి లయము లొనర్చినవాఁడు కంసనిషూదనుఁడగు వాసుదేవుఁ డొక్కఁడే యని నా విశ్వాసము. ఆతఁడు నానావతారములను ధరించి యేయే చరిత్రలు కావించినదియును, బ్రహ్మరూపమును ధరించి కల్పాదియం దెట్లు సృష్టించునదియు, విష్ణురూపమును ధరించి ఆ సృష్టి నెట్లు పాలించునదియు, చివరకు రుద్రరూపమున దాని

నెట్లు సంహారము చేయునదియు ఈ యన్ని విషయములను నాకుఁ జెప్పవలయును. భగవానుఁ డద్వితీయుఁడు గదా! అట్టి వాఁ డెట్లనేక రూపములను ధరించును? వీని నన్నిటిని సంక్షేప ముగఁ జెప్పి, తర్వాత భగవదవతార కథలను వినిపింపుము. ఆతఁడు సాధు, గో, బ్రాహ్మణులను రక్షించుట కెట్టి యవతార ముల నెత్తి యే యేచరిత్రలను జేసినదియుఁ జెప్పవలెను."

అంత మైత్రేయుఁ డిట్లనెను:- "విదురా! మాటిమాటికి అదే విషయమును, ఆ యవతారకథలనే యేల యడిగెదవు? నీ విదివఱకు అవతార కథలను వినలేవా? నీవు సాక్షాద్భగ వంతుఁ డగు వ్యాసభగవానుని పుత్రుఁడవు. ఋషులలో శ్రేష్ఠుఁడగు నా సత్యవతీనందనుఁడే సమస్తకథాసాగరుఁడు. ఆతఁడే పంచమ వేద మనఁదగు మహాభారతమును రచించెను. పెక్కు మార్లు విన్నను నీవు నన్నదే ప్రశ్న వేయుచుంటివేల?"

అంత విదురుఁ డిట్లనెను:- "స్వామీ! మీరు సత్యమునే పలుకుచున్నారు. నేను భగవచ్చరిత్రలను పలుసార్లు విని యున్నాను. కాని మీతో సత్యమునే చెప్పెదను; ఆ పుణ్యశ్లోక శిఖామణియగు వాసుదేవుని పవిత్రచరిత్రల నెన్నిసారులు విన్నను తృప్తియగుటలేదు. నేను మా తండ్రియగు వ్యాసభగవానుని నోట భగవత్కథా రసాస్వాదనము కావించితిని. నేను వేరు సెనగ, బాదాముగింజలు, పిస్తాపప్పు, అక్రోటు పప్పు తినినట్లు రసాస్వాదనము కావించితిని. అనఁగా పై గింజలను రాతితోఁ బగులగొట్టి పెచ్చులు తీసివైచి, పొట్టు నొలిచి యూది పప్పు

తినవలెను. ఇట్లు చేయుట చాల శ్రమ. స్వామీ! నేను సార గ్రాహిని. వ్యాసులవారు ఉచ్చనీచ వర్ణ ధర్మములను గూర్చి మాటిమాటికిఁ జెప్పిరి. వానిలోఁ బ్రసంగవశమున వచ్చిన భగవచ్చరిత్రలనుగూడ వర్ణించిరి. అతని ధర్మార్థ కామసంబంధ ములగు కథలనుండి నాకు ప్రసంగానుసారముగ వచ్చిన భగవ త్కథలను వదలి మిగిలిన విషయములు రుచికరముగ నుండవు. ఇవన్నియు క్షుద్రసుఖములు. దీనిని జేసిన నీ ఫలము వచ్చును, ఆ దేవతలను బూజించిన నీ యాశీర్వాదము లభించును. ఈ కర్మచేత నిన్ని దినములు స్వర్గవాసము చేయవచ్చును. ఇందరు అప్సరసలు లభించుదురు." ఈ మాటలు వినివిని నా చిత్తము విసిగిపోయినది. దేనిని వినుటచేతనే సంసారబంధములన్నియు శాశ్వతముగ విడిపోవునో అట్టికథలే నా కత్యంతప్రియములు. మానవుఁ డితరసాధన మేదియుఁ జేయకపోయినప్పటికిని కేవలము ప్రేమతో నిరంతరము కృష్ణకథాశ్రవణము చేయుచుండునెడల, నా ఒక్క కార్యముచేతనే సమస్తధర్మముల ఫలము, సమస్త కర్మలు చేసిన పుణ్యము, సమస్త సాధనములసారము లభింపఁ గలదు."

అంత మైత్రేయుఁ డిట్లనెను:— "వ్యాసభగవానుఁడు మహా భారత రచనమును కేవలము సంసారులకును, స్వర్గాది సుఖ ముల నపేక్షించువారి కొఱకును మాత్రమే వ్రాసెనా?"

అంత శీఘ్రముగ విదురుఁ డిట్లనెను:— "కాదు. కాదు స్వామీ! నా యభిప్రాయ మదికాదు. నా తండ్రియగు వ్యాస

భగవానుఁడు సర్వజ్ఞుఁడు. అన్ని అధికారములు గలవారికిని ఉపకారము చేయుటయే వాని యుద్దేశ్యము. ఒకానొకనికి అరుంధతిని జూపింపవలసియుండిన ముందుగా నాకాశమునఁ జుక్కల నన్నిటిని జూపింపవలయును. వానినుండి సప్తర్షుల నక్షత్రములను వేఱుగాఁ జూపింపవలయును. వానితో మంచము కోళ్ళవలెనుండు నక్షత్రములను జూపవలయును. ఆ తరువాత వానితో వశిష్ఠనక్షత్రమును జూపి చివరికి "దాని వెంటనే మిణుకుమిణుకు మనునదియే అరుంధతీనక్షత్ర" మని చెప్పవలెను. ఇచ్చట తారతమ్యమున సూక్ష్మవస్తుజ్ఞానము కావింపఁబడినది. అదేవిధముగ వ్యాసభగవానుఁడు మునుముందుగా సాంసారిక, స్వర్గీయ భోగములనుగూర్చి చెప్పి చివరకు ఈ సమస్తసుఖములకంటె సర్వశ్రేష్ఠమగు సుఖము శ్యామసుందరుని శరణమునందే కలదని చెప్పెను. మీకు ప్రియసఖుఁడగు వ్యాసభగవానుఁడు మహాభారతమును రచించుటకు ముఖ్యముగ నుద్దేశించినది భగవచ్చరిత్రవర్ణనమే. కాని ఆతఁడా విషయమును కర్మాసక్తులకు నచ్చఁజెప్పుటకై యింతగాఁ దలక్రిందులు చేసి సాధారణులు పుత్రులను గనుట, దేవ, ఋషి, పితరులకుఁ బూజనము లొనర్చుట పరమపురుషార్థమని యనుకొనునట్లుగా రచించెను. వాస్తవముగ నాతఁడు విషయసుఖ వర్ణనము గావించుచు మానవబుద్ధులను మాధవగుణానువాదము వైపునకుఁ ద్రిప్పుటకే ప్రయత్నించెను. శ్రద్ధాళువులగు మానవులకు భగవత్కథలయందు రుచి కలిగినచో విషయవిరక్తి స్వతః కలిగి తీరును. విషయవిరక్తి కలిగినమీదట భగవత్కథలను వినుచుండిన భగవచ్చరణారవిందములందు గాఢానురాగము వృద్ధి

యగుచుండును. అట్టి వృద్ధిచెందిన అనురాగమువలననే మానవునకు సమస్తదుఃఖములు నశించును. కావున వాకు మీరు ఆ మధురాతిమధుర భగవత్కథలను వినిపింపుఁడు."

శ్రీ శుకుఁ డిట్లనెను :— "రాజా ! ఇట్లు పలికి విదురుఁడూరకుండి, మహామునియగు మైత్రేయ మహర్షిని లాలసా భరితములగు దృష్టులతోఁ జూచుచు నాతని ముఖమునుండి వెలువడఁబోవు నమృతమును మనసారఁ బానముచేయుటకై యుత్సాహమును బ్రకటించుచుండెను."

—•—

# విదురునకుఁ బ్రత్యుత్తరము

శ్లో॥ స ఏవం భగవాన్ పృష్టః క్షత్త్రా కౌషారవి ర్మునిః ।
పుంసాం నిఃశ్రేయ సార్థేన తమాహ బహు మానయన్ ॥

—శ్రీమద్భాగ. ౩ స్కం. ౫ అ. ౧౭ శ్లో.

క. అని విదురుఁడు మైత్రేయుం
డను మునినాయకుని నడిగె నని వేదవ్యా
సుని తనయుం డభిమన్యుని
తనయునకుం జెప్పి మఱియుఁ దగ నిట్లనియెన్.

వ. ఇట్లు విదురుఁడు మైత్రేయు నడిగిన నతం డతనిం
గని యతి మృదుమధుర వచన రచనుండై యిట్లనియె.”

— శ్రీమదాంధ్రభాగవతము.

—♦—

ఈ కార్య మీ పరంపరాగత గుణమున కనురూపముగ
నున్నదని యెవఁడు కుల, శీల, విద్యా, బుద్ధి, వర్ణ, వృత్తుల
అనువగు కార్యము నొనర్చునో వానిని విద్వాంసులు పొగడు
చుందురు. కాని శీల, సదాచార, కులాగతాచారములను వదలి
వ్యవహారము చేయువాని నందఱును విసుగుకొని యిట్టి పావన
కులములో నిట్టి కుపుత్రుఁడు పుట్టినాఁడని తెగడుచుందురు.
విదురుఁడు దాసీపుత్రుఁ డైనప్పటికిని వ్యాసుని వీర్యము వలన
నుద్భవించినాఁడు. ఆతఁడు శూద్రుఁడుగ జన్మించినప్పటికిని

శీల, సదాచార, విద్వన్నీతి నైపుణ్యాది సమస్త గుణములు కలిగి యుండుటవలన నందఱకును సమ్మానభాజనుఁ డయ్యెను. గొప్ప గొప్ప విద్వాంసు లాతని నాదరించి, యాతని వాక్యములనే ప్రమాణములుగా గ్రహింతురు. నేఁడు మైత్రేయుని సమీపమునకు వచ్చి యిట్టి గంభీర ప్రశ్నల నాతఁడడుగునప్పటికి మైత్రేయుని హర్షమునకు మేరలేకపోయెను. ఆతఁడు విదురుని మిక్కిలిగఁ బ్రశంసించుచు నిట్లనెను.

మైత్రేయుఁ డిట్లనెను :– "మహాభాగా! విదురా! నేను నీ విషయములో నిదివఱకు చాల ప్రశంసను వింటిని; కాని నేఁడు నీ ప్రశ్నలను వినఁగానే నా రోమములు నిక్కబొడుచుకొనుచున్నవి. ఆహా! నీ వెంత సరళముగ, గంభీరముగ, విద్వత్తాపూర్ణముగఁ బ్రశ్నించితివి! ఇది నీ కనురూపముగనే యున్నది. కారణగుణము కార్యములోనికి వచ్చితీరును. పితృసంపత్తికి పుత్రుఁ డధికారి కాఁగలఁడు. మామిడి చెట్టునకు మామిడిపండ్లే పుట్టును. నీవు వ్యాసభగవానుని వీర్యమునకుఁ బుట్టితివి. నీవు నీ సర్వస్వమును ద్యజించి, అఖిలాండపతియగు నచ్యుతునకు ననన్యాశ్రయుఁడవైతివి. అట్టి నీ విట్టి ప్రశ్న లడుగుటలో నాశ్చర్య మేమియును లేదు. నీ కుల, శీల, విద్వత్తల కనురూపముగనే యున్న వీ ప్రశ్నలు."

మిక్కిలి సిగ్గుపడుచు విదురుఁ డిట్లనెను :– "గురుజనులు అధములపైఁకూడ అపారకృపను జూపుచుందురు. సాధువులు పరుల దోషములను జూడనే చూడరు. ప్రేమవలన గుణవన

ములు దృష్టిగోచరములు కావు. నేను శూద్రస్త్రీకిఁ బుట్టిన హీన వర్ణుఁడను. నా సోదరులు, నా సోదరుని కుమారులు నన్నుఁ బరిత్యజించిరి. కేవలము మీ కృపావలంబనముననే నేనల్పముగఁ దెలిసికొనుటకు మీ చరణసన్నిధికి వచ్చితిని. కావున మీరు నన్నుఁ గరుణించి నా ప్రశ్నలకుఁ బ్రత్యుత్తర మొసఁగుఁడు."

ఇది విని యానందములో మునిఁగి మైత్రేయ మహాముని యిట్లనెను :– "విదురా ! నీ వెట్టి పొరపాటు పలుకులు పలుకుచున్నావు ! నిన్ను నీవు మఱచితివా ? నీవు సాధారణ మానవుఁడవా ? నీవు సమస్తప్రజలను దండించు సంయమనీపతి యగు యమధర్మరాజవు. నీవు లోకకల్యాణము నిమిత్తము మాండవ్యముని శాపమున పాండురాజుదాసికి వ్యాసభగవానుని వీర్యముచే జన్మించితివి. నీ కేమి సందేహము లుండఁగలవు ? నీవే సమస్తసందేహములకు సమాధానము చెప్పఁగలవాఁడవు. ఇప్పుడు నీవు ఉపచారముగ లోకకల్యాణము నిమిత్తమై ప్రశ్నించుచున్నావు. నా మహత్త్వమును బెద్దజేయుచున్నావు. నన్ను సమ్మానించుచున్నావు. ఈ సంవాదము మూలమున నాకీర్తిని అక్షీణము గావించుచున్నావు. నీ భక్తివిషయములో నెంతగాఁ జెప్పినను నల్పమే కాఁగలదు. భక్తులు భగవద్భజనము చేయుచుందురని మేము వినియుంటిమి. చివరకు ఋషులును మునులునుగూడ భగవత్స్మరణము చేయుటకుఁ బ్రయత్నించుచుందురు. కాని నీ విషయములో నిది విపరీతమైనది. భగవంతుఁడు నిన్నే సదా స్మరించుచుండును. అంత్యకాలములో నచ్యుతుఁడు స్వధామమునకుఁ బోవుచు నిన్నే స్మరించి

నా పరమభక్తుఁడగు విదురునకు నేను చెప్పిన యీ గుహ్యాతి గుహ్య జ్ఞానమును తప్పక నుపదేశింపవలయునని చెప్పెను. కావున నాకు భగవంతుఁ డుపదేశించిన ప్రకారము నీ ప్రశ్న లకుఁ బ్రత్యుత్తర మొసంగెదను. నీవు ముఖ్యముగ రెండు ప్రశ్న లడిగితివి. అందులో మొదటిది నిరంతరము సుఖము కొఱకై ప్రయత్నించుచున్నను దుఃఖము లేల లభించుచున్న వనియు, రెండవది నిర్గుణుఁడగు భగవంతునిచే నీ సగుణ సంసారమేల యెట్లు కలిగినదనియు నడిగితివి. ఈ ప్రశ్నలు నిగూఢములైనప్పటిని నేనతి సంక్షేపముగ వీనికిఁ బ్రత్యుత్తర మొసంగెదను.

ఎల్లవారికిని సుఖేచ్ఛ యుండుట నిజమే. ఏలయనఁగా సుఖస్వరూపుఁడగు శ్రీహరి సకాశముననే యీ జీవుఁ డుదయించి నాఁడు. కాని భ్రమవశమున నీ వస్తువును సాంసారిక విష యములలో వెదకుచున్నాఁడు. సుఖము నిత్యము. అది యీ యనిత్యపదార్థములలో నెచ్చట లభింపఁగలదు ? సుఖమేక రసము. అది యీ నిత్యపరివర్తనశీలములై, క్షణక్షణము మారునట్టి వస్తువులం దెట్లు లభింపఁగలదు ? సుఖము సత్య మైనది. అది యీ యసత్పదార్థముల నెట్లాశ్రయింపఁగలదు ? సుఖాశచే నందఱును శ్రమించుచుందురు. కాని ఆ శ్రమ అది లేనిచోటు కావలెనని కోరుచున్నది. నీవు ప్రతి దినము జిల్లేడు చెట్టుకు నీరుపోయుచు మధురఫలములు కాయవలెను, నేను బాగుగాఁ దినవలయు ననుకొనుము. నీవు నీరు పోసినకొలఁది అది పెరుగును. పూలును, మామిడికాయలవలెఁ గాయలును

గాయును; కాని యవి పక్వమై పగులఁగానే దానినుండి రసము నకుఁ బదులుగా దూది బయటకు రాఁగలదు. చివరకు శ్రమ యంతయును వ్యర్థమే. ఆశ నిరాశయైనది. ఇట్లే చిలుక బూరుగుఫలము ముక్కుతోఁబొడుచును. చివరకు నిరాశయే చెంద వలసివచ్చును. నీవు తూర్పుసముద్రమునకుఁ బోవుదమను కొంటివి. పడమటిసముద్రపు త్రోవను బట్టుకొనిన పూర్వ సాగరమున కెట్లు చేరఁగలవు ? తుమ్మను నాటి మామిడిపండ్లు పండవలెనుట యసంభవము. దానిమీఁద ముండ్లుమాత్రమే పుట్టును. కుక్కను మేపి, బలియునట్లొనర్చి, దీనికి పిల్లలు పుట్టఁగానే కామధేనువువలెఁ గమ్మని పాలొసంగవలెనని యాశిం చుచో నా యాశము, సేవయు వ్యర్థములేకదా! అది పిల్లలను బెట్టును, పాల నిచ్చును గాని యవి నీకుఁ బనికిరావు. వాని వలనఁ గుక్కపిల్లలకుఁ దృప్తికలుగును గాని మానవులకుఁ దృప్తి కాదు. కంకరరాళ్ళ గుట్టను ద్రవ్వివ రత్నము లెట్లు దొరకఁ గలవు? పాపముచే నుత్పన్నమైన సంతానము సదాచారులు కావలెననిన నా యాశ వ్యర్థము. వ్యావారి నిస్స్వార్థముగఁ బ్రేమించుకొనుట పొరపాటు. జీవు లీ వ్యర్థ సాంసారిక పదార్థ ముల కొఱకై ప్రయత్నించునెడల వారికి దుఃఖనివృత్తియును గాదు, శాశ్వతసుఖమును లభింపదు."

అంత విదురుఁ డిట్లనెను :- "ప్రభూ! ఇది నా కర్థము కాలేదు. అందరును ధనప్రాప్తికే ప్రయత్నించుచుందురు. ధనములేక లోకములోఁ గార్యము లెట్లు నడచును ? సుఖము ధనమువలననే లభింపఁగలదు."

అంత నవ్వుచు మైత్రేయ మహాముని యిట్లనెను :—
"విదురా! నీవు ధనమని దేని ననుచున్నావు?"

సరళతతో విదురుఁ డిట్లనెను :– "ధనమనఁగా రూప్యములు, కాసులు, బంగారు, వెండి, అన్నము, వస్త్ర మణి మాణిక్యములు."

మైత్రేయుఁ డిట్లనెను :– "మంచిదే, నేను నీకు బంగారు, వెండి, రూపాయలు, కాసులునిచ్చి జలము నీయకున్న సుఖం చెదవా?"

నవ్వి విదురుఁ డిట్లనెను :– "ఎట్లు కలుగును? స్వామీ! జలము లేకున్న జీవనమే లేదుగదా!"

మైత్రేయుఁ డిట్లనెను :– "జలము నిచ్చి గాలి నీయకున్నచో?"

"అప్పుడు కొలఁది క్షణములలోనే ప్రాణములు విడువవలసినదే" యని విదురుఁడు దృఢముగా ననెను.

అంత మైత్రేయుఁ డిట్లనెను :— "అట్లయిన రూప్యములు, కాసులు, బంగారు, వెండి, జలము, వాయువు — ఇవియేనా శ్రేష్ఠములు ?"

"అవును స్వామీ ! ధనముండినచో సమస్త వస్తువులు సరళముగఁ బ్రాప్తించి సుఖపడవచ్చు" నని విదురుఁ డనెను.

మైత్రేయుఁడు నవ్వుచు నిట్లనెను :— "విదురా ! ధనము గలవాఁడు సుఖముగ నుండుటను గాంచినావా"

విదురుఁ డిది విని చిక్కులోఁ బడెను. కొంచెము సేపటి కిట్లనెను :— "లేదు!"

అంత మైత్రేయుఁ డిట్లనెను :— "మహాభాగా ! ఇది లోకుల భ్రమ. భిక్షగాఁడు రైతు సుఖి యనుకొనును. ఏల యనఁగా నచ్చటనేగదా ఆతఁడు భిక్షమడుగుకొనునది. రైతు తనకు ఋణమిచ్చు ఋణదాత సుఖి యనుకొనును. చిన్న ఋణదాత రోజునకు లక్షలాదాయము వచ్చు పెద్దవ్యాపారి సుఖి యనుకొనును. ఆ పెద్ద వ్యాపారి నిత్యము పరిశ్రమలేకయే తనకు నమస్కరించు భూమిపతులనుండి పన్నులను గ్రహించు మండలాధీశ్వరుఁడే సుఖి యనుకొనును. మండలాధీశ్వరు లందఱు నెవనిద్వారమునఁ బడియుందురో అట్టి రాజు సుఖి యని వారనుకొందురు. సమస్త భూమండలమును శాసించు చక్రవర్తియే సుఖియని రాజులనుకొనుచుందురు. ఎప్పుడును వృద్ధులుగాక, నీరోగులై, నిత్యయౌవనముతో మదవతులగు నప్సరసలను బొందుచు స్వర్గములోని యమృతమును ద్రాగుచు, నందనవన పుష్పహారములను ధరించుచుండు దేవతలే సుఖులని చక్రవర్తు లనుకొనుచుందురు. త్రిలోకములకును, దమకును ప్రభువై అంతులేని భోగములను భోగించుచు, అంతు లేని యప్సరసల నాడించు నింద్రుఁడే సుఖియని దేవత లనుకొను

మైత్రేయుఁ డిట్లనెను:— "ఇది అంధపరంపరగ నలవాటైనది. వేలకొలఁది గ్రుడ్డివారిగుంపు పోవుచుండగా నందులో నొకఁ డిట్లనును :— 'కమలనయనా! త్రోవయేది?' రెండవవాఁ డిట్లనును :— 'రాజీవలోచనా! సరిగానే యిదియే త్రోవ'. ఇట్లు ఒకరివెంబడి మఱియొకరు నేత్రహీనులు పోవుచుండిరి. ముందు వాఁడు బావిలోఁబడఁగా, రెండవవాఁడు 'నయనసఖా! ఏమిటది? ధమ్మని మ్రోగినది, ఆ మ్రోత యేమి'టని యడుగఁగా బావిలోఁ బడినవాఁ డిట్లనును :— చాల గొప్ప ఆనందము. పంకజాక్షా! నేనొక వేట జంతువును గొట్టితిని. అందుకనియే ధం ధమ్మని అన్నియుఁ బడిపోవుచున్నవి'. ఇట్లే ప్రతివాఁడును దనకంటెఁ బెద్దవానిని గాంచి మృగతృష్ణలోఁ బడిపోవుచున్నారు. నిజమగు సుఖము శ్యామసుందరుని శరణములోనే కలదు. విషయాసక్తిని వీడి విశ్వంభరునియం దాసక్తి కలిగి యుండుటచేతనే సమస్త దుఃఖములు నశించును. అనిత్య పదార్థములపై మోహమును వీడి నిత్యానందస్వరూపుఁడును సచ్చిదానంద ఘన శ్రీ నందనందన చరణారవిందములపైఁ బ్రేమ నుంచినచో అట్టి వానికి మాత్రమే శాశ్వత శాంతి లభింపఁగలదు. విదురా! విషయములలో సుఖము లేదు; శాంతి లేదు; తృప్తి లేదు. అవి దుఃఖమును, అశాంతిని, అతృప్తిని బ్రసాదించునవి కాఁగలవు. కావున యథార్థ సుఖము నభిలషించువాఁడు విషయమోహమును వీడి భగవంతుని శరణుచొచ్చవలయును. అప్పుడే యథార్థమగు ప్రాప్య పదార్థము ప్రాప్తింపఁగలదు. ఇప్పుడు నేను నీ ప్రథమ ప్రశ్నకు సంక్షేపముగ సమాధాన మొసంగితిని. ఇఁక నిప్పుడు రెండవది యగు సృష్టివిషయక ప్రశ్నకుగూడ సమాధానము

సంక్షేపముగ నొసంగెదను. కావున దీనిని నీవు సావధానముగ వినుము."

సూతమహర్షి శౌనకాది మహామునులతో నిట్లనెను :—
"ఋషులారా ! ఆ తరువాత మైత్రేయ మహామునీశ్వరుఁడు విదురునకు సృష్టివిషయకమగు జ్ఞానమునుగూర్చి చెప్పెను. నేను దానిని ప్రసంగానుసారముగ వర్ణించెదను. ఇచ్చట నీ భాగవతకథా ప్రసంగమందు దాని సారమును మాత్రము చెప్పి భగవదవతార కథావర్ణనము చేయుదును. మీ రన్యథా తలంపకుఁడు" అని పలికి సూతుఁడు తర్వాత ప్రసంగమును జెప్పుట కుద్యమించెను.

—*—

# విదురుని మాయావిషయక శంక

శ్లో॥ బ్రహ్మన్ కథం భగవత శ్చిన్మాత్రస్యా వికారిణః।
లీలయా చాపి యుజ్యేరన్ నిర్గుణస్య గుణాః క్రియాః॥
క్రీడాయా ముద్యమోఽర్భస్య కామశ్చిక్రీడిషాన్యతః।
స్వతస్తృప్తస్య చ కథం నివృత్తస్య సదాన్యతః॥

—శ్రీమద్భాగ. ౩ స్కం. ౭ అ.౨, ౩ శ్లో.

క. అగుణుండగు నీశ్వరునకు
జగదవనోద్భవ వినాశ సత్కర్మములుం
దగులీలలకై న నాతఁడు
సగుణుండై యుండు టెట్లు సౌజన్యనిధీ.

సీ. అని యర్భకునిగతి యనుకొని మైత్రేయ
మునిఁజూచి విదురుఁ డిట్లనియె మరల
బాలుఁడు క్రీడావిలోలమానసమున
దీపించు లీలానురూపుఁడగుచుఁ
గానిచోఁ గామానుగతుఁడై రమించును
నర్భకుఁ డర్థి వస్త్వంతరమున
నర్భకాంతరమున నైనను బాల కే
ళీ సంగుఁడగుచు నోలిని జరించు

తే. హరియు నెపుడు నివృత్తుఁ డత్యంత తృప్తుఁ
డగుట వర్తించు టెట్లు క్రీడాదులందు
మఱియుఁ ద్రిగుణాత్మకంబైన మాయఁగూడి
యఖిల జగములఁ గల్పించె ననుట యెట్లు ?

— శ్రీమదాంధ్రభాగవతము.

—(•✱•)—

ఒకే ప్రశ్నను మాటిమాటికి పలుకుటచేతను, వినుటచేతను స్మరణము కల్గును. ఏదైన విషయమును పునఃపునః ఆవృత్తి కావించుటకే అభ్యాస మందురు. జీవుని కీ జగత్పదార్థములందలి పరివర్తనశీలతయు, అస్థిరతయు, అనిత్యతయు బాగుగ బోధపడినచో నీ వైషయిక పదార్థములందు గల ఆసక్తి వీడిపోవును. కారణమేమనఁగా ఆసక్తియే బంధనమునకు హేతువు. అందుకనియే సమస్త శాస్త్రములు ముందుగా సృష్టిక్రమమును వర్ణించి, యీ సృష్టికి మూలమందు నిత్య రూపముననున్న సర్వేశ్వరుఁడగు శ్రీహరిని గూర్చి చెప్పుచుండును.

దుఃఖహేతువును జెప్పి యిప్పుడు మైత్రేయుఁడు విదురునితో సృష్టిక్రమమునుగూర్చి చెప్పుచున్నాడు. ఆతఁ డిట్లనెను:—— "విదురా! సృష్టికి పూర్వ మీ విశ్వమంతయును బ్రహ్మమయమే. అప్పుడు శ్రీహరి యొక్కఁడే యుండెను. అంత నాతఁడు తన సదసద్రూప విలక్షణమగు మాయాశక్తి నాశ్రయించి యీ విశ్వబ్రహ్మాండమును రచించెను. త్రిగుణాత్మకయగు మాయయందు మాయాపతి తన యంశభూతమగు బురుషరూపముచేఁ జేతనరూపమగు బీజమును స్థాపించెను. ఇంతలోఁ గాలముకూడ వచ్చెను. అది బీజము నంటిపెట్టుకొనియే యుండును. అంత గర్భవతియగు మాయ మహత్తత్త్వమును గనెను. పుత్రుఁడే తనకు సదృశుఁడగు వానినిఁ బుట్టించి తాను తండ్రియగును, మహత్తత్త్వము అహంతత్త్వమును బుట్టించెను. అదియే కార్య, కారణ, కర్తృ రూపము న నుండుటచేఁ జాల సంతానము గలదయ్యెను. దాని

వలనఁ బంచభూతములు, దశేంద్రియములు, మనస్సు, ఇంద్రియాధిష్ఠాన దేవతలు, తన్మాత్రలు ఇవన్నియుఁ గలిగెను. ఇదియే మూఁడు రూపములై త్రిగుణాత్మకసృష్టిని రచించెను. ఈ యధిష్ఠాతృదేవత లందఱును విష్ణుని కళలే; కాని యివి వేఱువేఱుగ నుండుటచే తమ ప్రత్యేకరాగాలాపములు చేయ మొదలిడినవి. అవన్నియు నొక్కచోఁజేరక సృష్టిచేయఁజాలక పోవుటచే భగవంతుని శరణు వేఁడినవి. చేతులు జోడించి స్తుతింపసాగినవి. భగవంతుఁ డొక్కఁడయ్యు ననేకములుగాఁ గావలెననుకొనెను. ఆతఁడు కాలశక్తి నాశ్రయించి అంతర్యామిగాఁ బ్రవేశించెను. సర్వాంతర్యామియగు భగవానునకు జయమగుఁగాక ! ఇఁక బండి నడిచినది. సంసారచక్రము తిరుగ మొదలిడినది. ఆగిపోయిన సృష్టి మరల నారంభమయ్యెను. ఏలయనఁగా నా తత్త్వములందుఁ బ్రవేశింపఁగానే దానిలో నిద్రాణమైయున్న క్రియాశక్తి జాగృతి చెందెను, ఆతత్త్వములు హనుమంతుని వంటివి. వాటి కెవరును జెప్పకున్న నేమియును చేయఁజాలవు. అవియన్నియు నిప్పు డేకమై, తమ తమ యంశము లనేకము లొక్కటై విశ్వసృష్టిచేయు విరాట్పురుషుని బుట్టించెను. దానిలో నసంఖ్యాకులగు జీవులు మేడిపండులోని పురుగులవలె నుండెను. ఆ విరాట్పురుషుఁడు అండమువలె నుత్పన్నమయ్యెను. కావున నది పక్వమగుటకు సహస్ర దివ్యవర్షములు నీటిలోఁ బడియుండెను. పక్వము కాఁగానే దానికి ముఖము, కన్నులు, కర్ణములు, నాసిక ఇవన్నియు నేర్పడినవి. అది చిట్లెను. ఆ స్థానము లన్నిటిలోను నీ దేవతలు, ఇంద్రియములు తమతమ విషయములను వెంటబెట్టుకొని

ఆ యా స్థానములలో నధికారము వహించిరి. ఆ విరాడ్రూప మగు నండమునుండి చతుర్దశ భువనములును, త్రిలోకము లును నుత్పన్నము లయ్యెను. వేద, వర్ణాశ్రమాదులు నేర్ప డెను. సమస్తవర్ణము లుత్పన్నములై తమతమ వృత్తులను స్వీకరించిరి."

ఇది విని శౌనకుఁ డిట్లనెను:— "సూతా! నీవు నిమిష ములోఁ జెప్పితివే?"

అంత నవ్వి సూతుఁ డిట్లనెను:— "ఈ విషయ మతి గహనమైనది. ఈ భాగవతకథలో దానిని విస్తారము కావించిన కథా స్వారస్యమే చెడిపోవును. దీనిని విస్తారముగఁ జెప్పఁ గోరెదనేని దీని విస్తారమున కంతమే యుండఁజాలదు. కాల. కర్మ, స్వభావములతోఁ గూడుకొని చేయు లీలలను తన యోగ మాయా ప్రభావమును దెల్పు విరాట్పురుషుని రూపమును యథార్థముగ వర్ణింపఁగలవా రెవరున్నారు? ఇచ్చట కథాసం గతిని కల్పుకొనుట కెంత కావలయునో అంతయే చాలును. సృష్టి వర్ణనము గావించునప్పుడు చూడవచ్చును. ఇప్పుడు మీరు భగవ దవతారకథనే శ్రవణము చేయుఁడు. కథాశ్రవణము ననే కర్ణములు సార్థకము లగును."

శౌనకుఁ డిట్లనెను:— "మంచిది, సూతా! తర్వాత విదురుఁడు మైత్రేయు నేమని ప్రశ్నించెను?"

అంత సూతుఁ డిట్లనెను:— "నా గురుదేవుఁడు పరీక్షి న్మహారాజునకు చెప్పిన విధముగ విదుర మైత్రేయ సంవాద

మును మీకు సారాతిసారతత్త్వమును చెప్పుచున్నాను. మీరీ గూఢ రహస్యమును సమాహిత చిత్తముతో శ్రవణము చేయుఁడు."

భగవంతుడు మాయ నాశ్రయించి నిర్గుణుఁడయ్యు గాల కర్మలను స్వీకరించి జగత్సృష్టిని జేసినాఁడని విదురుఁడు విని యిట్లు ప్రశ్నించెను:— "ప్రభూ! ఈ విషయము నా మనస్సునకు రాలేదు. భగవంతుఁడు స్వతః తృప్తుఁడనియు, ఆతఁడు తన యానంద సుఖములకొఱకు వేఱుసామగ్రి నపేక్షింపఁడనియు, ఆతఁ డీ మాయిక గుణములు లేనివాఁడనియు, ఆతనిలో జడత లేదనియు, శుద్ధచైతన్య ఘనస్వరూపమనియు, వికార మాతని విషయములోఁ గల్పనయైన చేయరాదనియు, ఆతఁడు నిర్వికారుఁడు, నిరీహుఁడు, నిర్గుణుఁడు, అక్రియుఁడనియు మీరు చెప్పియుండిరి. అట్టివానికి నాశవంతములు, పరివర్తనశీలము గల మాయికగుణములతో సంబంధ మెట్లు కలుగఁగలదు?"

అంత మైత్రేయుఁ డిట్లనెను:— "విదురా! ఇప్పుడు 'ఎట్లు కలుగఁగలదు?' అనుదానిలో 'ఎట్లు' అనుదానికి సమాధాన మేమి? ఆతని యిచ్ఛ! బాలకునకు ఉత్సాహ ముదయించినపుడు, తన యానందముకొఱకు ఆటవస్తువులతో నాడుకొనును. అది చేసి, ఇది చేసి, తోటలు వేసి, దొడ్లుకట్టి. ఏనుఁగులను గుఱ్ఱములను తయారుచేసి, ఇష్టము వచ్చినంత సేపు ఆడుకొని చివరకు వాటినన్నిటిని పాడుచేసి, పాఱుద్రాగి, నిశ్చింతగ

నిద్రించును. ఇది ఆట. భగవల్లీలయు నిట్లే. దీనికి కారణ మేమియని చెప్పఁగలము?"

ఇది విని విదురుఁ డిట్లనెను:– "లేదు స్వామీ! దీని కట్లు కాదు. భగవంతుఁడు బాలకునివలెఁ గ్రీడించుచో నాతఁ డకర్తయు, నిరీహుఁడును, సంకల్పరహితుఁ డెట్లు కాఁగలఁడు? బాలకుని మనస్సులో మొట్టమొదట ఖేలనేచ్ఛ కలుగును. ఆడుట కేదైన సాధన యుండవలయును. కావున నాతఁడు ఆట వస్తువులు మొదలగు సాధనములను బ్రోవుచేయ వలయును. తన తోడివారిని ఆటలాడుటకుఁ జేర్చును. ఆడుటకుఁ బూర్వ మాతని కానందము లేదు. సామగ్రిని బ్రోవుచేసి ఆడుకొనఁగానే ఆతని కానందము కలుగుచున్నది. కోరిక లేకున్న పిల్లల హృదయములలో ఖేలనేచ్ఛయు, దానికై ప్రయత్నించుటయు సంభవింపనే సంభవింపదు. ఆతఁ డానందము కొఱకు బాహ్యసాధనములను బ్రోవుచేయవలసి యుండును. ఇఁక భగవానుఁడా తనలోఁ దానే నిమగ్నుఁడై యుండును. ఆత్మయందు రమించువాఁ డగుటచే నాత్మారాముఁ డగుచున్నాఁడు. ఆతనికి తన తృప్తి కొఱకు సాధనాపేక్షలేదు. ఆతఁ డద్వితీయుఁడు, సర్వసంబంధ రహితుఁడు, నిరాలంబుఁడు. ఆతఁడు లీలలకని యీ సృష్టి రూపమగు జంజాటములో నేల పడును? హేతురహితముగ జగదుత్పత్తి, స్థితి, లయములు జరుగవనుట అందఱకును దెలిసినదే. మాయలోఁబడి యిట్లు చేయుచున్నాఁడనుటకు భగవంతుఁడు అఖండ జ్ఞానస్వరూపుఁడు. ఆతని జ్ఞానమునకు లోపము దేశ, కాలావస్థాదులచేఁ గలుగఁజాలదు. అట్టి యెడ నాతఁడు

తెలిసి తెలిసి యీ బహురూపిణియగు మాయ నేల యాశ్రయించును? ఆతఁడు మాయ నాశ్రయించెనందుమా, ఆతనికి జనన మరణాది క్లేశములు కలిగితీరవలయును. కాని భగవంతుని కివి కలుగఁజాలవు. అయితే యిదంతయుఁ జాల చిక్కుగ నున్నది. నా యీ శంకను నివారింపుము."

ఇది విని మైత్రేయుఁడు నవ్వి యిట్లనెను:— "విదురా! మంచి ప్రశ్న వేసితివి. కాని నీ వీ ప్రశ్నయొక్క మూలము నకుఁ బోలేదు. భగవంతుఁడు కాల, కర్మ గుణములకు వశుఁడై జీవరూపమునఁ గ్లేశములను బొందినచో మనీషియగు వాఁడు మాయాకల్పన యేల చేయును? ఇప్పుడు చెప్పుము నీవు మాయ యని దేని ననుకొనుచున్నావో?"

విదురుఁ డిట్లనెను:— "ఈ యసజ్జగత్తు సత్యమానముగఁ గనఁబడుటలోనే మాయ యున్నది."

ప్రసన్నుడై మైత్రేయుఁ డిట్లనెను:— "అదిగో, నీవే నీ శంకకు సమాధాన మొసంగితివి. లేనిది ఉన్నట్లు తోఁచినను నెల్లప్పుడుండు సత్యస్వరూపుఁడగు భగవాను నెట్లు మోహ పెట్టఁగలదు? ఆతని కంశభూతుఁడగు జీవుని నెట్లు దుఃఖ పెట్టఁ గలదు?"

విదురుఁ డిట్లనెను:— "అయితే స్వామీ! ఈ సాంసారికు లేల దుఃఖమును బొందుచున్నారు? ఏల దీనదుఃఖులై యిటు నటుఁ దిరుగుచున్నారు?"

మైత్రేయు. డిట్లనెను:— "భక్తవరా! ఈ యేద్వే నేను నేర్పుచున్నాను. జీవునకుఁ గ్లేశ మెన్నడును గలుగుట లేదు. భగవంతున కంశభూతుఁడును, ఆతని యాశ్రయమున నుండు వాఁడు నగు జీవుఁడు సదా సుఖదుఃఖ రహితుఁడుగనే యుండును. మాయ యనఁగా లేకుండియు నున్నట్లు కనఁబడుటయే. నేఁటి వఱకు బూచి నెవఁడును జూడలేదు. కాని పిల్లలు బూచి యనఁగానే భయపడుచుందురు. ముత్తెపుచిప్పనుండి వెండిని దీసిన వాఁడెవఁడైన నున్నాఁడా? కాని దూరమునుండి ముత్తెపు చిప్పను గాంచితిమా భ్రమ అందఱకును గలిగితీరును. చీకటిలో వంకర టిఁకరగా సర్పాకారమునఁ బడియుండిన రజ్జు వెవరి నైన గఱచినదా? కాని దానిని గాంచి అందఱు నిప్పటికిని భయపడుచుందురు. పొలములలో కఱ్ఱను బాతి దానికి చెత్తను గుడ్డలను జుట్టి ఒక మనుష్యునివలెఁ జేసి దృష్టిబొమ్మలను కావలి పెట్టుదురు. ఎప్పుడైన నా బొమ్మ హరిణ, జంబుకాదులను పొలములోని పంటఁ దినకుండ త్రోలినదా? కాని జంతువులు మనుష్యుఁ డచ్చట నున్నాఁడని భయపడి పాఱిపోవుచుండును. వేగముగఁ బోవు నౌకలోఁ గూర్చుండికాని, వేగముగఁబోవు వాహనమునఁ గూర్చుండికాని పోవుచుండిన ప్రక్కలందున్న చెట్లు తమ వైపున కెదురుగాఁ బరువిడుచున్నట్లు కనఁబడును, కాని అట్లవి పరుగిడుచున్నవా? జలములోఁ బ్రతిబింబించు చంద్రుఁడు వాయువశమునఁ గదులుచున్నట్లు అజ్ఞులు తలంతురు; కాని చంద్రునిలోఁ గంపము కలదా? అతఁడు వాస్తవిక చంద్రుడా? కేవలము జలము కంపించుటచే దానియందు మిథ్యగాఁ దోఁచుచున్నది. పిల్ల లల్లాబిల్లి గిఱ్ఱునఁ దిరిగి భూమి, చెట్లు గిఱ్ఱునఁ

దిరుగుచున్నట్లును నృత్యము చేయుచున్నట్లును దలఁచును. అది నిజమా? రోగమువలనఁగాని, కంటిమీఁద వ్రేలితో నొత్తి గాని రెండు రెండు సూర్యచంద్రులను గాంచిన, సూర్యులిద్దరు చంద్రు లిద్దరైనారా? హరిణములు ఎండాకాలములో నెండ మావులను నెడారులందు గాంచి నీరున్నదని పరువిడును. ఆ జలమున నే మృగమును నింతవఱకు దప్పిక తీర్చుకొనలేదు. కాని ఆ భ్రమ మృగముల కింకను గలదు. రూప్యములు వచ్చినచో ఇవి నా రూపాయలనును, కాని రూపాయలెవని వైన కాఁగలవా? కాని యివి నావి నావి యని యిప్పటికిని అందఱు నాసక్తి చెందుచుందురు. స్వప్నములో ఆఁకలి యగుచుండును, దప్పిక యగుచుండును, దుఃఖము కలుగుచుండును. శిరస్సును దెగఁ గొట్టినట్లును స్వప్నము వచ్చుచుండును. ఆ సమయమున దుఃఖము కూడ కలుగుచుండును. నిద్రలేవఁగానే తెగిన తలను గాంచఁగలమా? కాని స్వప్నములో నీ భ్రమ సత్యముగఁ దోఁచును. ఏనుఁగును బట్టువాఁడు కొయ్య ఆడ ఏనుఁగును జేసి యుంచును. మగయేనుఁగు దానియం దాసక్తి చెంది పోయి చిక్కుపడును. ఇట్టి కొయ్యఏనుఁగువలన నేనుఁగునకు కామ తృప్తి కలుగునా? కాని యీ భ్రమ యేనుఁగుల కుండితీరును. ఈ విధముగ నిట్లన్నియు నున్నను ఆయా వస్తువులు తోఁచునట్లు, ఆత్మయందును సుఖదుఃఖాది యనాత్మగుణములు లేకున్నను ఉన్నట్లు కనఁబడును."

విదురుఁ డిట్లనెను :— "స్వామీ! ఈ భ్రమ యెప్పటి నుండి కలిగినది ? ఇది ఆదియా, అనాదియా ?"

ఇది విని మైత్రేయుఁడు బిగ్గఱగ నవ్వి యిట్లనెను :—
"విదురా ! ఇప్పుడు నన్ను నీవు భ్రమపెట్టఁ దలఁచుచున్నావు.
ఇప్పుడు నేను దేని ఆదిని గూర్చి చెప్పునెడల సృష్ట్యంతమున
నీ భ్రమకు అంతము కావలయును. అట్లగుట లేదు. దీనిని
అనాది యందుమా దీనిని భగవంతునకుఁ దమ్మునిగాఁ దలఁతువు.
కావున నేమైన ననుకొనుము - ఇది మాయకు తమ్ముఁడే."

విదురుఁ డిట్లనెను :— "అట్లు కాదు స్వామీ ! నేను
మిమ్ములను జిక్కులో భ్రమపెట్టుటకు కాదు అట్లనినది. మాయా
సోదరుఁడో లేక భగవంతునికేనో ఇది భ్రమగానున్నది.
ఇఁక మాయారూపమును గూర్చి యథార్థముగఁ జెప్పరేమి ?"

నవ్వి మైత్రేయ మహాముని యిట్లనెను :— "విదురా !
బహురూపిణియగు నీ మాయయొక్క యథార్థరూపమును గూర్చి
నేనేమి చెప్పుదును ? నీవీ మాయాచక్రమును వీడుము."

విదురుఁ డిట్లనెను :— "పోనీయుఁడు స్వామీ ! దేని
రూపవర్ణాదులు మన కేల ? ఈ మాయాజాలమునుండి బయట
పడున దెట్లో చెప్పుఁడు"

మైత్రేయుఁ డిట్లనెను :— కర్మయొనర్చిన నది యెన్నటికిని
వదలనే వదలదు. కర్మయే దీనిలోఁ బడవేయు వల. శుభా
శుభకర్మలు చేసినకొలఁది బంధనము ముడి బిగిసిపోవును."

విదురుఁ డిట్లనెను :— "జీవి కర్మచేయక యెట్లుండఁ
గలఁడు? ఒక్కక్షణమైనఁ గర్మచేయక ఊరక కూర్చుండలేఁడు."

మైత్రేయుఁ డిట్లనెను :– "కర్మను గోరికతోఁ జేయరాదు. భగవత్ప్రీతిగా నాతని పూజార్చనలు, ఉపాసన మొదలగు కర్మలు చేయవలయును. ఇట్లు భగవంతునియందే మనస్సు నుంచి, ఆతని కొఱకే కర్మలొనర్చి, ఆతనినే శరణుచొచ్చుటచే నాతని కృపచే నీ మాయాభ్రమ తొలఁగిపోవును. దీనినిఁబోఁగొట్టుకొనుటకు వేరుమార్గము లేదు. ప్రసన్నుఁడగుట – శరణాగతుఁడగుట – ఆత్మసమర్పణము చేయుట – సర్వస్వ మాతఁడేయని యాతనికి కింకరుఁడగుట. ఇదియే మాయ వదలిపోవుటకును, భ్రమ నుండి బయటపడుటకును నుపాయము. పల్లెవాఁడు వల వేయఁగా దూరమున నున్న చేఁప దానిలోఁ జిక్కుకొనును. దగ్గఱగా నాతని కాళ్ళదగ్గఱ నున్నది రక్షింపఁబడుచున్నది. కావున భగవంతునకు దూరముగాఁ బోకుము. ఆతని చరణముల నాశ్రయింపుము. మొఱుగుచున్న కుక్కను నెంతగా దాని నోరు మూసిన నంతగా నది మొఱుగుచుండును. వెంటనే దాని యజమానికడకు బోవుచో తోఁక నాడించుచు మెదలకుండును. ఏ పిల్లయైనఁ బోట్లాడుచుండిన నామె తండ్రిదగ్గఱకుఁ బోయినచో నామె వెంటనే సిగ్గుజెందును. నీవు నీ నవ వివాహిత మిత్రుని సమారాధనపంక్తిలోఁ కూర్చుండక వంట యింటిలోనికిఁ బోయిన నీకు భోజనము లభింపకపోఁగా నాల్గు చీవాట్లుకూడ తినవలసి వచ్చును. వంటయింటిలోనికి పోవక మిత్రునితోఁ బంక్తిలోనికి పోయి, ఆతని యాశ్రయమును గ్రహించి వంటయింటిలోనికి బోయిన భోజనము, ఆదరమును లభింపఁగలదు. అప్పు డవ

